ISSN No:2581-7477

సాహిత్య

# ప్రస్థానం

జనవరి 2020

వెల రూ. 20



బండి నారాయణ స్వామికి
కేంద్ర సాహిత్య
అకాడమీ పురస్కారం



గొల్లపూడి మారుతీ రావు

1939 - 2019



నవోదయ రామ్మోహన్ రావు

1934 - 2019

సాహితీస్రవంతి

KRSA102M334

సాహిత్య ప్రస్థానం జనవరి 2020

సంపుటి : 19 సంపాదకీయం సంచిక : 1

# సంఘటనా భరితం..

నూతన సహస్రాబ్దిలో మలి దశాబ్ది ముగిసిపోతున్నది. భారతదేశానికి తెలుగు వాళ్లకూ కూడా ఇది చాలా సంఘటనా భరితమైన కాలం. రాజకీయ సామాజిక రంగాలలో పెను మార్పులు చూశాం. ప్రతీప శక్తుల పన్నాగాలను ఛేదించి ప్రజాస్వామ్యాన్ని ప్రగతినీ కాపాడుకోవడానికి పురోగామి సాహిత్య జీవులు స్వతంత్ర భావుకులూ సాహసంతో పోరాడారు. బిరుదులూ త్యజించారు. ఆంక్షలూ ఛేదించారు. ఆ విధంగా తమ చైతన్యాన్ని చాటి చెప్పారు. ప్రత్యేకించి ఈ చివరి ఏడాది 2019 నూతన ప్రభుత్వాలను తీసుకొచ్చింది. కొత్త సవాళ్లూ విసిరింది. సాహిత్య ప్రస్థానం మొదటి నుంచి హెచ్చరిస్తున్నట్టే మతతత్వ రాజకీయాలూ, ప్రపంచీకరణ విధానాలూ దేశ ఆర్థిక వికాసంతో పాటు భాషా సంస్కృతులకు కూడా ముప్పుగా మారుతున్నాయి. దిశ ఉదంతం లాటివి దిగ్భ్రాంతి కలిగించాయి. రాజ్యాంగ మౌలిక విలువలకు విరుద్ధంగా మత బద్ధమైన పౌరసత్వ ప్రదానం కోసం తెచ్చిన సిఎఎపై రచయితలు పోరాడవలసి వచ్చింది. దేశీయ భాషలను హరించే ఇంగ్లీషు తాకిడికి తెలుగు మీడియం కనుమరుగవుతున్నది. అదనంగా రాజధాని రాజకీయాలు ఎపి ప్రజలను కలవరపెడుతున్నాయి. వీటికి సంబంధించిన రకరకాల వాదనలు ప్రజలను తికమకపెడుతున్నాయి. ఈ మూడు తీవ్ర సవాళ్ల మధ్య ముగిసిపోతున్న 2019 వచ్చే ఏడాది 2020 ప్రారంభంలోనే బృహత్తర కర్తవ్యాలను ముందుంచుతూ సెలవు తీసుకొంటోంది.

♦♦♦

నాటకకర్తగా రచయితగా నటుడుగా వక్తగా బహుముఖ ప్రజ్ఞావంతుడైన గొల్లపూడి మారుతీరావు ఇటీవలే కన్నుమూశారు. సాహిత్య లోకంలో పుస్తక ప్రపంచంలో నవోదయం నింపిన రామమోహనరావూ దూరమయ్యారు. వీరే గాక మరికొందరు ప్రముఖులు కూడా సెలవు తీసుకున్నారు. వారి వారసత్వాన్ని ప్రత్యేక సేవలనూ తలుచుకుంటూ అక్షరాంజలి అర్పిద్దాం.

♦♦♦

బండి నారాయణ స్వామి శప్తభూమికి కేంద్ర సాహిత్య పురస్కారం ఏడాది చివరలో సాహిత్య లోకానికి హర్షం కలిగించిన నిర్ణయం. తెలుగు వారి సృజన వికాసానికి ఇలాంటివి సంకేతాలుగా చూడొచ్చు. సాహిత్య సంస్థలూ అభిమానులూ కూడా ఈ కాలంలో ఇతోధికంగా సేవ చేశాయి,

♦♦♦

సాహితీ స్రవంతి ఇతర సంస్థలతో కలసి అనేక కార్యక్రమాలు నిర్వహించింది. 2020 మహాకవి శ్రీశ్రీ 110వ జయంతితో పాటు సాహితీ స్రవంతి ఇరవయ్యవ వార్షికోత్సవం కూడా. వాటిని జయప్రదంగా నిర్వహించడంతో పాటు సాహిత్య రంగాన్ని సంస్థనూ ప్రస్థానం పత్రికనూ బలోపేతం చేసుకోవలసిన బాధ్యత మనందరిపై వుంది. అందుకు అందరి సహకారం కోరతాం. ♦



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- • 5 సంవత్సరాల చందా రూ.1000/
• 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## ఈ సంచికలో ▫ సాహిత్య ప్రస్థానం జనవరి 2020

### కథలు



### కవితలు



### వ్యాసాలు



గజల్

## వెతకాలి..

*బంధాలను ముదిమివయసు ముడుతల్లో వెతకాలి!*
*అందాలను శిల్పిచేతి గీతల్లో వెతకాలి!!*

*మంచితనమె మరుగునపడి మనిషి*
*మాయమౌతుంటె!*
*మానవతను కవుల కవనరాతల్లో వెతకాలి!!*

*రెక్కలొచ్చి పక్షులన్ని గూడునొదిలి పోతుంటె!*
*మమతకొరకు తల్లిగుండె కోతల్లో వెతకాలి!!*


- వైష్ణవిశ్రీ
8074210263




*త్యాగధనుల గాధలన్ని మరుగునపడి మూగబోతె!*
*విలువలున్న చదువుచెట్టు పూతల్లో వెతకాలి!!*

*మమతలున్న మనసుకొరకు నిరీక్షించు వైష్ణవీ*
*అంతరంగమందు ఆత్మ గీతల్లో వెతకాలి!!*

♦

# ప్రాణ భాష



- ఉదయమిత్ర
9985203376

*"రోజు భాషే కావాలి.../రాజ భాష కాదు..."*
- వద్దే బోయిన శ్రీనివాస్

రజినిగంధ..చైతన్య పురి..గౌతమి కాలేజీ..కిక్కిరిసిన జనసందోహం.

బిక్కుబిక్కు మంటూ క్యాంపస్‌లో అడుగుపెట్టాను. అంతా కొత్తకొత్తగా వింతవింతగా ఉంది. ఏదో వేరే గ్రహం నుండి వచ్చిన "ఏలియన్" ల ఉన్నాను నేను. కార్పొరేట్ ప్రపంచంలోకి కాలు మోపానో లేదో నన్నేదో పరాయితనం ఆవహించేసింది.

పిల్లలకి టీ బ్రేక్ లాంటిదేదో ఇచ్చినట్టున్నారు. ఒక్కసారిగా సీతాకోకలు రెక్కలు విప్పుకొని చెట్ల మీద వాలినట్టుగా ఉంది. ఓహో! వీళ్లంతా కాబోయే డాక్టర్లన్న మాట. వాళ్ళంతా నుతారంగా నాగరికంగా నవ్వుతూ తుళ్లుతూ మాట్లాడేసుకుంటున్నారు. కొంత అర్థం అయి కొంత అర్థం కాక అయోమయం.

లోపల అంతట కలెదిరిగాను. ప్లైవుడ్ పలకలు పెట్టి రూములుగా విభజించి దాంట్లో వివిధ శాఖల వాళ్ళు కూర్చొని ఉన్నారు. అందరు బిజీ బిజీగా ఉన్నారు. "ఇంతకి నా డౌట్స్ ఎవరు తీరుస్తారబ్బా?" నా పరేషాన్ నాది.

అక్కడ ఎవరో మేడం కుర్చీ వేసుకొని కూర్చునుంది. నడి వయసు మనిషి. "ఈమెను మన డౌట్స్ అడిగేయొచ్చు" అనిపించింది. కాస్త బెరుగ్గానే సమీపించాను.

"నమస్తే మేడం" అన్నాను పలకరింపుగా..

"నమస్తే, చెప్పండి" అంది హుందాగా.

"ఏం లేదు మేడం" అని కాసేపు ఆగి," మా అమ్మాయి స్వాతి జడ్చర్లలో పదో తరగతి వరకు తెలుగు మీడియంలో చదివిం. తాను ఇక్కడ **bi.p.c** చేయాలనుకుంటున్నది. ఇంతకు తెలుగు మీడియం వాళ్ళకి ర్యాంకులు ఒస్తాయా?" అన్నాను జంకుగానే.

ఆమె చిరునవ్వి, "ఏం పర్లేదు సర్..మీకా డౌట్ అక్కర్లేదు. మా కాలేజీలో ర్యాంకులు తెచ్చేది ఎక్కువగా తెలుగు మీడియం విద్యార్థులే" అంది.

"నిజమా?" అన్నాను సంభ్రమాశ్చర్యాలతో.

"అవును సర్. మీరు నిరభ్యంతరంగా మీ అమ్మాయిని మా కాలేజీ లో జాయిన్ చేయొచ్చు" అందామె భరోసాగా.ఆమె నిజం మాట్లాడుతుందో లేక నా మెప్పు కోసం మాట్లాడుతుందో అర్థం కాలేదు.

"అవునా..ఇక్కడ అంతా ఇంగ్లీష్ మీడియం పిల్లలు కదా? మరి మా తెలుగు మీడియం పిల్లలు అడ్జస్ట్ అవుతారో లేదో" అన్నాను నీళ్ళు నములుతూ.

"ఓ..అదా..ఆ భయం మీకు అక్కర్లేదు. కొద్ది నెలల్లో

తెలుగు నుంచి ఇంగ్లీష్ కు వాళ్ళే అడాప్ట్ అయిపోతారు. అన్నీ చక్కబడుతాయి. కాకపోతే టెన్షన్ పెట్టుకోవద్దు"

ఎందుకో గాని ఆమె మాటలు విన్నాక సముద్రాన్ని ఈదడానికి చిన్న పడవ దొరికినట్టు అనిపించింది. మెడిసిన్ చదవాలనుకున్న మా అమ్మాయికి కాస్త భరోసా ఇచ్చినట్టైంది.

♦♦♦

మెడిసిన్ అనేది అందరిలాగే మాకు ఒక కల. మా కుటుంబాలలో ఇప్పటిదాక ఎవరు డాక్టర్లు కాలేదు. మా శ్రీమతి సుజాతను డాక్టర్ కోర్స్ చేయించాలి అని వాళ్ళ నాయన చాల ప్రయత్నించాడట. అప్పట్లో అది కుదరలేదు. తన కోరిక తన బిడ్డ ద్వార తీరాలని ఆమె ఆశ. దానికి తోడు మా స్వాతి కూడా పట్టుదలగా తెలుగు మీడియంలోనే చదివి డిస్టింక్షన్ లో పాస్ ఐంది. ఇక చూడాలి ఏమైతదో.

♦♦♦

ఆ రోజు జాయినింగ్ రోజు.

అనేక జిల్లాల నుంచి ఒచ్చిన పిల్లలతో తల్లిదండ్రులతో జనప్రవాహంలా ఉంది. ఓ పల్లెటూరి నుండి ఒచ్చిన మా స్వాతి ఈ గుంపులో అడ్జస్ట్ అవుతుందా? అనలే బిడియస్తురాలు. ఓ పట్టాన మందిలో కలవదు.

♦♦♦

ఎట్టకేలకు సీట్ దొరకి మా స్వాతికి రూమ్ అలాట్ చేసారు. అందులో పదిమందిని ఉంచారు. ఉంచారు అనడం కంటే కుక్కేశారు అంటే బావుంటది. ఒక నలుగురైదుగురు ఉండాల్సిన రూమ్ అది. కోళ్ళను గంపల పెట్టి మూసినట్టు రూముకు పది మందిని చొప్పించి పని నడిపిస్తారు. ఇక **adjustment** ఇక్కడ్నుంచి మొదలవుతుందన్న మాట. పేరు గొప్ప ఊరు దిబ్బ.

"అమ్మా నా రూములో నేను ఒక్కదాన్నే తెలుగుమీడియం. తక్కిన తొమ్మిది మంది ఇంగ్లీష్ మీడియం" అంది స్వాతి నిస్సత్తువగా.

"పర్వాలేదు లేరా మెల్ల మెల్లగా అన్ని సర్దుకుంటాయి" అంది సుజాత.

"ఏం సర్దుకుంటాయో ఏమో", అని నిట్టూర్చి "అసలే ఈ ఇంగ్లీష్ మీడియం వాళ్ళు తెలుగు మీడియం వాళ్ళని తక్కువ చూస్తారట. ఎట్ల అడ్జస్ట్ కావాల్నో ఏమో...చూస్తా.. కొన్ని రోజులు సిరీయస్‌గా కష్టపడ్త. వీలుకాకపోతే ఇంటికొచ్చేస్త."

"నీ ఇష్టం" అంది సుజాత

♦♦♦

పుండు మీద కారం చల్లినట్టు..ఆ రోజే మా స్వాతిని మరింత ఒంటరి చేసే ఘటన మరొకటి జరిగింది.

పోయి పోయి వీల్ల రూమ్‌లోకి ఒక విదేశీ అమ్మాయి ఒచ్చి చేరింది. తెల్లగా బొద్దుగా ఉండే ఆ అమ్మాయిది అర్జెంటినా. ప్రపంచం అంతా విడిచి ఇక్కడ ఎందుకు చేరిందో నా బుర్రకు అర్థం కాలేదు.

సహజంగానే ఆ పిల్లకు తెలుగు రాదు. ఇంగ్లీషులోనే మాట్లాడుతుంది. ఇంకేముంది బెల్లం చుట్టూ ఈగలు ముసిరినట్టు ఆ రూములోని విద్యార్థినులందరూ ఆమె చుట్టూ చేరి ఇంగ్లీష్‌లో మాట్లాడడం మొదలు పెట్టారు. వాళ్ళు ఆమెతో మాట్లాడడం ప్రివిలేజిగా భావించారు. కాని ఆ పక్కనే ఉన్న మా స్వాతిని పట్టించుకోలేదు. ఎంతైనా తెలుగు మీడియం కదా.

భాషనె కాదు జాతి కూడా మనుషులని విడదీస్తుందన్నమాట.

బిక్కు బిక్కు మంటూ అందరిని మౌనంగా గమనిస్తూ కూసున్నది మా స్వాతి ఒక్కతే. తనకు ఇంగ్లీష్ బాగా అర్థం అవుతుంది. కాని దాటిగా మాట్లాడడం రాదు. వాళ్ళ స్కూల్ లో ఆ వాతావరణం లేదు మరి. ఇంగ్లీష్‌లో ఎప్పుడన్నా ఒకటి రెండు వాక్యాలు మాట్లాడితే తక్కిన వాళ్ళు వింతగా చూసేవాళ్ళు. దాంతో ఆమె గమ్మున ఉండిపోయేది. వాళ్ళ స్కూల్‌లో ఇంగ్లీష్ టీచర్లు కూడా తెలుగులోనే బోధించే వాళ్ళు. పూర్తి గా తెలుగు వాతావరణం నుంచి వచ్చిందామె.

♦♦♦

ఏది ఏమైనా ఈ అర్జెంటినా పోరి అర్జంటుగా వచ్చేసి మా స్వాతికి తక్కిన వాళ్ళకి దూరాన్ని మరింతగా పెంచేసింది.(ఆ తర్వాత మూడు రోజుల్లోనే ఆ పిల్ల వెళ్ళిపోయిందట. అది వేరే విషయం)

నిబ్బరంగా ఉండమని చెప్పడం తప్ప మరేమీ చేయలేని నిస్సహాయ స్థితి. ఈ కొత్త వాతావరణంలో మా స్వాతి ఎలా నెగ్గుకొస్తుందో చూడాలి.

సెలవు తీసుకోని వస్తుంటే స్వాతి కళ్ళల్లో నీళ్ళు. అవి తాను అనుభవించబోయే ఒంటరి జీవితానికి ఆనవాల్లేమో. కొత్త పెళ్లి కూతురిని అత్తవారింట్లో వదిలినట్టు ఆమెను క్యాంపస్ లో వదిలి భారంగా బయట పడ్డాము.

బయటికి ఒస్తుంటే ఒక రెడ్డి ఎదురువడి "సర్..అందరిలోకి మీ అమ్మాయే దల్గ ఉంది" వెక్కిరింపుగా నవ్వాడు. అందులో "మీ అమ్మాయి తెలుగు మీడియం సుమా" అని దెప్పిపొడిచినట్టు అనిపించింది.

♦♦♦

చూస్తుండగానే మూడు నెలలు గడిచిపోయాయి.

నాకు వీలైనప్పుడల్లా వారాంతాలలో కాలేజికి పోయి వచ్చేవాన్ని "ఎన్ని మార్కులు వొచ్చాయి" అని ఎప్పుడు అడిగేవాణ్ణి కాదు." ధైర్యంగా ఉండు" అని మాత్రం చెప్పేవాన్ని.

తలుపులు ముస్తున్నాం. తెరుస్తున్నాం. గాలి రావడం లేదు అన్న చందంగా నేను పోతున్న ఒస్తున్న గాని ఏ విషయాలు తెలియడం లేదు. తాను రోజు రోజుకి మౌనం లోకి వెళ్ళిపోతోంది. ఏమైనా గుచ్చి గుచ్చి అడిగితే "ఏం లేదు. బాగుంది. పర్వాలేదు. విసిగించకు" అనేది రూమ్ మేట్స్‌ని అడిగితే వాళ్ళు కూడా పొడి పొడి గానే జవాబు చెప్పే వాళ్ళు.

కొత్త గదా అన్ని సర్దుకపోతాయి అనుకున్నాం.

♦♦♦

మూడు రోజులు సెలవులు.

ఓ రోజు "స్కూటీ నేర్చుకుంటా నాన్న, బయటికి పోదాం" అంది స్వాతి

ఇద్దరం మైదానానికి వెళ్ళాం. కాసేపు ప్రాక్టీసు చేసింది. ఏమనుకుందో ఏమో నా పక్కన వొచ్చి కూసుంది.

"నానా...ఒకటడుగనా" అంది సందేహంగా

"ఒకటేందుకు...వంద అడుగు" అన్నాను నవ్వుతూ.

"ఈ తెలుగు మీడియం వాళ్ళంటే ఇంగ్లీష్ మీడియం వాళ్ళకి ఎందుకంత చులకన? అందరం తెలుగు వాళ్ళమే కదా"

"నిజమే రా..ఈ బానిస బుద్ధి ఇప్పటిది కాదు. చాల రోజులైంది ఇది మొదలై. సొంత భాష పట్ల చులకన భావం మనకు అలవాటు పడిపోయింది. కాని పక్కన గల కర్ణాటక తమిళనాడు వాళ్ళల్లో ఇది కనపడదు. వాళ్ళకు తమ మాతృభాష పట్ల ప్రేమ ఉంటూనే ఇంగ్లీష్ కూడా నేర్చుకుంటారు."

"మరి మన భాష పట్ల మనకెందుకు ఇంత చులకన?"

"చెప్పాను కదా...అది చాల పెద్ద చరిత్ర. ఇప్పుడు కుదరదు కాని మీ కాలేజి సంగతులు చెప్పు ముందు"

"ఏముంది చెప్పనికే. పరాయి రాజ్యాన పరాయి వాళ్ళలాగా బతికేస్తున్నాము. ఈ మూడు నెలలు నరకం అనుభవించింది మాత్రం నిజం."

"ఏమైంది రా...కనీసం ఇప్పుడన్నా చెప్పు" అన్నాను కాస్త పరేషాన్ గా.

"ఈ ఇంగ్లీష్ మీడియం వాళ్ళు ఎంత చేసిన మాతో కలువరు నానా. మమ్ములను అంటరాని వాళ్ళుగా చూస్తారు. క్లాసు లేమో మొత్తం ఇంగ్లీష్‌లో ఉండి చస్తాయి. ఒక్క తెలుగు ముక్క మాట్లాడరు."

"బాగా కష్టం కదరా"

"ఆ వాతావరణానికి అడాప్ట్ కావడానికి నేను ఎంతెంత అవస్థలు పడ్డానో ఆ దేవునికెరుక."

"ఎప్పుడన్నా మీ రూమ్ మేట్స్‌ని ఏదన్న డౌట్స్ అడుగుతుంటివా"

"హు...అదో కథ...ఎందుకడగను మస్తుగ అడుగుతుంటి కాని అడిగితె

"అబ్బా...మమ్మల్ని డిస్టర్బ్ చేయొద్దబ్బ ప్లీజ్ మేం చదువుకోవాలి టైం వేస్ట్ చేయొద్దు." అంటూ మెల్లిగా తప్పించుకు పోయేవారు.

"అది సరే పోనీ క్లాసు రూమ్‌లో ఎట్లుండే వాళ్ళు "

"ఇంగెట్లుటరు..అదే సీను రిపీట్ అయ్యేది. మేం తెలుగు మీడియం వాళ్ళం పది మందిమి ఒక వైపు. తక్కిన 140 మంది ఇంగ్లీష్ మీడియం వాళ్ళు మరో వైపు కూచునెటోల్లం. మా లెక్చరర్లు మమ్ములను కలుపుకుపోండి అని అవతలి వాళ్ళకి ఎన్ని సార్లు చెప్పినా వాళ్ళు పట్టించుకునే వాళ్ళు కాదు. వాల్లేమో ముందర బెంచిల మేమేమో వెనక బెంచిల..దూర దూరంగా. వాళ్ళేమో లెక్చరర్ల ప్రశ్నలకు లేచి లేచి జవాబులు చెపుతుంటే మాకు జవాబులు అంతే ధీటుగా చెప్పాలి అనిపించేది. కాని ఇంగ్లీష్‌ల చెప్పడానికి ఏదో అడ్డం ఒచ్చేది. "గుండె గొంతుక దగ్గరికి ఒచ్చి కోట్లాడినట్టు ఉండేది".

"ఇదంతా మాతో ఎందుకు చెప్పలేదు రా"

"చెప్తే ఏం చేస్తారు. ఇంటికి రమ్మంటరు. ఆడనే యాడనన్న చదువమంటారు. లేదా పెండ్లంటారు. ఓడిపోయిన చోటనే గెలివాలి కదా"

"నిజమే"

"నేను ఈ పరిస్థితిని ఛాలెంజ్‌గా తీసుకున్న. లోపల్లోపల కసి మొదలైంది. తెలుగు మీడియం వాళ్ళు ఎవరికీ తీసిపోరు" అని గట్టిగ స్టేజి ఎక్కి అరవాలనిపించింది. ఈ వాతావరణానికి

అలవాటు పడలేక ఆదిలాబాద్ నుండి ఒచ్చిన అమ్మాయిలు ఏడ్చుకుంటూ ఇంటికెల్లిపోయారు తెలుసా?"

"పాపం గదా..ఇంత ఘర్షణ పడాల్నా?"

"తప్పదు నానా..ఘర్షణ లేనిది ఏమున్నది చెప్పు..కొన్ని పొందాలి అంటే కొన్ని కోల్పోవాలని మీరే కదా చెప్పింది"

కాసేపు మౌనం.....

ఈసారి నా కళ్ళలో నీళ్ళు..కొంచెంసేపు ఏమి మాట్లాడుకోలేదు. వెదురు చెట్టు మీద పిట్టలు తోకలూపుకుంటూ ఏవేవో మాట్లాడుకుంటున్నాయి.

"ఆ చెట్టు మీద పిట్టలు మాకన్నా నయం నాన్నా"అంది కొనసాగింపుగా. పంజరంలో పక్షిలాంటిది కార్పొరేట్ చదువు. బయటికి రాలేం. లోపల ఉండిపోలెం." గద్గదమైంది గొంతు.

"క్లాసులు అయిపోయినాంక అదో నరకం...రాత్రి 11గంటలకు పండుకోవాలి...పొద్దున్నే 5 గంటలకి లేవాలి. 6 గంటలకల్లా క్లాసు రూములకి పరుగెత్తాలి. అందరం ఒకేసారి టాయిలెట్లకు ఎగబడే సరికి, వాతావరణం ఎట్లుంటుందో చెప్పలేం...ఆడపిల్లలంగదా ఎన్నో ప్రత్యేక సమస్యలు...."

"ఎట్లనో స్నానం చేసి, క్లాసురూములకి ఒస్తే...లెక్చరర్ ఇంగ్లీష్ మీడియంల ఏదోదో చెప్పేటోడు..ఆ వేగం ఆ పదజాలం మా వల్ల అయ్యేది గాదు. పక్కన ఇంగ్లీష్ మీడియం పిల్లలని అడిగితె విసుక్కునేటోల్లు. అప్పటికి వాళ్ళ ర్యాంకులను మేమేదో గుంజుకుపోతున్నట్టు ఫీలయ్యేవారు."

"ఇవన్ని ఏ కొంచం కూడా మాకు చెప్పలేదురా."

"మీకు చెప్పుకోలేకా, అక్కడ అడ్జస్ట్ కాలేకా విపరీతమైన డిప్రెషన్లకి వెళ్ళిపోయాను. ఒక దశలో ఆత్మహత్య చేసుకుందాం అని అనుకున్న. ఒకసారి ప్రయత్నం చేసిన గూడ..కాని మీరు యాదికొచ్చి ఊకున్న."

"so..మా మీద నమ్మకం కుదరలేదన్నమాట."

"అదేం లేదు నాన్న...నువ్వు కాసేపు మాట్లాడకు." అంటూ నా భుజం మీద తల వాల్చింది. మౌనపు దుఃఖం...ఏడవనీ...దుఃఖం అలసిన మనసుకు స్నానమే కదా..మనసు తేలిక పడతది అనుకున్న.

చల్ల గాలి మేనికి తాకి స్నేహితుడిలా పలకరించి పోయింది.

◆◆◆

మిగిలిన కథ సుజాత చెపితే తెలిసింది. అదొక విజయగాథ విన్నట్టుగా అనిపించింది.

మా స్వాతి వారం పరీక్ష (weekly test) లలో మెల్లిమెల్లిగా పుంజుకుందట. ఇది కాస్త లెక్చరర్ల దృష్టిలో పడింది. ఒకసారైతే నెల పరీక్షలో ఫిజిక్స్ సబ్జెక్టులో స్వాతికి నూటికి నూరు శాతం మార్కులు వచ్చాయట. ఆ లెక్చరర్‌కి స్వాతి ఎంతగా నచ్చింది అంటే తన ఆన్సర్ షీట్‌ని చేతిలో పట్టుకొని, స్వాతిని దగ్గరకి తీసుకోని" చూడండి ఇట్లా రాయాలి. ఈ అమ్మాయిది తెలుగు మీడియం. జస్ట్ మూడు నెలల్లో ఇంగ్లీష్‌కి అడాప్ట్ అయి క్లాసు మొత్తం గర్వించేలా మార్కులు తెచ్చుకుంది." ఆ రోజు నుండి తన మనసులోని సంకోచాలన్ని దూదిపింజల్లా ఎగిరిపోయాయి.

అప్పటినుంచి ఇంగ్లీష్ మీడియం పిల్లలు ఆమెతోటి దోస్తానా చేయడం మొదలు పెట్టారు. ఇది తెలిసి ఇంగ్లీష్ క్లాసులకి అడ్జస్ట్ కాలేక ఇండ్లకి పోయిన తెలుగు మీడియం పిల్లలు ఒక్కరొక్కరుగా రావడం మొదలు పెట్టారు.

తెలుగు మీడియం పిల్లలు పదిమందే ఉన్న జట్టుకట్టి తిరగడం మొదలు పెట్టారు. అందులో కొందరు సర్కారు బడులలో చదివిన వారు కాబట్టి కొంత ధైర్యంగా మాట్లాడేవారు. ర్యాగింగ్ లాంటి వాటిని కలిసికట్టుగా ఎదుర్కొన్నారు. నిజానికి అక్కడ "వివక్ష" నె అతి పెద్ద ర్యాగింగ్.

ఓసారి క్యాంపస్ మొత్తానికి స్వాతి ఫస్ట్ రావడంతో తన దశ తిరిగిపోయింది. అందరు ఆమెను మరింత గౌరవంగా చూడడం మొదలుపెట్టారు.

◆◆◆

ఇది ఇలా ఉండగా స్వాతి "స్టార్ బ్యాచ్" కి ఎన్నిక ఐంది. అది విన్న మా మిత్రులు బంధువులు విశేషంగా అభినందనలు తెలిపారు.

విషయం ఏమంటే కాస్త బాగా చదివే పిల్లలని వేరు చేసి "స్టార్ బ్యాచ్"గా ఏర్పాటు చేసి ఓ ముప్పైమందికి ప్రత్యేక నిపుణులతో చదువు చెప్పిస్తారు. వీళ్లకు వసతులు కూడా ప్రత్యేకంగా ఉంటాయి.

ఏం జరిగిందో తెలియదు కాని ఓ నెల రోజుల్లో తాను ఆ బ్యాచ్ నుండి బయటకి వొచ్చింది."ఏం జరిగిందిరా..ఎందుకు బయటకి ఒచ్చినవ్..."అని అడిగితె, "షరా మామూలే అమ్మా...అక్కడంత ఇంగ్లీష్ మీడియం పిల్లలే ఉన్నారు. వాళ్ళు మాతో కలవరు. వాళ్ళ ఇగో వాళ్ళని కల్వనియదు" అని కాసేపు ఆగి, "అయినా స్టార్ బ్యాచ్ వాళ్ళకే

# వడబోత

- డా. ఎన్.గోపి

నేనెప్పుడూ
పేదల గురించే ఆలోచిస్తాను
పైనించి ఏ ప్రకటన వెలువడ్డా
అది కిందికి వెళ్తుందా లేదా అని చూస్తాను.
ఉపన్యాసాలకు వేసే రంగులను
తుడిచేసి వింటాను
ఓట్లగారడీ వుంటే
దాన్ని కనిపెడతాను.
చిత్తశుద్ధికి స్టెతస్కోపు పెట్టి
స్పందనలను లెక్కిస్తాను.
అసలీ వ్యవస్థ వారికి
అర్థమైందా అని సందేహిస్తాను.



వర్గ స్పృహ సంగతి తర్వాత
ఇంతకు వర్ణ వర్గ సంబంధాలు
అవగతమైనాయా అని గొణుక్కుంటాను.
ప్రతినోటా మానవత్వం అనేమాట
మలినమవటాన్ని చూసి దిగులుపడతాను

నేనెప్పుడు పేదలగురించే ఆలోచిస్తాను
పేదరికం అంటే ఏమిటో
లెక్కలు తేలక డీలా పడతాను.
సంక్లిష్టతతో స్పష్టతకోసం
సదా పెనుగులాడుతుంటాను.

మేధావిగా వుండలేక
పామరత్వాన్ని మేలుగా తలుస్తాను
అద్దాల్లో పెట్టిన వజ్రాల మెరుపులకు లోనుగాక
వీధిలో పెంకాసులను యేరుకుంటాను.
సినిక్ గా మారిపోతున్నానా!
జనం నన్ను చూసి భయపడ్తున్నారా!!
భ్రమావరణంలోంచి
శ్రమ సామ్రాజ్యంలోకి వెళ్లాలని వుంటుంది
అయినా ఏదో ఒక రూపంలో
నేనెప్పుడూ పేదల గురించే ఆలోచిస్తాను. ◆

---

సీట్లు వొస్తాయని గ్యారంటి లేదు..తెలివితేటలు ఉంటే మామూలు బ్యాచ్లో ఉన్న సీట్ తెచ్చుకుంటారు. నాకు మామూలు బ్యాచ్లో మా ఫ్రెండ్స్ తో ఉంటేనే కంఫర్ట్ గా ఉంటుంది. ఒత్తిడి ఉండదు. నాకు నచ్చినట్టు ఉంటేనే సీట్ సంపాదిస్తా కదా."అంది దృఢంగా..

ఎవరు ఎన్ని రకాలుగా ఎత్తిపొడుపు మాటలు అన్నా నాకు తన నిర్ణయం నచ్చింది. మాములు బ్యాచ్లోకి వచ్చినంక తాను నీళ్ళలో పడ్డ చాప ఐంది. మళ్లీ టాప్ ర్యాంక్కు ఎగబాకింది.

◆◆◆

అనేక ఆటుపోట్ల మధ్యన, అవమానాల మధ్యన, పెగలని గొంతుల మధ్యన, ఎత్తుకున్న కొత్త బానిస భావజాలం మధ్యన రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

ఫలితాలు రానే వచ్చేసాయి.

అందరి అంచనాలు పటాపంచలు చేస్తూ స్వాతికి మెడిసిన్ లో సీట్ వచ్చింది. తన రూములో పదిమంది ఉంటె తనకొక్కదానికి సీట్ రావడం, మొదట ఆమెను ఈసడించిన వాళ్ళే మెచ్చుకున్నారు. "నవ్విన నాప చేలు పండడం ఇదేనేమో."

ఆ సంవత్సరం రజనిగంధ క్యాంపస్లో తెలుగు మీడియం విద్యార్థులకి నాలుగు సీట్స్ వొచ్చాయి. వీళ్లంతా తుపానుకు ఎదురు నిలిచి గెలిచిన వాళ్ళు.

ఇంగ్లీష్ మీడియం వాళ్ళకి 140 మందికి కేవలం ఆరు సీట్లు రావడం, పదిమంది తెలుగు మీడియం వాళ్ళకి నాలుగు సీట్లు రావడం చూసి, అందరు ముక్కున వేలేసుకున్నారు.

పత్రికలు తెలుగు మీడియం విద్యార్థుల్ని తెగ పొగిడేసాయి. ఏటికి ఎదురీదినట్లు ఇంగ్లీష్ మీడియం విద్యార్థులతో పోటిపడి, తెలుగు మీడియం విద్యార్థులు సీట్లు సంపాదించారనీ, మాతృభాష సత్తా చాటారనీ, "కష్టపడ్డారు...డాక్టర్లు కాబోతున్నారు" అని సెంటర్ పేజిలో రాసారు.

ఆ రోజు...ఆ వార్తకి...ఓ పత్రిక పెట్టిన శీర్షిక,

"తెలుగు మీడియం జిందాబాద్" ◆




# ప్రపంచీకరణ మీద నిరసన జెండా

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117

***"మన్నించు మహాకవీ...***
***దేశమంటే యిపుడు మట్టీకాదు మనుషులూ కాదు***
***దేశమంటే యిపుడు***
***మల్టీనేషనల్ కంపెనీ మాత్రమే..."*** ( మట్టిరంగు బొమ్మలు)

వలసపాలనతో భారతదేశంలోకి ప్రవేశించిన పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వ రూపమే నేటి ప్రపంచీకరణ. ప్రారంభంలో భారతదేశంలో ఆహ్వానించదగినదిగా, ప్రజాస్వామ్య సాధనకు పూర్వరంగంగా కనిపించిన పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమ క్రమంగా వలసపాలకులు వెళ్లిపోయినా, వలసబుద్ధులు మారకుండా చేసి, ఇవాళ ప్రపంచీకరణ అవతారంలో భారతదేశ ప్రజల మూలుగులను పీల్చివేస్తున్నది. ప్రపంచీకరణ, రామాయణంలో మాయలేడి వంటిదే. ప్రపంచీకరణ, ప్రపంచమే ఒక కుగ్రామంగా తయారవుతుందని నమ్మించి, ఆ గ్రామం అమెరికా అని రుజువు చేస్తున్నది. ఆఖరికి అది భస్మాసురహస్తమే అవుతున్నది. మూడు దశాబ్దాల క్రితం, భారతదేశ ప్రజలతో నిమిత్తం లేకుండా దేశంలోని పాలకులు ప్రవేశపెట్టిన ప్రపంచీకరణ, అన్ని ప్రాదేశిక విలువను, వ్యవస్థలను, ధ్వంసం చేసేస్తున్నది. విద్య, ఉపాధి, వ్యవసాయం, చేనేత, సంస్కృతి, మానవ సంబంధాలు, అన్నిటిని తలక్రిందులు చేసేసింది. అత్యల్ప సంఖ్యాకులకు స్వర్గంగా, అత్యధిక సంఖ్యాకులకు నరకంగా మారిపోయింది ప్రపంచీకరణ. అవినీతిలో కునారిల్లుతున్న సమాజాన్ని మరింత అవినీతిలోకి నెట్టివేసింది. ప్రైవేట్, రహస్య వ్యాపారంగా ఉన్న అవినీతిని పబ్లిక్ వ్యాపకంగా మార్చివేసింది. పర్యావరణాన్ని ధ్వంసం చేసింది. పంటభూములు, నదులు, ఏరులు, వాగులు, వంకలు, కాలవలు, అడవులు, మైదానాలు దేన్నైనా మింగేయడమే ప్రపంచీకరణ. అడిగినవాళ్లను, ప్రశ్నించినవాళ్లను, ప్రతిఘటించినవాళ్ళను, దేశీయ పాలకులచేత, దేశీయ ముఠాలచేత చంపిస్తుంది. ఇంతచేసి ప్రపంచీకరణ భారతదేశ భూస్వామ్య మూలాలను మాత్రం ఛేదించలేకపోయింది.

ఈ ప్రపంచీకరణ ప్రవేశించింది మొదలు భారత దేశంలో అనేక సంక్షోభాలను సృష్టిస్తూనే ఉంది. వాటిని తెలుగుకవులు కవిత్వరూపంలో ప్రతిఘటిస్తూనే ఉన్నారు. ప్రపంచీకరణ పట్ల తెలుగు కవిత నిరంతరమూ నిరసనగళమే. అలా నిరసనగళం విప్పిన కవులలో సిరికి స్వామినాయుడు ఒకరు . ప్రపంచీకరణ మహారాక్షసి ఉక్కుపాదాల క్రింద చితికిపోతున్న ఉత్తరాంధ్ర మైదాన, అటవీప్రాంత ప్రజాపక్షం వహించిన స్వామినాయుడు, దాని రాక్షసరూపాన్ని "మట్టిరంగు బొమ్మలు" లో ఆవిష్కరించారు. దాని విధ్వంసక పాత్రను కళ్లకు కట్టారు.

***"కవిత్వమొక నిరసన జెండా***
***కవిత్వం నిరంతర ప్రజాపక్షం"***

అనే నిబద్ధతగల కవి స్వామినాయుడు. ఈ కావ్యం నిండా

ప్రపంచీకరణ, కార్పోరేట్ వ్యవస్థ, మల్టీనేషనల్ కంపెనీల దోపిడీలను, విధ్వంసాలను వాస్తవికంగా విమర్శనాత్మకంగా చిత్రించారు. ప్రపంచీకరణ వ్యతిరేక తెలుగు కవిత్వచరిత్రలో ఈ కావ్యానిది పెద్ద స్థలమే.

ప్రపంచీకరణ వచ్చినాక, భారతీయ వ్యవసాయరంగం సంక్షోభంలో మునిగిపోయింది. రైతులకు పాలకుల అండ అదృశ్యమైపోయింది. వ్యవసాయం ఖర్చులు పెరిగి, ఆదాయం తగ్గి రైతులకు అప్పులు మిగిలాయి. వాళ్ళు అనివార్యంగా ఆత్మహత్యలు చేసుకునే స్థితిని కల్పించారు. ప్రజలకు ప్రత్యామ్నాయ ఉపాధి చూపకుండానే, మానవశ్రమతో ముడిపడిన రంగాలలోకి యంత్రాలను ప్రవేశపెట్టి శ్రామికులను వీధిలోకి నెట్టివేసింది. విద్యావ్యవస్థను, మానవీయ సామాజిక శాస్త్రాల అధ్యయనం నుంచి దూరం చేసి, కంప్యూటర్ వైపు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వైపు మళ్లించింది. ఉపాధి కల్పన నుంచి ప్రభుత్వాలను దూరం చేసింది. ప్రాదేశిక మాధ్యమాలను చంపి ఆంగ్ల మాధ్యమంతో విద్యా వ్యవస్థను నింపేసింది. కొంతమంది మేధావులను ఆంగ్లమాధ్యమ వ్యామోహితులుగా మార్చి, ఆంగ్లమాధ్యమమే అన్ని సమస్యలకూ పరిష్కారమనే భ్రమల్లోకి నెట్టివేసింది. ప్రాదేశిక వృత్తులను కబ్జాచేసి వాటిని నమ్ముకున్న వాళ్లను నట్టేట ముంచింది. పర్యావరణ విధ్వంసక ఫ్యాక్టరీలను గ్రామ ప్రాంతాలలో నెలకొల్పి ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్నది. ఇందుకు పాలకులు, బహుళజాతి కంపెనీలకు రక్షణగా నిలబడుతున్నారు. అడవులలో, కొండలలో తమవైన పద్ధతులతో, సాంప్రదాయాలతో బ్రతుకుతున్న ఆదివాసీప్రజలను కూడా వదిలిపెట్టకుండా వాళ్లదగ్గరికి కుడా పోయి వాళ్ళ జీవితాలను పరాయికరిస్తున్నది ప్రశ్నించిన వాళ్లను ఏదో ముద్ర వేసి పాలకులచే చంపిస్తున్నది. స్థానిక ప్రజల ప్రయోజనాలను లెక్కచేయకుండా, ముంపు ప్రాంతాలను సృష్టించి, స్వస్థానభ్రష్టులను చేస్తున్నది. సంపదను, ధనాన్ని పెంచుకోవడమే జీవితానికి పరమావధి అనే భ్రమను కల్పించి, మానవ సంబంధాలన్నిటినీ ఆర్థిక సంబంధాలుగా మార్చి, మానవీయ విలువలను నాశనం చేస్తున్నది. డబ్బు ముందు మనిషి పలచనైపోతున్నాడు. మానవ సంబంధాలలో అనాగరికమైన పరిణామాలను తీసుకొస్తున్నది. శారీరక శ్రమకు విలువను తగ్గించి, దొంగతెలివికి పెద్దపీట వేస్తున్నది. సారాంశంలో ప్రపంచీకరణ అత్యల్ప సంపన్నవర్గానికి కొమ్ముకాస్తూ, అత్యధిక శ్రామిక జనానికి శత్రువుగా మారిపోయింది.

స్వామినాయుడు ఈ దుర్మార్గమైన శత్రువు మీద కవిగా యుద్ధం ప్రకటించారు. ప్రపంచీకరణ ఏయే రంగాలను, ఏయే సమూహాలను ఎలా నాశనం చేస్తున్నదో, బలమైన భావుకతతో, కఠినమైన కంఠస్వరంతో, తీవ్రమైన ప్రజాపక్షపాతంతో విమర్శించారు. ఈ కావ్యంలోని కవితలన్నీ 21వ శతాబ్ది రెండవ దశాబ్దంలోనివే. ఇందులోని కవితలన్నీ 20వ శతాబ్ది ప్రారంభంలో వలసపాలనను వ్యతిరేకిస్తూ వచ్చిన స్వాతంత్ర్యోద్యమ కవితలను తలపిస్తున్నాయి. తెలుగుకవి నిర్వహించే సామాజిక బాధ్యతకు ఈ కావ్యం ఒక చారిత్రక ఆధారం.

ప్రపంచీకరణ ప్రవేశించి వ్యవసాయాన్ని, వ్యవసాయ వృత్తులను, వ్యవసాయానికి చెందిన రైతులు, రైతుకూలీలు, చేనేత కార్మికులు జీవితాలను కోల్పోయి వీధిన పడ్డారు. రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం, వ్యవసాయేతర కూలీలుగా మారడం, వలనలు వెళ్లడం వంటి ప[illegible]ణామాలకు లోనయ్యారు. స్వామినాయుడు ఈ పరిణామాల మీద తీవ్రంగా స్పందించారు. వ్యవసాయేతర కూలీగా మారి బయటకు వెళ్లి చీకటిపడినా ఇంటికి తిరిగిరాని భర్త కోసం ఎదురు చూసే భార్య వేదనను 'నాగళ్లమొనల మీద' కవితలో ఇలా వ్యక్తం చేసారు.

*"భువనానికి బువ్వపెట్టాల్సిన వాడు*
*ఎక్కడ ఏ భవంతులకు పునాదులేస్తున్నాడో...!*
*అతడొస్తే బావుణ్ణు , బతుకుపోరులో గెలిచి*
*నాగళ్లమొనలమీద ఒక దేశాన్ని నిలబెట్టడానికి...!"*

అదే రైతు, ప్రభుత్వ నిరాదరణకు గురై అప్పుల భారం మోయలేక ఆత్మహత్యకు గురౌతూ ఉండడం మన దేశంలో చాలా కాలంగా నడుస్తున్న సత్యం. నాగలి భుజాన వేసుకొని , పొలానికి వెళ్లి ఆత్మహత్య చేసుకున్న రైతుభార్య కంఠస్వరం నుంచి కవి 'ఎదురీత' కవిత రాసారు. కానీ ఆమె రైతు మరణించ కూడదని కోరుకోవడం విశేషం.

*" ఆదుకోవాల్సిన రాజ్యం*
*రైతుపక్షం కాదని తేలిపోయాక...*
*యింకా ఎడారికళ్ల ఎదురుచూపు*
*యింకెంత కాలమనుకున్నావో...*
*చెర తెంచుకుని పారిపోయావు !*
*దుర్భరమైనా..పోరాడి నిలచిన బతుకు చాలా గొప్పది !*

రైతు వ్యవసాయేతర కూలీగా మారకముందు, విధిలేక

ఆత్మహత్య చేసుకునేముందు వ్యవసాయం చేసాడు. పంట పండించాడు. కానీ పంటకు విలువకట్టే హక్కు రైతుకు లేదు. అది వ్యాపారి చేతిలో ఉంది. అందుకే కవి 'ఆశతో' కవితలో పంటనుచూసి మురిసిపోతున్న రైతు దగ్గరికి వ్యాపారి రావడాన్ని

*" గెద్దల గుంపొకటి/ కళ్లం మీద రెక్కలు విప్పారుస్తుంది !"* అని విమర్శించారు.

మైదాన ప్రాంతంలో రైతుల తర్వాత అనేక వృత్తులలో నివసించే ప్రజలున్నారు. రైతును మింగేసిన ప్రపంచీకరణ, ఆ వృత్తులవాళ్లను కూడా కబళించేసింది. వీళ్లలో చేనేత కార్మికులు ప్రధానం. స్వామినాయుడు 'ఉరికొయ్య' అనే చిన్నకవితలో చేనేత కార్మికుని మరణాన్ని ఆర్ద్రంగా వర్ణించారు.

*"పడమటచెట్టుకు పూసిన ముద్దమందారమా...అది"*
*మళ్లీ అడిగాన్నేను సూరీడ్ని చూపిస్తూ...!*
*'కాదు, మగ్గంఉరికొయ్యకు ఉయ్యాలలూగుతున్న*
*మా అయ్య నెత్తుటి శిరస్సు' అన్నాడతడు !"*

సముద్రంలో, నదులలో, గుంటలలో చేపలు పట్టి పొట్ట పోసుకునేవాళ్లు బెస్తలు. ఆ వృత్తిలోకి కూడా కార్పోరేట్ శక్తులు ప్రవేశించి, వాళ్లను వాళ్ల వృత్తి నుంచి పరాయికరిస్తున్నాయి. ఈ దుర్మార్గం మీద స్వామినాయుడు 'జాలరివాడ మీద నీలిజెండా' 'గోడకు ఆవల సముద్రం' కవితలు రాసారు. జాలరుల జీవితాలను, వాళ్ల సంస్కృతిని, కార్పోరేట్ వ్యాపారులు ధ్వంసం చేయడంమీద ఆగ్రహిస్తూ...

*" ఇంకెంత కాలం ?*
*కార్పోరేట్ విహంగాలు కడలిని తన్నుకుపోతున్నచోట*
*ఎడారి ఇసుక తిన్నెలమీద ఏడ్చేదింకెంత కాలం ?*
*సముద్రం , మా జాలరివాడ మీద ఎగిరే నీలిజెండా !"*

అని కవి జాలరుల పక్షాన మాట్లాడారు. ఉత్తరాంధ్రలో మైదానప్రాంత పేదప్రజలు బ్రతుకుతెరువు వెతుక్కుంటూ కోస్తాంధ్రకు వలసపోతుంటారు. అక్కడా మోసానికి గురౌతుంటారు.

*"కళింగ తీరంలోని/ యే పల్లెసీమల నుండి ఎగిరొస్తారోగానీ.../ యీ కోనసీమ కాలువగట్లమీద / కూలిపిట్టలై వాలతారు !"* అని వర్ణించిన కవి అక్కడ ఆ కూలీలు గడిపే దుర్భర జీవితాన్ని చిత్రించారు .

మైదానప్రాంత ప్రజా జీవితం ప్రపంచీకరణ తాకిడి వల్ల ఎన్ని రకాలుగా సంక్షోభంలో పడిందో వర్ణించిన స్వామినాయుడు అడవులలో, కొండలలో నివసించే గిరిజన ఆదివాసీ ప్రజల జీవితాల్లోకి ప్రపంచీకరణ చొచ్చుకువచ్చి, వాళ్లను ఎలా పరాయికరించిందో చాలా కవితలలో చిత్రించారు. దుర్ల , శిశిరం నడచిన జాడలు, మోదుగు పూలు, వెదురుపొదల యుద్ధరహస్యం, నిత్యగాయాల నెలవంక మొదలైన కవితలలో ప్రపంచీకరణ సమ్మెటదెబ్బలకు విలవిలలాడే అడవిబిడ్డలు మనకు కనిపిస్తారు. గిరిజన జీవితాల్లోకి పెట్టుబడిదారులు ప్రవేశించి వాళ్ల జీవన మౌళికత నుంచి దూరం చేసిన దుర్మార్గాన్ని గిరిజనులు గ్రహించి జాగరూకులు కావడం 'దుర్ల' కవిత.

*"అడవి అంగడైపోతున్న వేళ/ ఆనాటి జీవితాలిపుడు పురాస్మృతులు !"* అని గ్రహించి జాతాపు జాతీయులు

*"మా అడవికి మమ్మల్ని దూరంచేసే/ మీ ఆకుపచ్చని పన్నాగానికొక దండం !/ సుజల సెలయేటి వాగుల్ని/ కలుషిత కాసారాలుగా చేయటమే నాగరికత అయితే/ మీ నాగరికతకొక దండం !/ అదిగో...చినుకు చినుకూ కురిసి వాగైనట్టు/ పదం పదం కలసి జనజాతరై దుర్ల కదలబారుతోంది !/ మీకు తెలుసో లేదో / ఆదినుండీ అడవి ఒక యుద్ధక్షేత్రం !"*

ఉత్తరాంధ్ర అడవులలో పోడు వ్యవసాయం చేసుకునే ఆదివాసీల జీవితాల్లోకి పెట్టుబడిదారీ దళారీలు ప్రవేశించి వాళ్లను ఎలా నాశనం చేసారో కవి వర్ణించారు. ఆ అడవి బిడ్డలను కవి

*"ఘనమైన యీ దేశపు రాజ్యాంగం విస్మరించిన/ ఆదిమకాలపు అవశేషాలు !"* అని నిర్వచించారు. వాళ్ల జీవితాల్లోకి గుంటనక్కల్లా సంచరిస్తూ దళారీలు చేసే దుర్మార్గాన్ని ఇలా వర్ణించారు.

*"నూకల్ని చల్లినట్టు పచ్చని చిల్లర జల్లి/ అడవి పావురాల్ని మచ్చిక వేసుకుంటుంది!"*

ప్రపంచీకరణ అడవుల్లోకి ప్రవేశించి సృష్టించిన బీభత్సం కవికి బాగా తెలుసు.

*"బతుకుపచ్చని అడవి బహుళజాతి సంతయ్యాక / అభివృద్ధి వధ్యశిల మీద /ఆదివాసీయే తొలి బలిపశువు !"* అని నిర్వచించారు .

స్వామినాయుడు సామ్యవాది. అందువల్ల పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ఆయన కించిత్ కుడా ఆమోదించరు. 'పెట్టుబడి ఒక ఎలుగుబంటి'(పుట:54) అనడమే ఆ వ్యవస్థమీద ఆయన అవగాహన ఏమిటో చెబుతున్నది. భారతీయ విద్యావ్యవస్థలోకి కార్పోరేట్ శక్తులు దూసుకొచ్చి చేసిన విధ్వంసాన్ని 'శిక్ష', 'మరబొమ్మ' కవితలలో

ఆవిష్కరించారు.

*"ఏ పాపం చేసానని నాన్నా/ నన్నీ బందిఖానాలోకి నెట్టేసావు?"* అన్న ప్రశ్నకు కార్పొరేట్ విద్యా వ్యవస్థ మోహితులైన మేధావులు, తల్లిదండ్రులు సమాధానం చెప్పాలి. విద్యార్థి తనేమికావాలో అతన్ని నిర్ణయించుకోనివ్వని వ్యవస్థమీద ఏమి ఆగ్రహం వ్యక్తం చేసారు ! కార్పోరేట్ విద్య కలెక్టర్, డాక్టర్, ఇంజనీర్, లాయర్లను తయారుచేస్తున్నది. విద్యార్థులను మనుషులుగా తయారుచేయడం లేదు అన్నది కవి అధిక్షేపం.

పల్లెల్ని నాశనం చేసిన ప్రపంచీకరణ మీద స్వామినాయుడు ఎప్పుడు కవిత రాసినా ఒంటికాలు మీద లేస్తాడు. సుడిగాలి, మాయాబజారు, మూగవోయిన జీవనగీతం, దుఃఖపునీడలు, నేల ఒక అద్దెగర్భం, మట్టిరంగు బొమ్మలు, జనంలోంచి మొదలైన కవితలలో ప్రపంచీకరణ విరాట్రూపాన్ని కవి ప్రదర్శించారు. పంటపొలాలలో సెజ్ లు నిర్మించి, పాలకులు పెట్టుబడిదారీ వ్యాపారానికి పునాదులు వేసారు. ఫలితంగా భూములు అంగడి సరుకులయ్యాయి.

*"రియల్ ఎస్టేట్ వెంచర్ల ఇనుపకంచెల్లో / నా పంటపొలం చిక్కిపోయాక/ చెట్టూలేదు, పుట్టాలేదు, చేరడు మట్టీలేదు !/ మనుషులిపుడు మారకపు సరుకులు/ పల్లెలిపుడు బహుళజాతి సంతలు !"* అని నిర్వచించి కవి, ప్రపంచీకరణ వికృత ఫలితాలను ఎత్తిచూపారు. భారతీయ వ్యాపార రంగంలోకి బహుళజాతి కంపెనీలు ప్రవేశించి సృష్టించిన బీభత్సాన్ని కవి 'మాయా బజారు' అని నిర్వచించారు. తిండిగింజలు పండే భూమి ప్రపంచీకరణ దుర్మార్గం వల్ల సరుకు మారిపోయి 'కాలపురుషుడి కన్నీటిబొట్టులా' (పుట: 92) అయిపోయిందన్న కవి మాట వింటే గగుర్పాటు కలుగుతుంది.

*"చిరుగాలికి పైరు కదలాడుతుంటే – ఆమెకు*
*కడుపులో బిడ్డ కదలాడుతున్నట్టే ఉండేది !"*

అలాంటి భూమి వ్యాపారుల కబంధహస్తాల్లోకి పోగానే *'పంటచేను మీద మిడతలదండు వాలి'* నట్టయిందన్నారు కవి.

ప్రపంచీకరణ, స్త్రీ పురుష సంబంధాలలో కూడా వికృత వాతావరణం కల్పిస్తున్నది. ఇటీవలి కాలంలో సినిమాలు, రియాల్టీ షోలు, స్త్రీలను మాంసపు ముద్దలుగా ప్రదర్శించి యువకులను రెచ్చగొడుతున్నాయి. అసలే మన సమాజంలో భూస్వామ్య విలువల ప్రభావంతో మొగాడికి స్త్రీ మీద చిన్నచూపు. పెట్టుబడిదారీ వ్యాపారం ఆ చిన్నచూపును దౌర్జన్యానికి ప్రేరేపిస్తున్నది.

*"పైట కనిపిస్తే చాలు / పశువులు రంకెలేస్తున్న కాలం !"* అని కవి అధిక్షేపించారు. ఒక చిన్న అమ్మాయిని పెద్దవయసు గల పురుషులు గుడిలో నిర్బంధించి నాశనం చేయడం దేనికి సూచన ?

*"గుడిలో అత్యాచారం/ బడిలో అత్యాచారం/ నడివీధిలో అత్యాచారం"* ఏమిటి కారణం దీనికి? స్త్రీల మీద జరిగే అఘాయిత్యాలను, అత్యాచారాలను స్వామినాయుడు ఆవేదనతో ఖండించారు.

పెట్టుబడిదారీ స్త్రీ పురుష సంబంధాలను వ్యతిరేకించి, శ్రామిక వర్గ స్త్రీ పురుష సంబంధాలను కీర్తించారు స్వామినాయుడు. అతడు ఆమె అడవి, హరితనేత్రాలై, ఒంటెద్దుబండి వంటి కవితలలో శ్రామిక వర్గ స్త్రీ పురుష సంబంధాలను చిత్రించారు. అది ఆయన వర్గపక్షపాతం .

*"అతడు గొడ్డలి చేతపట్టి/ ఎండినకొమ్మల్ని ముట్టె కట్టి / నుయ్యి తీసినట్టు నిలువెత్తు గొయ్యి తీసి/ కుప్పరి పేరుస్తాడు ! / ఆమె పోదు ముట్టినట్టు/ బట్టీ ముట్టించి మట్టి కప్పుతుంది !"* ఎంత అందమైనదీ దృశ్యం .

స్వామినాయుడు కుటుంబ సంబంధాలమీద కూడా కవితలు రాసారు. దళిత సమస్యలమీద రాసారు. లక్ష్మీపేట, వాకపల్లి, ఉద్దానంల మీద శక్తివంతమైన కవితలు రాసారు. స్వేచ్ఛావాణిజ్యం రాజ్యమేలడం గురించి రాసారు. ప్రకృతి అందాలను గురించి రాసారు. మంచి మానవ సంబంధాల గురంచి రాసారు. రాజధానిని గురించి రాసారు. ఏదిరాసినా స్వామినాయుడుది ప్రజాపక్షం. ప్రపంచీకరణ వ్యతిరేక పక్షం. వస్తుపరంగా నిజాలనిప్పులమీద నడిచాడు. శిల్పపరంగా భావకవితా బాటల మీద నడిచాడు. ఉత్తరాంధ్ర మైదాన, అటవీప్రాంత శ్రామిక మూలవాసీ గిరిజన ఆదివాసీ జనాలపై, కార్పోరేట్ రాబందుల, పుచ్చిపోయిన మతశక్తుల దాడుల, దోపిడీల నగ్నదృశ్యాలను గుండెలు పిండే భాషలో, గుండెలు రగిలే ప్రతీకలతో వర్ణించిన స్వామినాయుడుకు జేజేలు. ఈ కావ్యం కవిత్వంతో పరిమళిస్తున్నది. కవిత్వం శాశ్వత ప్రజాపక్షం. ఇందుకు "మట్టిరంగు బొమ్మలు" సాక్ష్యం.

*"బతకలేం*
*తల్లిఒడి తీరానికి దూరమై బతకలేం*
*యిక యీ గోడను పడగొట్టాల్సిందే*
*తూరుపు సముద్రం మీద రేపటి సూర్యోదయానికి*
*ఆహ్వానం పలకాల్సిందే !!"*

◆

## కవిత

# అలౌకిక

- శిఖా - ఆకాష్
9381522247

జ్ఞానమంతా చీకటాయెను
మతమొక్కటి మరణమై వెలుగును!?

♦

రాజ్యాంగం రోడ్డున పడుతున్నది
మతోన్మాదం ఉరికంబాలను రచిస్తున్నది
మూఢనమ్మకం సైన్స్‌గా ప్రచారమౌతున్నది
విశ్వాసం ఆకాశమెత్తు ఆలయమై పలకరిస్తున్నది
ధృతరాష్ట్ర పాలనకు కట్టు కథే ఎజెండా అవుతున్నది
పౌరసత్వ కొలమానంలో
దేశభక్తి రెండవతరగతిగా నిలబడుతున్నది
హిందూ మహాసముద్రమొకటి
సుడిగుండాలను సృష్టిస్తున్నది -

♦

ఒకానొక కలల లోకం
"వి'భజన' " కు ఊపిరూదులూతున్నది
దేశమంతా సంధ్యారాగం ఆలపించాలని
ఇక్కడ నీటిలో మరే పుష్పాలు వికసించ వీల్లేదని
లోటస్‌లే కళ్ళు విప్పాలని శాసనాలు లిఖిస్తోన్నది-
గాలి నిండా మమతానురాగాలు వీచాల్సిన చోట
మతాలు పరిమళించాలని,
ఆకాశంలోని నక్షత్రాలన్నీ తామరలేనని కవిత్వం
చెబుతోంది-
నిప్పుకూడా కాషాయం ధరించే వుంటుందని
నేల కూడా సంధ్యావందనం చేయాలని మాంత్రికోపదేశం
చేస్తోంది-

♦

ఇప్పుడు దేశమొక మరణశయ్య
అధికారం అణచివేతలకు రూపకర్త
హింసరచన - మత విభజన ఒక దివ్యౌషధమని
దేశద్రోహుల జాబితాను తయారు చేస్తున్నది
పక్షుల వలసలను కూడా నిషేధిస్తున్నదీ 'రంగుల మతం'-

♦

ఆకలితో పనిలేదు - మతం మా ఆహారం
సంపద మాకవసరం లేదు - నియంతృత్వమే మా
పెట్టుబడి
సమగ్రత మీద నమ్మకం లేదు - ఏక వర్ణీకరణే మా
అఖండ నినాదం



ఈ దేశంలో మతం పేరు స్వేచ్ఛని
నిర్బంధం పేరు ప్రజాస్వామ్యమని
దేశభక్తి పేరు హింసని
సంధ్యార్ణవ నిఘంటువులు హితవు పలుకుతున్నాయి-
ఓ నా పౌరులారా!
మీరు ఎక్కడి వారో... ఎప్పటి వారో...
ఎక్కడ ఉండాలో... ఎలా ఉండాలో...
అసలు ఉండాలో వద్దో మేమే నిర్దేశిస్తామంటున్నది

♦

ఔనూ... ఇప్పుడు ప్రజలంటే ఎవరు?
సమాధానాలు సరిపడని ప్రశ్నలు!
కొన్ని మతాలు - కొన్ని కులాలు - కొన్ని జెండాలు
మరికొన్ని సరిహద్దులు
మరిన్ని నిషేధితాలు -
అవునవును ఇక్కడ
మనిషొక
బతికిన శిల
రాజ్యానికి వేలాడుతున్న ఉరి తల!?
ప్రశ్నల్లేని ఖాళీ అరటి గెల?!

♦




# 'ఆమె' కోసం అతడి తాత్త్విక అన్వేషణ

- ఎమ్వీ రామిరెడ్డి
9866777870

అక్షరాల వెంట వేగంగా పరుగెత్తబోయి, కాళ్లకు ఏదో అడ్డం పడ్డట్టుగా పదేపదే ఆగుతూ, అక్కడక్కడే తచ్చాడుతూ ఎక్కడో చిక్కుబడిపోతాం. బాగా పరిచయమున్న ముఖాలు, స్థలాలు, ప్రాంతాలు, వస్తువుల గురించి అసలేమీ తెలియదనే నిజం తెలుసుకుని విస్తుపోతాం.

"ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు" కథాసంపుటి ద్వారా ఆ నిజాలు చెప్పిన ప్రముఖ రచయిత 'పలమనేరు బాలాజీ'.

♦♦♦

1. పనిమనిషి రాలేదు. సెలవు దొరకలేదు. ఫోన్‌జేసినా ప్రయోజనం లేదు. ఇల్లు సర్దుకుని, పని తెములుచుకుని ఆఫీసుకు వెళ్లాలి. బాస్‌కు ఫోన్ చేసి, సెలవు కావాలని అడిగిందామె. కుదరదన్నాడు. బతిమాలితే, అరపూట తీసుకోమన్నాడు. లంచ్ కన్నా ముందే వెళ్లింది. అకారణంగా అమర్చిన సమావేశాలకు అన్యమనస్కంగానే హాజరై, బస్సులో ఇంటికి బయల్దేరింది. లేడీ కండక్టర్ తెగువను గమనించినప్పుడు, ఆమెలో సరికొత్త విశ్వాసం వికసించింది. 'ఏమవుతుంది?' అనే శీర్షికను మనవైపు విసిరి, ఈ కథ లోతులు కనుక్కోమంటాడు రచయిత.

"తను వస్తానని చెప్పటానికి, వస్తూవున్నానని చెప్పటానికి మాత్రమే ఫోన్‌లో దొరికి ఆమేరకు సమాచారాన్ని తెలియచేస్తుంది తప్ప రాలేనప్పుడు, రానప్పుడు ఫోన్ తియ్యని" పనిమనిషి!

'ఈ సమయంలో ఫోన్ చేసానంటే ఆలస్యంగా వస్తాననో, అసలు రాలేనని చెప్పటానికేననో' అని తెలుసుకోగలిగిన తెలివైన బాస్!

కేవలం పనిమనిషి వస్తుందో రాదోనన్న మీమాంసలోంచి కథ ఆమె ఉద్యోగ జీవితంలోకి నడుస్తుంది. "నెలలో రెండుసార్లా? ఎందుకలా?" అంటూ ఆడవారి ప్రకృతిధర్మాన్ని

1. పనిమనిషి రాలేదు. సెలవు దొరకలేదు. తప్పనిసరై ఆమె ఆఫీసుకు వెళ్లింది. తిరుగు ప్రయాణంలో లేడీ కండక్టర్‌ను చూసి, ఆమె ఆలోచనలో వెలుగుధార మొదలైంది. అంతే. ఇదే కథ. శీర్షిక "ఏమవుతుంది?"

2. భార్యాపిల్లలు ఊరెళ్లారు. ఆఫీసు పని ముగించుకుని తనూ రేపు వెళ్లాలి. సిలిగురి సెంటర్‌కు వెళ్లాడు. మనుషుల్ని చూస్తూ టీ తాగి ఇంటికి చేరుకున్నాడు. అంతే. కథాశీర్షిక "ఇంట్లోపలికి వెళ్లేముందు".

3. అతను ఆ రోజు సాయంత్రం త్వరగా ఇంటికి చేరాడు. ఇంట్లో ఆమె లేదు. అమ్మాయి కాలేజీ నుంచి రాలేదు. ఎదురు చూడటం విసుగనిపించింది. తాళం వేసి, బజార్లోకి నడిచి, కూతురి కోసం చూస్తూ నిలబడ్డాడు. అంతే కథ. శీర్షిక "ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు".

4. సెలవులొచ్చినా అతను ఆమెతో మమేకం కాలేదు. ఇంతలో మరో జంట ఆ ఇంట కాలిడుతుంది. ఆ ఇద్దరూ ఆమె స్నేహితులు. కబుర్లు మొదలు. నవ్వుల వర్షం. అతను బయటికి నడుస్తాడు. అంతే. "ఖాళీ కప్పులు" కథ ముగుస్తుంది.

మరో 8 కథలూ అంతే ఉంటాయి. అంతేనా అంటే కచ్చితంగా 'అంతే'నని సరిపెట్టుకోలేం. ఎందుకంటే, అవి అంతటితో ముగియవు. వల విసిరి వెనక్కి లాగుతుంటాయి. లోతుల్లోకి విసురుతుంటాయి. మనుషులున్న తావుల్లో కట్టిపడేస్తుంటాయి. మానవజీవన పార్శ్వాల్లోని అతిసున్నితమైన పొరలను పరిచయం చేస్తుంటాయి. మనిషి అంతర్ బహిర్లోకాల గుట్టుమట్లు విప్పుతుంటాయి.

వాట్సాప్ గ్రూపులో భ్రష్టు పట్టిస్తాడు మేనేజర్. మగబాసులు తమ ప్రతి కదలికలోనూ కనబరిచే కృత్రిమదర్పాన్ని అక్షరాల్లోకి తర్జుమా చేస్తాడు రచయిత. ఆ నాటకాలను మహిళా ఉద్యోగులు అసహ్యించుకుంటారన్న విషయాన్ని ప్రస్తావించటమూ మరచిపోడు.

"మా ఇంటాయన ఈ పనులన్నీ షేర్ చేసుకునేట్లయితే నాకు పర్మిషన్లూ, సెలవులూ, ఈ గాడిద దగ్గర మాటలూ అవసరమే ఉండదు కదా" అంటుంది భ్రమరాంబ.

"మా ఇంటి రాష్ట్రపతి ఆమోదముద్ర పడనిదే చీపురుకట్టయినా కొనడానికి లేదే" అని చెప్పే కొలీగ్ కోమల... 'స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేసిందహో' అని అరిచేవారి చెంప చెళ్లుమనిపిస్తుంది.

విధి నిర్వహణ అనబడే తంతును ముగించుకుని, బస్సెక్కిన తర్వాతైనా గ్రీష్మ కుదుటపడుతుందా అంటే అదీ లేదు. ఇంకేవో అపరిష్కారాలను తామరతంపరగా తలపుల్లో చెరుగుతూ కూర్చుంటుంది. ఒక ఇల్లాలి జీవనయానం వెనక ఇన్ని ప్రశ్నార్థక ప్రపంచాలుంటాయా అని ఆశ్చర్యం కలుగుతుంది.

ఆఖరికి, కండక్టర్ స్ఫూర్తితో 'నేను కొత్తగా మాట్లాడితే, కొత్తగా పనులు పురమాయిస్తే ఏమవుతుంది?' అనే మెలకువను ఆమెలో రగిలించటం ద్వారా రచయిత కథను పరిపుష్టం చేశాడు.

ప్రతి ఇంట్లోనూ ప్రతిరోజూ జరిగే అ(తి)సాధారణ యుద్ధం అంత తేలిగ్గా అక్షరాలకు పట్టుబడదు. కానీ, నిస్సందేహంగా స్త్రీ పక్షపాతి అయిన బాలాజీ బుదుంగున ఆ ఇల్లాలి ఆత్మలోకి పరకాయ ప్రవేశం చేస్తాడు. పనిమనిషి వస్తుందో రాదో నిర్ధారణ కానివేళ, ఒక ఇల్లాలి యాతనను కళ్లకు కట్టేలా రాస్తాడు.

2. భార్యాపిల్లలు ఊరెళ్లారు. తనూ రేపు వెళ్లాలి. టీ తాగి, ఇంటికెళ్తాడు. ఈ మధ్యలో మనకో అద్భుత లోకాన్ని పరిచయం చేస్తాడు రచయిత. మనిషి నిత్యం ఎన్ని ముసుగులు ధరించి తిరుగుతున్నాడో చూపిస్తాడు. అబద్ధాలను సాధన చేస్తూ వాటిని అలవాటుగా మార్చుకుని, నటనను రక్తమాంసాల్లో జీర్ణించుకున్న విషయాన్ని బద్దలు చేస్తాడు.

అతను టీ తాగుతూ లోకాన్ని చూస్తూ ఉంటాడు. హఠాత్తుగా కుడివైపు రాంగ్‌రూట్లో నడుస్తున్న పెద్దాయన్ని స్కానింగ్ తీస్తాడు. టీ ఇచ్చే కుర్రాడి మనసులో మునకేసి; వాడి అసలు రూపం, ముసుగురూపం కనిపెడతాడు. తనను తాను ప్రక్షాళన చేసుకుని, నటన ముసుగు తొలగించిన క్షణంలో నిర్మొహమాటంగా, నిర్భయంగా, నిజాయితీగా మాట్లాడతాడు. నిజం మాట్లాడతాడు. ఆఖరికి టీ కుర్రాడు కూడా తన పాతముసుగును బట్టబయలు చేస్తూ మాట్లాడటంతో కంగు తింటాడు.

కొత్త వెలుగులో ఇంట్లోకి వెళ్లబోయేముందు అతని ఆలోచనల్లో వికసించే పరిమళాన్ని చదివి ఆస్వాదించాల్సిందే.

సరికొత్త కాంతి ప్రసరించిన నేపథ్యంలో... స్టాల్ కుర్రాడు 'ఈరోజు మాత్రం మీ టీకి డబ్బులొద్దు సార్' అంటాడు. దానికతడు "నన్ను బానిసను చెయ్యకు మిత్రమా!" అంటాడు. అద్భుతమైన ఈ ముగింపుతో రచయిత మనల్ని ఉద్ధృత ప్రవాహంలోంచి బయటపడేస్తాడు.

3. మగాడికి ఇంటితో పని ఎంతవరకు? తన పని తాను తెములుచ్చుకునేవరకు! ఇంకేం పట్టదు. భార్య ఆ ఇంటిని ఎలా నిర్వహిస్తోంది? వంటగది, పడకగది, హాలు అంతందంగా ఉండటానికి ఆమె ఏ మంత్రాలు నేర్చుకుందో ఏనాడూ అక్కర్లేని విషయం. బీరువాలో బట్టలు ఎంత పొందిగ్గా సర్దిందో, ఆఖరికి అతనికిష్టమైన గదిని కూడా అలా అద్దంలా ఎలా ఉంచగలుగుతుందో తనకేనాడూ స్ఫురించదు.

ఎప్పుడో ఒక్కసారి సాయంత్రం ఆఫీసు నుంచి త్వరగా ఇంటికి చేరినప్పుడు... భార్య ఇంకా ఇంటికి చేరుకోనప్పుడు... అమ్మాయింకా కాలేజీ నుంచి రానప్పుడు... ఒంటరితనం విశ్వరూపం కనిపిస్తుంది. అప్పుడు ఆ ఇల్లే బోధివృక్షమై అతనికి జ్ఞానోపదేశం చేస్తుంది. పుస్తకానికి మకుటంగా ఉంచిన "ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు" కథలో అతడు "ఎప్పటినుండి నేను నా ఇంటికి పరాయివాడ్ని అయ్యానో, నాకు ఇంటికి మధ్య ఇంత అగాథం ఎప్పుడు ఏర్పడిందో నేను గమనించనేలేదు" అనుకుంటాడు. ఇంటికే కాదు, తనకు తాను పరాయి అవుతున్న విషయాన్ని భార్య, కూతురు గిల్లి చెప్పినా గమనించలేకపోవటం కూడా గమనంలోకి వస్తుంది. ఆమె విలువను తెలుసుకునే సందర్భాన్ని రచయిత అత్యుత్తమంగా చిత్రీకరించాడు.

4. "ఖాళీ కప్పులు" మరింత లోతైన కథ. భార్యాభర్తలకు మూడు రోజుల సెలవు. ఏకాంతంలోనూ అతను ఆమెలో విలీనం కాలేని వాతావరణం. అన్నిటికీ ఆమె వేలు తనవైపే! ఆమెతో ఎలా మాటలు కలబోసుకోవాలో, ఎలా నవ్వులు పంచుకోవాలో తెలియని ఏకాకితనం. ఆమెలోనూ ఊపిరాడనితనం.

అంతలోనే ఆమె స్నేహితురాలు వస్తుంది, భర్తతో సహా. ఆమె అమాంతం 'విచ్చుకుంటుంది'. ఆ జంట తమ వెంట సందడిని ప్యాక్ చేసుకుని తీసుకువచ్చిందా! లేకుంటే, వంటింట్లోంచి ఆ నవ్వుల ఘుమఘుమలేమిటి! చెవులప్పగించి, ఆ వాసనలు గ్రహిస్తూ, తను హాల్లో కూచోలేడు. వంటింట్లోకీ పోలేడు. ఇరుగ్గా మారిన గదిలో ముళ్లస్టూలు మీద కూచోలేక బయటికి నడుస్తాడు.

స్వచ్ఛమైన గాలి పలకరిస్తుంది. ఇంటిముందు ఖాళీస్థలంలో అందంగా పెరిగిన పూలమొక్కలు అతనికేదో రహస్యం చెబుతాయి. ఆకుకూర మొక్కలు, పాదులు, కూరగాయలు చిత్రంగా అతని కళ్లల్లో వెలుగులు నింపుతాయి. పరిసరాల అలంకరణ కట్టిపడేస్తుంది. అతని మనసు పరిమళిస్తుంది. ఎందుకు? రచయిత 'చిక్కదు-దొరకదు' టైపు. ఆ రహస్యం మనకు చెప్పడు. పోనీ, ఆ ముడుల తాలూకు సంకెళ్లు ఎలా తెగిపోయాయో వివరించడు. పరిశోధించి, పరవశించాల్సిన మరెన్నో అంశాలను పాఠకుల ముందు పరిచి, తెలివిగా తప్పించుకుంటాడు. అదిగో, అక్కడే బాలాజీ తన ప్రత్యేకతను చాటుకుంటాడు.

♦♦♦

"ఏమైందో, ఏమిటో?" కథలో అతను బస్టాండులోని క్యాంటీన్‌లో కూచొని, మిత్రుడి కోసం ఎదురు చూస్తుంటాడు. ఓ మహిళ బస్సెక్కబోతూ, కింద పడిపోతుంది. త్రుటిలో ప్రమాదం తప్పించుకుంది. జనం మూగుతారు. తలా ఒక వ్యాఖ్య విసురుతారు. 'వ్యాఖ్యా'తల్లో కచ్చితంగా రచయిత ఉంటాడు. పరమ స్త్రీ పక్షపాతి అయిన ఆయన పనిగట్టుకుని మరీ "ఇంట్లో మొగోడు బండ్లో డ్రాప్ చేసింటే ఆమెకీ అవస్థ తప్పేది కదా. టయానికి బస్సు అందుకోవాలని ఒకే పరుగుపైనే వచ్చిందాది పాపం" అంటాడు.

వ్యాఖ్యల్ని గాలికొదిలేసి, ఆమె మౌనంగా బస్సెక్కి వెళ్లిపోతుంది. రెండోరోజు అతనికి ఆమె కనిపిస్తుంది. కొన్ని ప్రశ్నలు వేస్తాడు. వాటికి ఆమె చెప్పిన సమాధానాలు, వాటి లోతుపాతులు చదివి తీరాల్సిందే.

స్వార్థం మూర్తీభవించిన భర్త నీడన బతుకునీడ్చిన ఓ ఇల్లాలు కూతుళ్ల భద్రత గురించి వెర్రిగా ఆరాటపడే వైనం "కొన్ని ప్రేమలు... కాసిన్ని దుఃఖాలు"లో కనిపిస్తుంది.

"మీరేమంటారు?" కథలో పొదుపరిగా, లెక్కల మనిషిగా కనిపించే అతడి అత్తయ్య తీసుకున్న నిర్ణయం... ఆడవారిలో మొగ్గ తొడగాల్సిన చైతన్యానికి నిదర్శనం. ఊరిబయట చనిపోయిన మనిషిని ఊళ్లోకి రానివ్వని అర్థం పర్థంలేని కట్టుబాటుపై ఆమె తెలివిగా, తెగువగా దండెత్తిన తీరు అభినందనీయం.

కాలప్రవాహంలో ప్రేమ ఎలా పరిణామం చెందుతుందో చెప్పిన కథ "సూపర్ మార్కెట్". ప్రేమకు లోకం హారతి పట్టే కాలం, రోడ్లు విశాలమై మనసులు ఇరుకైన కాలం, టెక్నాలజీ దగ్గరై మనుషులు దూరమైన కాలం, డిజిటల్ భాషలూ సైగలే సమస్తమైన కాలం... ఇవీ కథలోని నాలుగు కాలాల 'ప్రేమలు'.

"ఏనుగుల్ని చూసినవాడు" ఓ బాలుడు! గుండెలు పిండేసే ముగింపు. ఈ కథలో వాక్యాల మధ్య పొంచి ఉండే అంతరార్థాల్ని గ్రహించాలి. ఏనుగు- భారీ కోరికకు ప్రతిరూపం. ఆశ- మనిషి అస్తిత్వపోరాటం!

దేశ ఆర్థిక వ్యవస్థను కుదిపేసిన నోట్లరద్దుపై సంధించిన "మంచిరోజులు", సామాజిక రాజకీయ శస్త్రం "పెద్దోళ్లు" రచయిత దృక్పథానికి అద్దం పడతాయి.

♦♦♦

బాలాజీ కథనం పదునుగా ఉంటుంది. శైలి ప్రవాహంలా సాగుతుంది. కథల్లో అనేకచోట్ల పదాల వెంట పదాలు కొలువుదీరుతూ సంఘటన తాలూకు దృశ్యాల్ని కళ్లముందు ప్రత్యక్షం చేస్తాయి. వాక్యాలు పరుగులు తీస్తాయి. కొన్నిసార్లు మనకు ఊపిరి ఆడకుండా చేస్తాయి. రచయిత చెప్పదల్చుకున్న భావాల్ని సాంద్రతరం చేస్తాయి.

''మరచిపోయిన లేదా మరచిపోయానని నేను అనుకుంటున్న మనుషులు, సంఘటనలు, అనుభవాలు, బాధలు, సందర్భాలు, జ్ఞాపకాలు, ఒక్కొక్కటిగానూ, సమష్టిగానూ గుర్తుకొచ్చేస్తాయి" (ఇంట్లోపలికి వెళ్లేముందు).

"ఇంట్లో కడగాల్సిన పాత్రలు, పళ్లాలు, చెయ్యాల్సిన పనులు గుర్తొచ్చేసరికి నీరసం ముంచుకొచ్చింది. టాయిలెట్ శుభ్రం చేసి చాలా రోజులవుతోంది. అదేందో ఆ పనిపైన నా పేరే రాసారేమో. ఎప్పుడూ నేను కడగాల్సిందే'' (ఏమవుతుంది?)

"నాలో నాతో ఉన్న మౌనమో, నిశ్శబ్దమో భగ్నమయ్యాక, రోడ్డుపైన సందడి, చప్పుళ్లు కలవరపెట్టాయి" (ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు).

"అసలు మనిషి పోవటం మరణం కాదు. జీవితంలో మార్పు లేకపోవటమే, మనిషిలో మార్పు రాకపోవటమే మరణం" టీ చప్పరిస్తూ, కళ్లు మిటకరిస్తూ అందావిడ. (ఏమైందో, ఏమిటో?)

పురస్కారం



# బండి నారాయణ స్వామికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు

ప్రముఖ కథ, నవలా రచయిత బండి నారాయణ స్వామికి 2019 సంవత్సరానికి గాను ఆయన రాసిన 'శప్తభూమి' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. డిసెంబర్ 18న కేంద్ర సాహిత్య అకాడమీ 23 భాషలకు సంబంధించిన పురస్కారాల వివరాలను వెబ్‌సైట్‌లో ప్రకటించింది. ఏడు కవితా సంపుటాలకు, నాలుగు నవలలకు, ఆరు కథా సంకలనాలకు, మూడు వ్యాస సంపుటాలకు, స్వీయ చరిత్ర, జీవిత చరిత్రలకు ఒకొక్కటి చొప్పున ఈ పురస్కారాలు లభించాయి. జనవరి 2013 నుండి డిసెంబర్ 2017 మధ్య కాలంలో ప్రచురించబడిన పుస్తకాలను ఈ పురస్కారాల కోసం పరిశీలించారు. తెలుగులో బండి నారాయణ స్వామి 'శప్తభూమి' నవలతో పాటు అగ్నిశ్వాస-నిఖిలేశ్వర్, (కవిత్వం), గేదె మీది పిట్ట - తల్లావఝుల పతంజలి శాస్త్రి (నవల), ఇక్కడి చెట్ల గాలి- నందిని సిధారెడ్డి (కవిత్వం), మూలింటామె- నామిని సుబ్రహ్మణ్యం నాయుడు (నవల), ఒంటరి - సన్నపురెడ్డి వెంకట్రామిరెడ్డి (నవల), పత్ర హరితం - దర్భశయనం శ్రీనివాసాచార్య (కవిత్వం), పొలం గొంతుక - దర్భశయనం శ్రీనివాసాచార్య (కవిత్వం), సత్యవతి కథలు- పి. సత్యవతి (కథలు), శ్రీ పదచిత్ర రామాయణము - విహారి (పద్య కావ్యం), విదిత - పెనుగొండ లక్ష్మీనారాయణ (వ్యాస సంపుటి) పుస్తకాల తుది జాబితా(షార్ట్‌లిస్ట్)ను ఆ ప్రకటనలో ఇచ్చారు. 2019 పురస్కార న్యాయ నిర్ణేతల కమిటీలో కేతు విశ్వనాథ రెడ్డి, శీలా వీర్రాజు, వి. చిన వీరభద్రుడు ఉన్నారు. 2020 ఫిబ్రవరి 5 న కేంద్ర సాహిత్య అకాడమీ ఢిల్లీలో నిర్వహించబోయే ఉత్తరాల పండగ (ఫెస్టివల్ ఆఫ్ లెటర్స్) కార్యక్రమంలో పురస్కార గ్రహీతలకు లక్ష రూపాయల నగదుతో సత్కరించనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. అనంతపురం జిల్లాకు చెందిన బండి నారాయణ స్వామి సమకాలీన తెలుగు జీవితాన్ని తన నవలల్లో, కథల్లో బలంగా చిత్రించారు. రాయలసీమలోని 18వ శతాబ్దపు సామాజిక చిత్రాన్ని 'శప్తభూమి' చారిత్రక నవలగా రూపొందించారు. 2017లో ప్రముఖ అమెరికా తెలుగు సంస్థ అందించే తానా బహుమతి శప్తభూమి లభించింది. గద్దలాడతండాయి, మీ రాజ్యం మీరేలండి, రెండు కలల దేశమ్, నిసర్గం నవలలు, వీరగల్లు చెమ్కి దండ కథలు సంపుటాలు వెలువరించారు. ఇటీవల 'రాయలసీమ-సమాజం-సాహిత్యం' వ్యాస సంపుటి వెలువరించారు. ♦

---

"ఒక నేను ఆస్పత్రిలోపలే నిస్సహాయంగా ఒంటరిగా భయపడి, ఆగిపోయిన రాత్రి. నిస్పృహలో నుంచి బయటపడి, అమ్మకు ధైర్యం చెబుతూ, కొత్త జీవితాన్ని వెతుక్కుంటూ కొత్తగా ఒక నేను మొదలైన రాత్రి" (మీరేమంటారు?)

బాలాజీ తన కథల్లో స్త్రీపురుష సంబంధాలను సున్నితంగా స్పృశిస్తాడు. ఆడవారికే అగ్రతాంబూలమిస్తాడు. వారి చాకిరీ మూలాలను పెళ్లగిస్తాడు. శ్రమజీవితం తాలూకు అదృశ్యకోణాలను వెలికితీస్తాడు. కళ్లెదుటే దర్జాగా తిరిగే శత్రువుల బండారం బయటపెడతాడు. అక్కడే మనిషిని కేంద్రంగా చేసుకుని, కథలు చెబుతాడు. మనిషిని అడ్డుకోత కోసి, నిలువునా ఆరేస్తాడు. ప్రేమ నటించే మనుషులు, మాటలు తినిపించే మనుషులు, పని (ఉన్నా) లేకుండా కాలం వెళ్లబుచ్చే మనుషులు, సాటివారి శ్రమలో భాగం తీసుకోకూడదని ఒట్టు పెట్టుకున్న మనుషులు ఆయన కథల నిండా కనిపిస్తారు.

ఉత్కంఠభరిత మలుపులు, నాటకఫక్కీ సంఘటనలు ఎక్కడా కనిపించవు. నిత్యజీవితంలో సర్వసాధారణంగా జరిగే సంఘటనల్ని జీవద్భాషలో చిత్రిస్తాడు. అక్కడ ఆగి, వాటి ముందువెనకలా బయటవెలుపలా దాగి ఉండే క్లిష్టమైన అంశాలను ప్రభావశీలంగా విశ్లేషిస్తాడు.

అస్తిత్వ వేదనకు అద్దం పట్టేలా చిత్రించిన రమణజీవి ముఖచిత్రం అదనపు ఆకర్షణ. ప్రముఖులు ఎ.కె.ప్రభాకర్, ఎన్.వేణుగోపాల్, డాక్టర్ ఎం.వినోదినిల ముందుమాటలతోపాటు చివర్లో బద్దూరి ధర్మారెడ్డి ఆత్మీయ స్పందన బాలాజీ కథల లోతుల్ని పట్టించే ఉత్తమ పరికరాలు.

"ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరి" తప్పనిసరిగా చదవాల్సిన కథలివి. మిత్రుడు పలమనేరు బాలాజీకి ఆత్మీయ అభినందన. ♦

కవిత

# నా డైరీ కనిపించడం లేదు..!

- చిరిగిన మంజుల
8500448513

నా డైరీ కనిపించడం లేదు
మీరేమైనా చూసారా..

ఉదయాన్నే పూసిన
తెల్ల మందార రేకుల్లా
మృదువైన అట్ట కలిగిన
నా డైరీ

అందమైన నా పేరుకు
మరింతఅందం వచ్చేట్టుగా
తెల్లని అట్ట మీద కెంపు రంగులో
రాసిన అందమైన అక్షరాలతో నా డైరీ
మీరెవరైనా చూసారా..!




తన పుటల మధ్య
మొగలి రేకులు దాచుకుని
పేజీ తెరవగానే
తన పరిమళంతో నను
తన్మయత్వానికి గురిచేసే
నా డైరీ..!

సాయంత్రం అయ్యేటప్పటికి
పెంపుడు పావురంలా
నా చేతిలో ఒదిగిపోయే
నా డైరీ...!

నా దినచర్యను
తన భుజాలకెత్తుకొని
నా సంతోషంలో భాగమై
నా విచారం తన
హృదయానికి హత్తుకొని
నను ఓదార్చి సేదదీర్చే
నా డైరీ...!

ఒకరోజు పూర్తయి
రెండవ రోజుకోసం
ఎదురు చూసేందుకు స్ఫూర్తిగా
నను జోకొట్టి నిదురపుచ్చి
నాకు వెన్నెల కాంతులు
నక్షత్ర తోరణాల స్వప్న వీచికలు
కానుకగా పంపి
రాత్రంతా నా తలగడ ప్రక్కన
మేలుకునుండే
నా డైరీ...!
కనిపించడం లేదు
మీరేమైనా చూసారా..!

నిన్న రాత్రి ఇక్కడే పెట్టాను
ఇల్లు సర్దడంలో
దారి తప్పి ఎటు పోయిందో
కనిపించడం లేదు

మీకెవరికైనా కనిపిస్తే
గుర్తు పట్టడం తేలికే
దారి తప్పి
బిక్కు బిక్కుమంటున్న
తెల్ల కుందేటి పిల్లలా
దిగాలుగా ఒకమూల
ఒదిగి ఉంటుంది..!

మీకు కనిపిస్తే
కాకితో కాస్త కబురుపెట్టరూ
జాజిపూల పల్లకీతో
ఎదురెళ్ళి స్వాగతిస్తాను..!




# కన్యాశుల్కంపై విమర్శ - పరామర్శ

- ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న
9440641617

*'తెలుగులో ఆది కవి నన్నయ్య అయితే, తెలుగు ఆధునికతను కల్పించింది గురజాడ. ఇద్దరి చేతుల్లో తెలుగు కొత్త పుంతల్ని తొక్కింది. సాంఘిక దురాచారాలను బట్ట బయలుచేసి సంఘ సంస్కారాన్ని సాహిత్యం ద్వారా, అప్పారాయ మహాకవికి పూర్వంగాని, తర్వాతగాని ఏ తెలుగు రచయితా ఆయన చేసినంత అమోఘమైన సేవ చెయ్యలేదనే నిస్సంశయంగా చెప్పవచ్చు. దేవుళ్ళూ, రాజులూ, ధనికులూ, ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహా పురుషుడు అప్పారాయ మహాకవి. సాహిత్య విప్లవకారుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు. అప్పారాయ మహాకవి తెలుగు జాతికి పెన్నిధి. ప్రపంచ కవుల కుటుంబానికి చెందిన విశ్వకవి.'*

**- శెట్టి ఈశ్వరరావు**

గురజాడ 'కన్యాశుల్కం' రాయలేదు అన్న దగ్గర నుంచి... ఎన్నో విమర్శలు చోటు చేసుకున్నాయి. ముద్రణ విషయంలో కూడా అనేక చర్చలు జరిగాయి. కన్యాశుల్కం నాటకంలోని ఇతివృత్తం, పాత్రలు, రసం, నాటక లక్షణాలు, నాటక ప్రయోజనం, భాష మొదలైన విషయాలపై వాదోపవాదాలు జరిగాయి.

గురజాడ కన్యాశుల్కం రాయలేదు అనేది ఒక విమర్శ. ప్రారంభం నుంచి సంప్రదాయ పిడి వాదులు గురజాడపైన, గురజాడ రచనలపైన విరుచుకుపడ్డారు. ఈ రోజు వరకు ఆయనపై విరుచుకు పడతూనే వున్నారు. వ్యక్తిగతంగా కూడా దాడిచేశారు. గురజాడ చేసిన తప్పు ఏమంటే, సమాజంలో పాతుకుపోయిన రుగ్మతల్ని సాహిత్యం ద్వారా బాగుచేయాలని మనసారా కోరుకున్నారు. అది సనాతన సంప్రదాయవాదులకు గిట్టలేదు. 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అని గురజాడ అన్నారు. గురజాడ మాటలు సనాతన పిడి సంప్రదాయ ముసుగు వీరులకు నచ్చలేదు. కారణం! సమాజం బాగుపడితే రాబోయే కాలంలో సమాజంలో వాళ్ళ ఆటలు సాగవని. సమాజంలో అందరూ చదువుకుంటే వాళ్ళ మాటలు ఎవ్వరూ వినరని. వాళ్ల దృష్టిలో సమాజం బాగుపడకూడదు. అభివృద్ధి చెందకుండా వుంటేనే వాళ్ళ ఆటలు సాగుతాయి.

వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రుల వారు వెనకవుండి కథ అంతా నడిపించారు. ప్రముఖ గ్రంథ ప్రకాశకులు. మరియు ప్రాణ మిత్రుడైన వావిళ్ళ వారు, గురజాడ వారికి తీవ్రమైన అపకారం చేయ తలపెట్టారు. అప్పుడు కవులు, రచయితలు, కళాకారులు, సాహితీవేత్తలు, మేధావులు ముఖ్యంగా పత్రికల వారు అందరూ ముక్త కంఠంతో ఖండించారు. ఏది నిజం

అని వావిళ్ళ వారిని అందరూ గట్టిగా నిలదీశారు. చివరకు వావిళ్ళ వారు చేసేది లేక గురజాడే 'కన్యాశుల్కం' రాశారని చేసిన తప్పును ఒప్పుకొన్నారు. ఇలాంటి వ్యక్తులు సమాజంలో ఎప్పుడూ వుంటారు. ఇటువంటి వాళ్ళపై ఒక కన్ను వేసి, సాహిత్య వేత్తలు ఎప్పుడూ జాగ్రత్తగా వుండాలి. లేకపోతే తెలుగు సాహిత్యానికి అన్యాయం చేసిన వాళ్ళం అవుతాం.

కన్యాశుల్కం మొదటి కూర్పుకి రెండో కూర్పుకి చాలా తేడా వుంది. ఈ విషయం పరిశోధకులందరికీ తెలిసిందే. రెండోసారి గురజాడ కన్యాశుల్కం రాయకపోతే గురజాడకు ఇంత పేరు వచ్చేది కాదు. మొదటి కూర్పులోని పాత్రలకు రెండో కూర్పులోని పాత్రలకు చాలా తేడా కన్పిస్తుంది. గురజాడ సహృదయ పాఠకుల్ని ప్రేక్షకుల్ని దృష్టిలో పెట్టుకొని, రెండో కూర్పులో మార్పులు చేర్పులు చేశారు. రెండో ముద్రణలో వచ్చిన కన్యాశుల్కం, ఉత్తమ స్థాయి నాటకంగా నిలిచింది. అంతేకాక ప్రపంచస్థాయిని అందుకోగల నాటకంగా పేరుగాంచింది. అందుకే రెండో ముద్రణ 'సాన పట్టిన మేలిమి వజ్రం' అయింది.

నాటకంలోని ఇతివృత్తానికి శాశ్వతం లేదన్నది ఒక విమర్శ. ఈ నాటకంలోని పాత్రలు సమాజంలో కన్పిస్తున్నాయి. ఈనాటికి కూడా గురజాడ సృష్టించిన పాత్రలు సజీవంగా వున్నాయి. అందుకు గిరీశం, రామప్పపంతులు, భీమారావు నాయుడు, భైరాగి పాత్రలు మంచి ఉదాహరణగా మనం తీసుకోవచ్చు.

అంకాలు పెంచారు. పాత్రలు పెరిగాయి అనేది ఒక విమర్శ. కన్యాశుల్కంలో బాలవితంతు సమస్య ఎలా ముడిపడి వుందో, నిరూపించే ఉద్దేశంతోనే, వితంతువులు వేశ్యా సమస్యల వైపు ఎలా బలవంతంగా లాగబడుతున్నారో, వేశ్యా సమస్య అన్ని వర్గాలపైన, అన్ని వర్ణాలపైన, అన్ని వృత్తులపైన ఎలా ప్రభావం చూపుతోందో, సంఘ సంస్కరణోద్యమంలో, ఈ సమస్య పరిష్కారం ఎందుకు కాలేదో ఇలా అన్ని విషయాల్ని విపులంగా, వివరంగా లోతుగా, చెప్పాలని అనుకున్నారు గురజాడవారు. అందుకే అంకాలు పెంచారు. పాత్రలు కూడా పెరిగాయి.

నాటకంలో మధురవాణి ప్రసంగాలు ఎక్కువగా చోటుచేసుకున్నాయి అనేది ఒక విమర్శ. కావాలనే మధురవాణి పాత్రను గురజాడ పోషించారు. తొలికూర్పులో కన్నా, రెండో కూర్పులో మధురవాణి పాత్రను పెంచి రాశారు. 'సదుద్దేశంతోనే మధురవాణి పాత్రను పోషించాను' అని గురజాడగారే చెప్పుకున్నారు.

రస పోషణలో గురజాడ అందె వేసిన చేయి. అందులో హాస్య రసపోషణకు పెట్టింది పేరు. నాటకమంతా హాస్య రసంతో వ్యంగ్యంతో చమత్కారంతో వెటకారంతో, ముఖ్యంగా నాటకమంతా హాస్య ధ్వనితో నడుస్తుంది. అంతేకాదు హాస్య రసం, ధ్వని వల్లే కన్యాశుల్కంకు అంత పేరు వచ్చిందని విమర్శకులు కొనియాడారు.

అయితే కన్యాశుల్కంలో వున్నది హాస్యం కాదని ముని మాణిక్యం గారు విమర్శించారు. దానికి ఘాటైన సమాధానం పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు ఇలా ఇచ్చారు. 'ఒక కాంతం పాత్రను సృష్టించినందుకే మునిమాణిక్యం వారు తెలుగు వారి కృతజ్ఞతలకు పాత్రులైనారు కదా! కన్యాశుల్కంలో కోటి సూర్యకాంతులున్నవి. కన్యాశుల్కంలో ఏమీ లేకపోయినట్లయితే, వీరేశలింగం గారి ప్రహసనాలు, పానుగంటివారి గ్రాంథిక 'వర విక్రయం', 'కంఠాభరణం' లాగా ఏనాడో ప్రజల మధ్య లేకపోయేవని రెండు అట్టల మధ్యనే జీవించి వుండలేదని' తీవ్రంగా ప్రతి విమర్శ చేశారు.

కన్యాశుల్కం నాటకంలో, బాహ్య దృష్టికి హాస్యరస ప్రధానంగా కన్పిస్తున్నా, అంతర్గతంగా ఇందులో ధ్వని (వ్యంగ్యం) చోటు చేసుకుంది. అటు హాస్యం, ఇటు ధ్వని రెండూ సమాంతరంగా నాటకంలో చక్కగా పోషించబడ్డాయి. అందుకే అద్భుతమైన నాటకంగా పేరుగాంచింది.

గురజాడ రాసిన 'కన్యాశుల్కం' నాటకంలో భరతుడు చెప్పిన రసం, ఆనందవర్ధనుడు చెప్పిన ధ్వని (వ్యంగ్యం) రెండూ సమ్మిళితంగా చోటు చేసుకున్నాయి. అంతేకాక అభినవగుప్తుడు చెప్పిన 'రస ధ్వని', నాటకమంతా అంతర్లీనంగా చాలా స్పష్టంగా కన్పిస్తుంది. రసధుని ధ్వనిఖని కన్యాశుల్కం. ఇలా 'రసధ్వనులు' రెండూ సమాంతరంగా ప్రవహిస్తున్న ఏకైక విశ్వ విఖ్యాత మహా ఉత్తమ నాటకం 'కన్యాశుల్కం'.

ఈ నాటకంలో ప్రాచీన నాటక లక్షణాలు లేవు అనేది ఒక విమర్శ. గురజాడ వారు ఈ నాటకాన్ని ప్రాచీన నాటక లక్షణాల్ని దృష్టిలో పెట్టుకుని రాయలేదన్న విషయాన్ని మనం తెలుసుకోవాలి. ఆధునిక కాలంలో పుంఖాను పుంఖాలుగా వెలువడే నాటకాలకు ప్రత్యేకంగా నూత్న లక్షణాల్ని మనం ఏర్పరచుకోవలసి వున్నది. కన్యాశుల్కం నాటక విషయం కూడా

ఇలాంటిదే. ఆధునిక నాటకాలకు ప్రాచీన నాటక లక్షణాలు అన్వయించబడవు.

అన్య దేశ పదాలు, ముఖ్యంగా ఆంగ్ల భాషాపదాలు నాటకంలో ఎక్కువగా వున్నాయి అనేది ఒక విమర్శ. గురజాడ ఆంగ్ల పదాలు వాడారు. ఇందులో వాడిన ఆంగ్ల పదాలు, తెలుగువారి నిత్య జీవితంలో సమ్మిళితమై పోయిన పదాలే అన్న విషయాన్ని విమర్శకులు గమనించాలి.

'కన్యాశుల్కం' నాటకం ద్వారా నాటకకర్త ప్రయోజనం సాధించలేకపోయారు అనే వాళ్ళు కూడా వున్నారు. ఇది విచారించదగ్గ విషయం. ఏమీ సాధించకపోతే వందలసార్లు నాటకం ప్రదర్శనకు ఎలా నోచుకుంటుంది. అసలు ప్రజలు ఎందుకు చూస్తున్నారు. ఆ గ్రంథం ఇన్ని సార్లు ఎందుకు ముద్రణకు నోచుకుంది. విమర్శకులు ఈ విషయాలన్నీ తెలుసుకోవాలి. కావాలని రంధ్రాన్వేషణ చేస్తే అది విమర్శ అనిపించుకోదు. కువిమర్శ అవుతుంది. విమర్శకులు ఒక గ్రంథాన్ని విమర్శించదలచుకుంటే వాళ్ళ కోణంలో నుంచి కాక రచయిత ఏ దృష్టితో ఆ రచన చేశాడో ముందు తెలుసుకోవాలి. ఆ కోణం నుంచే ఆ గ్రంథాన్ని విమర్శించాలి. గురజాడ ఈ నాటకం ద్వారా సాహిత్య ప్రయోజనాన్ని, సామాజిక ప్రయోజనాన్ని, భాషా ప్రయోజనాన్ని సాధించారు. ఈ నాటకం ద్వారా ఏ ప్రయోజనం కనబడలేదంటే అది వితండవాదమే. ఇప్పటికైనా గురజాడ రచనల్ని ఆ కాలం నాటి సామాజిక దృక్పథంతో తులనాత్మకంగా అధ్యయనం చేయాలి.

సంస్కరణ భావాల్ని గురజాడ నాటకంలో చెప్పారు కానీ, తాను లేవనెత్తిన సమస్యలకు పరిష్కారమార్గాన్ని నాటకంలో చూపించలేదు అనేది ఒక బలమైన విమర్శ వుంది.

బుచ్చెమ్మకు, మీనాక్షికి, పూటకూళ్ళమ్మకు పునర్వివాహం చేస్తే బాగున్ను కదా! అదే విధంగా గిరీశాన్ని సంస్కరించి మంచి వాడిగా నాటకంలో చూపితే బాగున్ను కదా! అనేది కొందరి విమర్శకుల వాదన. కొందరు అనుకున్నట్లు అలాగే పాత్రల్ని చిత్రీకరిస్తే, ఇతర సంఘ సంస్కరణ సాహిత్య గ్రంథాలలాగే ఈ నాటకం కూడా ఒకటి అయిపోయేది. బుచ్చమ్మను, పూనాలో వున్న వితంతు శరణాలయానికి పంపడం వల్ల, ఆమె భవిష్యత్ ఆమెకే వదిలి వేశారు. నాటక కర్త సహృదయ పాఠకుల్లో ఆమె భవిష్యత్ ఎలా వుంటుందో అన్న ఉత్కంఠ అలాగే వుంచారు. గిరీశాన్ని కూడా మార్చకుండా వుంచడమే అన్ని విధాలా మంచిదయింది. లేకపోతే గిరీశం పాత్రకు అంతపేరు వచ్చేది కాదు. గురజాడ కావాలనే గిరీశం పాత్రను చిత్రీకరించారు. ఇలాంటి పాత్రలు సమాజంలో వున్నాయని మనకు చూపించడం కోసం నాటకకర్త అలా చేశారు. ఆ విషయాన్ని విమర్శకులు గమనించాలి.

వీరేశలింగం దృష్టి ముఖ్యంగా సంస్కరణల్ని వేగవంతంగా విజయవంతం చేయడం. దురాచారాల్ని నిర్మూలించడం, బాల్య వివాహ వ్యవస్థను నిరసించడం. మూఢ నమ్మకాల్ని తీవ్రంగా ఖండించడం. వితంతువులకు పునర్వివాహం చేయాలని వీరేశలింగం కోరుకున్నారు. ఆ పని కూడా, సాహిత్యపరంగా, సమాజపరంగానే చేశారు. అయితే అందులోని కష్టనష్టాల్ని మంచి చెడ్డలపై ప్రత్యేక దృష్టి సారించారు గురజాడ. వైధవ్యం ఒక రకమైన నరకం. పునర్వివాహం మరో నరకమైంది అనాడు. సమాజంలో పునర్వివాహ జీవితం భరింపరాని బాధ కలిగించింది. ఈ విషయాలన్నీ గురజాడకు తీవ్రమైన అసంతృప్తి, అసహనం కలిగించాయని చెప్పకతప్పదు. గురజాడకు ప్రతీ విషయంలోనూ ఒక ముందు చూపు, ఒక నిశ్చలమైన అభిప్రాయాలు వున్నాయి. ఆనాడు సనాతన సంప్రదాయ కుటుంబ వ్యవస్థ, పునర్వివాహానికి ఎక్కువగా మొగ్గు చూపించలేదు. దానికి రకరకాల కారణాలు వున్నాయి. పునర్వివాహం కన్నా, స్త్రీలకు పూర్తిగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వుండాలని గురజాడ మనస్సు పూర్తిగా కోరుకుంది. అందుకే బుచ్చమ్మ, మీనాక్షి, పూట కూళ్ళమ్మ ముగ్గురికి నాటకంలో పునర్వివాహం చేయించలేదు గురజాడ. కన్యాశుల్కం నాటకం, ఊహల నుంచి పుట్టలేదు అనే విషయాన్ని విమర్శకులు గమనించాలి. జీవితం నుంచి పుట్టింది. సామాజిక జీవితాన్ని వున్నది వున్నట్లు చిత్రీకరించారు నాటకకర్త గురజాడ. కన్యాశుల్కం నాటకం ద్వారా సామాజిక శస్త్ర చికిత్స చేశారు. చికిత్స విజయవంతం అయింది. అందుకే నాటకం ఈ రోజుకీ వుంది.

కన్యాశుల్కం సమస్యా ప్రధానమైన నాటకమే కాని, పరిష్కారాత్మక నాటకం కాదు అనే దానికి గురజాడ ఇలా సమాధానం ఇచ్చారు.

'కన్యాశుల్కం నాటకం, పిలవని పేరంటానికి 'మా అప్ప పట్టు చీరె కట్టుకొస్తానని బయలుదేరి, యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కానీ దానికి ఒక మహత్తర నైతిక ప్రయోజనం వుంది' అని గురజాడ వారు ఒంగోలు ముని సుబ్రహ్మణ్యానికి రాసిన లేఖలో

పేర్కొన్నారు. కేవలం నీతినియమాలకు కట్టుబడి రచన రాస్తే అది ప్రమాణాలకు లోబడి, వాస్తవికతకు దూరమవుతుంది. ఇలాంటి రచనలు మనకు తెలుగు సాహిత్యంలో ఎన్నో కన్పిస్తున్నాయి. గురజాడ చేసిన మహోపకారం ఏమంటే, జీవితం ఎలా వుంటుందో నాటకాన్ని కూడా అలా చిత్రీకరించారు. అంచేతనే శ్రీశ్రీ 'జీవితం అంత గొప్పది కన్యాశుల్కం' అని అన్నారు. ఇది నూరుపాళ్ళు నిజం.

'కన్యాశుల్కం' నాటకంలో కన్యాశుల్కం అనే సమస్యతో పాటు, ఎన్నో సమస్యల్ని గూర్చి విడమర్చి విశదీకరించారు నాటకకర్త. లేకపోతే ఇతర నాటకాల్లాగే పేలవంగా వుండేది. వీరేశలింగం గారి నాటకాల్లో ప్రధాన లోపం ఇదే. ఈ లోపాన్ని గురజాడ గుర్తించే ఏడు అంకాలు, ముప్పై మూడు రంగాల పెద్ద నాటకంగా తీర్చిదిద్దారు. అందుకే ప్రముఖుల మన్ననల్ని ప్రశంసల్ని అందుకున్నారు.

కన్యాశుల్కం ఒక వర్గానికి సంబంధించి, ముఖ్యంగా అగ్రవర్ణాలైన బ్రాహ్మణులకు చెందిన నాటకమని ఒక విమర్శ సాహిత్య లోకంలో బలంగా వుంది. కాబట్టి ఇతర వర్గాల వారు, ఇతర కులాల వారు ఈ నాటకం చదవవలసిన అవసరం లేదు అనే వాళ్ళు కూడా ఈ సమాజంలో వున్నారు. ఇది నూటికి నూరు పాళ్ళు అవగాహన లేనివాళ్ళు కావాలని, పనికట్టుకుని, బురద జల్లాలని చేసే కువిమర్శ ఇది. ఆ కాలం నాటి సామాజిక పరిస్థితుల్ని మన కళ్ళ ముందు వుంచడానికి నాటకకర్త వివిధ పాత్రలతో మన ముందుకు వచ్చారు. అంతేకానీ ఈ నాటకం ఒక వర్గానికో, మతానికో, కులానికో, కొంతమంది అనుకున్నట్లు వ్యక్తులకో, సంబంధించినది కాదు. గురజాడ వారు వీటన్నింటికి అతీతుడు. ఈ విషయం ఆయన రచనల్ని విశాల దృక్పథంతో అధ్యయనం చేస్తే మనకు తేటతెల్లమవుతుంది. 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అన్న దార్శనికుడు గురజాడ.

సమాజంలోని అన్ని అంశాల్ని ఒక రచయిత తన రచనలో చెప్పలేదు. అలా చెప్పిన వాడు ప్రపంచంలో ఇప్పటికి లేదు. అది కుదరదు కూడా. ఇప్పటికైనా మీ వితండవాదాన్ని విడిచిపెట్టి, మంచి దృష్టితో విమర్శించడం అలవాటు చేసుకోండి. తీసుకున్న ఇతివృత్తం బట్టి ఏ పాత్రలు సమాజం నుంచి తీసుకోవాలి అనే విషయాన్ని రచయిత ఆలోచిస్తాడు. మా కులం గూర్చి చెప్పలేదు. మా మతం గూర్చి ఈ నాటకంలో లేదు. మా వర్గాన్ని గూర్చి రచయిత కనీసమైనా పట్టించుకోలేదు అనేది అర్థం లేని వాదన. ఈ విమర్శ చర్చలో నిలవదు. ఆ దృష్టితో విమర్శ చేయడం తప్పు కూడా. మీదుమిక్కిలి కువిమర్శ అవుతుంది. అందుకే కొడవటిగంటి కుటుంబరావు గారు 'విమర్శకులు రచయితల కన్నా రెండాకులు ఎక్కువ చదువుకోవాలి' అని అన్నారు.

అందరూ అన్ని విషయాలు రాయలేరు. కొన్ని విషయాలు కొన్ని అంశాలు కొందరే రాయగలరు. ప్రతీ రచయిత సమాజంలోని అన్ని అంశాల్ని తన గ్రంథంలో రాయలేదని విమర్శ చేయడం అజ్ఞానానికి పరాకాష్ట. ఉదాహరణకు గురజాడ, జాషువా గార్ల రచనలు తీసుకుందాం. ఇద్దరూ సమాజంలో పాతుకుపోయిన తీవ్రమైన సమస్యల్ని ముఖ్యంగా తమ సమాజంలో ఒక కులంలో జరిగిన అన్యాయాల్ని, అక్రమాల్ని, మోసాల్ని, బాధల్ని ఎత్తి చూపారు. ఆ సమాజం బాగుపడాలని కోరుకున్నారు. అంతేకాక సమాజంలోని అన్ని వర్గాల వారూ, అన్ని కులాలవారు బాగుపడాలని మనసారా కోరుకున్నారు. ఈ ఇద్దరూ వాళ్ళ గ్రంథాల్ని వాళ్ళ కులాల దృష్టితో రాయలేదు. సామాజిక దృక్పథంతో రాశారు. విమర్శకులు కూడా ఆ కోణం నుంచే అధ్యయనం చేయాలి. లేకపోతే కుమిర్శకులుగా సాహిత్యలోకంలో మిగిలిపోతారు. సాహిత్య విమర్శను తప్పుతోవ పట్టించినవారు అవుతారు.

ఇప్పటికీ గురజాడ రచనల పైన, ఆయన జీవితంపైన ప్రత్యేకించి 'కన్యాశుల్కం' పైన ఎన్నో పరిశోధనలు, విమర్శలు, విశ్లేషణలు, వ్యాఖ్యానాలు, సమీక్షలు, సంకలనాలు, సంపుటాలు వచ్చాయి. ఇంకా వస్తూనే వున్నాయి. అదే గురజాడకు, ఆయన రచనలకు వున్న గొప్పతనం. విశిష్టత కూడా.

తెలుగు సాహిత్యంలో, మరి ఏ ఇతర రచయితకు లేనంత ఖ్యాతి గురజాడ వారికి దక్కింది. వారి రచనలతో తెలుగు సాహిత్యం సుసంపన్నం అయిందనడంలో సందేహం లేదు. అందుకే యుగకర్త గురజాడ అయ్యాడు.

**"ఆధునిక సాహిత్య యుగకర్తే కాదు, తెలుగులో వ్యావహారిక భాషా రచనకు, ఉపక్రమించిన వారిలో ప్రథములు కూడా గురజాడే. వ్యావహారిక భాషోద్యమానికి గిడుగు లక్షణం ఐతే, దానికి లక్ష్యం చూపిన వారు గురజాడ"**

**- గొర్రెపాటి వేంకట సుబ్బయ్య**

◆

# జీవభాష

- డా॥ దేవరాజు మహారాజు
9908633949



కవిత్వం ఒక ప్రత్యేక పరిభాష
అది అన్ని భాషలకు లొంగుతుంది
అన్ని భాషల్ని లొంగదీసుకుంటుంది
తల వంచినట్టే వంచి, అన్ని ప్రక్రియల్ని
తన రెక్కల కిందికి లాక్కుంటుంది
కాలంతో పాటు సాగుతూ
ఒక్కోసారి కాలాన్నీ అధిగమిస్తుంది
కవిత్వం ఒక జలభాష
అది ఏ పాత్రలోనైనా నిండుతుంది ఒదుగుతుంది

కవిత్వం ఒక *Ideogram*
అది ఛ్ఛందస్సులో బతుకుతుందా
మాత్రాచ్ఛందస్సులో బతుకుతుందా
వచనంలో బతుకుతుందా అనే చర్చ
ఎంత అర్థరహితమంటే...
జీవం ఏ రకపు జీవిగా నిలుస్తుంది? అని ప్రశ్నించినంత!
ప్రాణులు పుడతాయి గిడతాయి కాని...
నిరంతరం కొనసాగేది జీవశక్తి మాత్రమే!

ప్రక్రియలూ అంతే !!
అంతర్గతంగా సాగేది కవితా శక్తి మాత్రమే!
అదొక్కటే కాలానికి, జీవితానికి, మానవత్వానికి
అట్టడుగున ప్రవహించేది
ఆధారమై ఉంటుండేది
కవిత్వం ఒక ప్రత్యేక పరిభాష
అది అన్ని జీవుల
జీవ భాషల్లో వెలువడుతుంది! ♦

---

# లొకేషన్ షేర్ చెయ్యండి

- బంగార్రాజు కంఠ
8500350464

చిన్నప్పుడు
అక్షరాలు కూడబలుక్కుంటున్నప్పుడు
పాఠ్యపుస్తకాల్లో తారట్లాడేది
జీవితాన్ని తడుముకోవడం మొదలెట్టాక
నడిచొచ్చిన దోవ దోవంతా వెతుకుతున్నా
ఎక్కడా అయిపు లేదు

తనకోసం తనచేత
తనే ఏర్పాటు చేసుకున్న బతుకును
ఏదో అవసరంగా
బానిసత్వం చప్పరిస్తున్న చప్పుడు
బడుగైనా పిడుగైనా
ఏ మనోఫలకంపై చూసినా
జింకను పులి వెంటాడుతున్న సన్నివేశం



ఓటు హక్కు పుట్టిన నాటినుండీ
ఓటును విస్మరిస్తున్న కాలం వరకు
పేదోడు కేడర్ పెద్దోడు లీడర్

సీనే...మ్ మారలేదు
ఒకే దేశం అంటున్నాం
జనమంతా ఒక్కటని మాత్రం ఒప్పుకోలేం
ఇప్పుడు చంపబడకుండా
బతికిపోవడం డెమోక్రసి

ప్రవహిస్తున్న కాలం పాదాల కింద
హతుడే హంతకుడిప్పుడు
కావాలంటే కరెంట్ అఫైర్స్ తిరగేసుకోండి
చరిత్ర కంతల్లోనూ
చితికిన బతుక్కే చితి పేర్చబడింది

ఈ భూమి మీద అతిపెద్ద ప్రజాస్వామ్యం
ఎవరికన్నా తారసపడుంటే
కా...స్త లొకేషన్ షేర్ చెయ్యండి ప్లీజ్...!! ♦




# కన్నీటి అలల్ని మోసుకొచ్చిన కవిత్వం

- కెంగార మోహన్
9000730403

మనిషి జీవితం వైవిధ్యంగానూ, సంక్లిష్టంగానూ, వైరుధ్యాలతో సాగిపోతున్నది. వాస్తవిక పునాదుల మీదు పరచుకున్న కలలైతే మాత్రం కలకాలం నిలిచే ఉంటాయి. భ్రమల్లో జీవిస్తుంటే మాత్రం అస్తవ్యస్థ పయనమే అవుతుంది. ఈ క్రమంలో కవి పాత్ర క్రియాశీలమైనది. ప్రజల్ని చైతన్యవంతం చేస్తున్న ప్రజాసాహిత్యమే ఈ దేశానికి దిశానిర్థేశం చేసేది. అందుకే కవి, రచయిత ఏ పక్షాన ఉండాలి..ఎవరి పక్షాన ఉండాలి నిర్ధారించుకోవాల్సి ఉంటుంది. ఇక్కడ మాక్సీం గోరి చెప్పిన మాటల్ని గుర్తు చేసుకోవాల్సిందే. **“ In its basis art is the struggle for or against. There is not such nor can there be any different art because man is not a camera, he doesn`t fix reality but either affirms or changes or destroys it ”** అంటాడు. అందుకే కవి సమాజ నాఢీ పట్టుకోవాలి. సమాజగమనంలోని ప్రతి పరమాణువును పరిశీలించి ఆయా మార్పుల్ని, మార్చుకుంటున్న దిశల్ని బేరీజు వేసుకుని అక్షరీకరించి కవిత్వం రాయాలి. బహుశా ఈ కవి అదే పని చేస్తున్నాడని పిస్తోంది. ఇటీవల కాలంలో ఊదా రంగు కలలు పేరుతో విజయచంద్ర సాహిత్యలోకానికి కవిత్వం అందించాడు. ఈ ఉత్తరాంధ్ర కవి కవిత్వంలో లోతైన హృదయాన్వేషణ, ఎక్కడో తీగకు అల్లుకు పోయిన భావాల్లాంటి కలల అలలు నిద్రలేపుతాయి. భావుకతతో ఓ వైరాగ్య భావాన్ని మదిపై కుమ్మరిస్తాడు. అది నిస్సత్తువతో కూడిన చేతనంతో కూడిన భావన. కవి హృదయం సమాజం పట్ల ఇంత భాధ్యతగా ఉంటుందా అనిపించే కవిత్వం అందించాడు. ఆ కవితా పంక్తుల కన్నీటి చుక్కలు రేఖామాత్ర పరిచయంగా చూస్తే...

*కన్నీళ్ళు దాచే వీరులు*
*గాయాల్ని కనిపించనివ్వరు*
*అవమానాలకు చలించరు*
*బెదిరింపులకు భయపడరు*
*ప్రలోభాలకు పొంగిపోరు*
*ఆకాశమంత నిజాన్ని భూమంతా పర్చి*
*పాత నేలకు కొత్తరంగులు వేసి*
*ఇంద్ర ధనుస్సులు సృష్టిస్తారు*
*సూర్య తేజస్సులా వ్యాపిస్తారు*
*గలగల పారే నదుల వేగం*
*అందుకుంటారు..* (వీరులు)..నిజమే కదా..ఇంతటి త్యాగం ఎవరికుంటుంది. కవిత్వాన్ని సాదాగా చెబుతూతే

అకస్మాత్తుగా లోతుల్లోకి ప్రవేశించి తడుముతాడు. దేశంపై అవిభాజ్యమైన ప్రేమ గుండెలో గూడుకట్టుకున్న కవిగా ఇక్కడ కనబడతాడు. ఈ కవిత్వం గాయాల కవిత్వం. అనేకానేక సామాజిక వస్తువుల సంగమం. తనకు తానేదో రాసి పడేయ్యడం కాదు..కవి పరిష్కారం అన్వేషించాలి. ఎలా వెతకాలి..

*సహించలేని దేహాగ్ని*
*రగిలిపోతున్న కాలాగ్ని*
*ఆత్మహత్యల ముఖాగ్ని*
*విడిచిపెట్టేదెక్కడో*
*ఎవడో ఒకడురాడా*
*అందుకోవడానికి*
*ఆయుధంలా మలచడానికి*
*మంచం మీద భూకంపంలా*
*విశ్వమంతా కదిలిస్తూ*
*రహస్య కవిత్వం రుచిస్తున్నా..*(నిద్రరాక). దేహం ఎంతగా మండిమంటైతేనే ఈ సమాజానికి దివిటీ కాగలదు. ఎన్ని కలలు గన్నాడో..ఎన్ని నిద్రలేని రాత్రుల్లో కన్నులు కాయలు కాచాయో..అది రహస్యకవిత్వం రుచించడానికేనా..? తన స్వప్నాల్లో ప్రాపంచిక దృశ్యాల్ని ఆవిష్కరించడానికేనా..?ఇది నిజం కాదా..అక్షరసత్యం కూడా..కొన్ని సందర్భాల్లో కనే కలలు .. ఆ కలల కవితలు ఇలా వుంటాయి..

*మాటలన్నీ నిప్పంటుకొని*
*కవితలన్నీ నగరి మృతుల్లా*
*కాలిపోయి, బొగ్గైపోయి..*
*ఇక్కడంతా గొప్ప శోకం పరితాపం*
*అమ్మో అయ్యో*
*పెడబొబ్బలు కేకలు*
*హాహాకారాలు ఆర్తనాదాలు*(పెంగ్విన్)..ఇన్ని దృశ్యాల్ని చూస్తాడు. కవి అంతరంగమైదానం విశాలంగా లేతగడ్డిపరచుకున్నట్లుంటుది కాబోలు. నడుస్తున్న దారిలో చిన్న ముల్లున్నా పక్కకు వెళడం కాదు..ఏరేసుకుంటూ వెళ్ళాలనుకుంటాడు. మరొకరికి బాధ కలగకూడదని పరితపించే సున్నిత హృదయుడీ కవి. కవిత్వంలో సౌందర్యం కంటే, వస్తు, శిల్ప, భావుకత కంటే, అనిర్వచనీయ ఎత్తుగడలకంటే కవిత్వం హృదయం నిండా అల్లుకుపోవాలనే కాంక్షే కనబడుతుంది. చాలా చాలా సామాన్యాక్షరాలతో కవిత్వం సృష్టిస్తాడు. "కన్నీళ్ళలా కళ్ళల్లోంచి జలజల జారే గుండె తలుపు తట్టి తట్టి పిలిచే వాళ్ళే గదిలో కూర్చొని ప్రియభాషణ చేసే వారే ఆకుపచ్చని జ్ఞాపకాలు వారందరూ మావాళ్ళే.."మాట్లాడుతున్నట్టే ఉ ంటుంది..చెబుతున్నట్టే ఉంటుంది..మౌనంగా విధ్వంసం సృష్టిస్తుంది. కవి చూస్తున్న కోణం అలాంటిది మరి. విజయచంద్ర కవిత్వం చదువుతున్నంత సేపూ గుండె తేలికౌతుంది. తన కవిత్వంలో చాలా దూరమే ప్రయాణించాడు. కలిసినడుస్తూ.. కవిత్వంతో ఎన్నో ఊసులు చెప్పి ఉంటాడు. ఎన్నో ఆవేదనల్ని పంచుకుని ఉంటాడు..అందమైన రంగురంగుల కలలే కాదు.. అందుకేనేమో కవి పయనం ఇలా సాగుతుంది...

*ఇంత దూరం వచ్చాక తెలిసింది*
*ఈ దారి ఎటువంటిదో*
*ఎన్ని దృశ్యా దృశ్యాలను చూపిందో*
*ఎన్ని గుండెల్ని తాకిందో*
*ఎన్ని మలుపులు తిరిగిందో*(మజిలి)..కవిత్వ గరిమనాభి దగ్గర నిటారుగా నిల్చుని సమాజాన్ని... వర్తమాన సమాజంలో తనూ మమేకమై, జీవిస్తున్న మనుష్యుల్ని చూస్తున్న కవిత్వ చైతన్య శీలి విజయచంద్ర..ఒక్కమాటలో చెప్పాలంటే కలాన్ని కత్తిగా ఝళిపిస్తున్న కవి. సమాజ పురోభివృద్ధికి త్రికరణశు ద్ధిగా కృషిచేస్తున్న కవనసేద్యగాడు. అందుకేనేమో " నా కవిత్వపు బోధి వృక్షం క్రింద ఒంటరిగా ఒక్కడివే కూర్చొని నిశ్శబ్దంగా కళ్ళు మూసుకొని ధ్యానించు పదే పదే నా కవితను పఠించు " అంటాడు. ఈ విశాల విశ్వంలో మనిషి స్థానమెంతో దక్కే జీవితమెంతో..మన ఉనికి ఎంతో స్పష్టంగా చెప్పగలిగిన కవి. కవిత్వంలో వాస్తవిక జీవితం నిక్కచ్చిగా ప్రతిఫలించాలని కోరుకుంటాడు. ప్రతీ కవిత వాస్తవాన్ని స్పృశిస్తుంది. వాస్తవిక కవిత్వ భావచిత్రాలు తమ లక్ష్యాన్ని సాధిస్తాయని బలంగా నమ్ముతాడు. అటువంటి కవిత్వవే రాయాలనుకుంటాడు. అలా రాసిన వాళ్ళు సాహిత్యంలో రావిశాస్త్రి, గురజాడ, శ్రీశ్రీ, చెరబండరాజులు మాత్రం కనిపిస్తారు. ఈ కవి కూడా వాస్తవాన్ని కలగనే స్వాప్నికుడు. తనకంటూ స్పష్టంగా నిరిష్టంగా ఒక జెండా,

## కవిత

# పుస్తకాన్ని ప్రేమిద్దాం

-ప్రభు

ఒక తరం ఆలోచనలన్నీ
కాలపు పొరల్ని తొలుచు కుంటూ వొచ్చి
ఇక్కడి అరల్లో కూర్చొని వేచి ఉంటాయి
మన వెనుక వర్తుల గతంలోని భవిష్యత్తుని
అవి స్పష్టంగా చూస్తుంటాయేమో

మనం వర్తమాన కొసని పట్టుకొని
గతంలోకి జారాలనుకుంటాం
పుస్తకాల్లో సౌందర్యం సముద్ర తీరమంత
కరుణతో పిలుస్తుంటుంది

రాయి మీంచి,
ఆకు మీంచి,
లోహం మీంచి
కాగితం మీదకి
నడుస్తూ వచ్చిన ఆలోచన
ప్రోగ్రామ్‌గా మారి డిజిటల్ కావొచ్చు గానీ



దేహంలోని చిలకలాగా
పుస్తకంలోని వ్యక్తి ప్రతిఫలించే తరం
మన జోస్యాన్ని పలుకు తుంటాయి.

ఉద్యోగం కోసం,
జ్ఞానం కోసం,
ఆనందం కోసం
గ్రంథాలయం సకలమానవసంబంధాల రూపమై
అద్భుత లౌకిక సౌందర్యంతో
ఇలా నిలిచి ఉంటుంది

ఎలక్ట్రానిక్ అక్షరాలు సెల్ లో ఉన్నా
పుస్తకం చేతుల్ని తాకి
కళ్ళలోకి ప్రవహించి
గుండె ని మీటి
జ్ఞానసౌందర్య రాగాన్ని ఆలాపిస్తుంది
మనం మన తరం వ్యక్తి గా పుస్తకమై ఉండొచ్చు
వ్యక్తి పుస్తకం లోని తరంగా ఉండొచ్చు

గ్రంథాలయం భావిని
రూపొందించే వర్తమానం
పుస్తకాన్ని ప్రేమిద్దాం
అది మన్ని ఉద్యోగి చేస్తుంది
రసహృదయిని చేస్తుంది
తాత్వికుణ్ణి చేస్తుంది
విప్లవ కారుణ్ణి చేస్తుంది
విధ్వంసం చేస్తుంది
నిర్మాణం చేస్తుంది

అనేక మంటల్లో పుటం పెట్టి
మనిషిని చేస్తుంది ◆

---

అజెండా కలిగి ఉన్నవాడు..ఈ ఊదారంగు కలల కవిత్వంలో వల అద్భుతమైన కవిత..

***దేశమంతా ఒక గాఢ్సే గుండు తిరుగుతోంది***
***సంఘీభావ మిత్రులారా***
***క్రైస్తవాలయాల్లో దూరుతోంది***
***మసీదుల్లో వెతుకుతోంది***
***ప్రార్థనా స్థలాల్లో గాలిస్తోంది***
***కోవెళ్ళ పునాదులు కదిలిస్తోంది***
***దైవ భక్తుల సమూహాలలో***
***సంశయ దృష్టితో తొంగి తొంగి చూస్తోంది***
***నువ్వు ఎదురైతే***
***గుండెలను చీల్చేస్తుంది***
***గొంతు నులిమేస్తుంది.*** ఈ కవితలో అంతర్లీన రహస్యం మతోన్మాదం. మనం ఏం తినాలో తిన కూడదో నిర్ణయించుకునే బతుకులు బతుకుతున్నాం. తిండికి కూడా స్వేచ్ఛ లేకుండా చేస్తున్న దుర్నీతి పాలకుల వైఖరిని ఈ కవిత ద్వారా ఎండగడతాడు. ఇటువంటి కవితలు ఈ కవిత్వంలో చాలానే ఉన్నాయి. కవి నిరంతరం కలల కంటాడు. కలల సాకారానికి తపన పడతాడు. కావాల్సిన సమాజం కోసం కవిత్వంతో శ్రమిస్తాడు. సంఘర్షణతో కూడిన పోరాటం..ఆయుధం మాత్రం కలమే. అందుకే ఈ కవి "కలమే నా ఆయుధం దాన్నే గట్టిగా పట్టుకున్నా" అంటాడు. ◆

# అనివార్యం

- దుర్గాప్రసాద్
917978274707



"సాంబమూర్తి గారు! టైమ్ నాలుగు అయ్యింది. కొళాయిలో నీళ్లు వచ్చే వేళయింది. టైపింగ్ పని కుడా పూర్తిఅయింది. ఇక నేను వెళ్ళిరానా?." రోజూ నేను ఇదే విధంగా వేడుకునే పరిస్థితి హెడ్ గుమస్తా సాంబమూర్తి గారిని.

సాంబమూర్తి గారు పనిలో చాలా నిమగ్నులయి సాయంకాలం లోపల పని పూర్తిచేసే ఫైల్స్ హెడ్ ఆఫీసుకు పంపించే హడావిడిలో ఉన్నారు.

"ఇదిగో అమ్మాయ్! ఉద్యోగానికి రాజీనామా చేసేసి చక్కగా ఇల్లు సంసారం చక్క దిద్దుకో. ఈ ఉద్యోగం ద్వారా ఒక నిరుద్యోగి అయినా బాగుపడతాడు!" ఫైల్స్ లోపలనుంచి తల ఎత్తకుండా జవాబు ఇచ్చాడు.

కాసేపటికి ఆయన తల పైకెత్తి "ఇంకా ఇక్కడే ఉన్నావు ఏమిటి, వెళ్లి రమ్మని వేరేగా చెప్పాలా?, రోజూ ఉన్న భాగోతమేగా!".

"అన్నట్టు రేపు పుష్యమాసం మొదటి గురువారం. పండగ ముందర గురువారం కాబట్టి పూర్ణం బూరెలు ఇంకా పులిహోర తేవడం మర్చిపోకుసుమా!" సాంబమూర్తిగారు నవ్వుతూ అన్నారు.

"అయ్యో ఎంత మాట, మీరు వేరే చెప్పాలా!" నవ్వుతూ బయలుదేరాను.

ప్రక్క సీటులో ఉన్న అప్పలనాయుడు నవ్వుతూ వీడుకోలు పలికాడు.

◆◆◆

ఆమె అటు వెళ్ళగానే గుమస్తా పాండురంగా రావు మరియు క్యాషియర్ అప్పలనాయిడు ఆమె మీద ఫిర్యాదు మొదలుపెట్టారు.

"మూర్తి గారు..ఆమె వరస ఏమి బాగలేదు. రోజూ పదకొండు గంటలకు ఆఫీసుకు రావడం, నాలుగు అయేసరికల్లా మొగుడు, పిల్లడు, సంసారం అని బయలుదేరడం, రోజు అలవాటుగా మారిపోయింది ఆమెకు"

"మేము మాత్రం సాయంకాలం ఆరు దాటే వరకు ఆఫీస్ వదలకూడదు!" విసురుగా జవాబు ఇచ్చి అప్పలనాయిడు డిస్పాచ్ ఫైల్స్ పట్టుకుని తన సీట్లోకి వెళిపోయాడు.

"సరే లేవయ్యా. ఆమె, ఎంతయినా చనిపోయిన మన తోటి మిత్రుడు చంద్ర శేఖరంగారి అమ్మాయి. మనకు చంద్ర శేఖరంగారు చేసిన ఉపకారం మర్చిపోకూడదు. రేపు ఆమె వస్తే మందలిస్తాలే!" నవ్వుతూ సాంబమూర్తి గారు జవాబు ఇచ్చారు.

ఇది రోజూ ఉండే నాటకం. ఆమె లేటుగా రావడం, అందరికి ఏదో ఒక రుచి ఆయన వంటకం తేవడం.మరియు పంచి పెట్టడం, అందరు ఎంతో మెచ్చుకుని తినడం ఆఫీసులో అలవాటు అయిపోయింది.

◆◆◆

మెల్లంగ ఆఫీస్ మెట్లు దిగుతూ లాలాపేట బస్సు స్టాప్ దగ్గరకు బయలుదేరాను. మా నాన్నగారు చనిపోతే కంపాసినేషన్ గ్రౌండ్ క్రింద నాకు ఇండియన్ రైల్వేస్ సిగ్నల ఇంజనీరింగ్ అండ్ టెలీకమ్యూనికేషన్ డిపార్టుమెంట తార్నాక రోడ్, లాలాపేటలో టైపిస్టుగా ఉద్యోగం దొరికింది.

నేను బస్సు స్టాప్ రాగానే ఎదురుగా 10 H బస్సు ఇసిఐఎల్ వెళ్ళడానికి రెడీగా ఉంది. పరిగెత్తుకుంటూ ఒక్కసారిగా లేడీస్ సీట్లో జొరబడ్డాను.

"మెల్లంగ ఎక్కండమ్మా లేడీస్ సీట్లు ఖాళీగానే ఉన్నాయి!" విసుగ్గా టికెట్స్ ఇస్తూ చెప్పాడు కండక్టర్.

నా బుర్రంతా ఆలోచనల్తో సతమత మవుతున్నాయ్. ఇంటికి చేరగానే నీళ్లు పట్టాలి, అత్తగారికి ఫలహారం చెయ్యాలి, చిన్న ఆడపడుచు లత చీరకు ఫాల్స్ కుట్టాలి, మా వారు ఇన్‌స్పెక్షన్ మీద మూడు రోజులు విజయవాడ క్యాంపుకు బయల్దేరుతున్నారు, ఆయన పెట్టి సర్దాలి, అబ్బాయ్ మోహన సైన్స్ ప్రాజెక్టు బొమ్మలు గీసి అట్టలు వేసి రెడీ చెయ్యాలి, టెన్త్ క్లాస్ కావడం వలన మా అబ్బాయ్ రాత్రింబవళ్ళు కష్టపడి చదువుతున్నాడు. స్వతహాగా తెలివి తేటలగలవాడు కావడంతో నాకు వాడిగురించి ఎక్కువ దిగులుపడ అవసరం అయ్యేది కాదు.

నా జీవితానికి ఒకటే లక్ష్యం ఎలాగైనా మా అబ్బాయ్ మోహన్ను మంచి కాలేజీలో ఇంజినీరింగ్ చదివించి పై చదువులకి విదేశాలు పంపించాలని.

మావారు ఒక స్కూల్ టీచరుగా, నేను ఒక రైల్వే ఎంప్లాయిగా జీవితంలో ఎటువంటి పురోగతి లేకుండా ఫుల్-స్టాప్ పెట్టేశాం.

నాకు ఏ రోజు ఉద్యోగం చెయ్యాలని ఉండేదికాదు. చక్కగా వంట – వార్పు చేసుకుంటూ, నేను నేర్చుకున్న కుట్లు అల్లికలతో ఇల్లును చక్కగా తీర్చిదిద్ది, భర్త పిల్లలకి సేవ చేస్తూ గడిపేయాలని ఉండేది.

కానీ ఎవరో అంటారే తాను ఒకటి తలస్తే దైవం ఒకటి తలుస్తుంది అన్నట్టుగా, అదే జరిగింది సరిగా నా జీవితంలో కూడా.

వరంగల్లో సెకండ్ ఇయర్ ఇంజనీరింగ్ చదువుతున్న తమ్ముడికి ఫీజు కట్టడానికని బయలుదేరిన మా నాన్నగారు ఫీజ్ కట్టేసి వస్తుండగా హార్ట్ స్ట్రోక్ వచ్చి చనిపోవడం వలన ఇంటి భారం మొత్తం నా మీద పడింది. తమ్ముడు ఇంజనీరింగ్ పూర్తి చేసుకుని ముంబైలో స్థిర పడ్డాడు. నేను మా మేనత్తగారి అబ్బాయితో పెళ్ళిచేసుకుని హైద్రాబాదులో స్థిరపడ్డాను.

ఉద్యోగం, మొగుడు, పిల్లడు, సంసారం బాధ్యతలతో సతమత అవుతూ అనేకసార్లు ఉద్యోగానికి రాజీనామా చేద్దామని అనుకున్నాను. మావారు నన్ను ఏ రోజు ఉద్యోగం చెయ్యమని బలవంతం చెయ్యలేదు. కానీ ఆయన జీతం మా నెలసరి అవసరాలకి తప్పించి పొదుపు చెయ్యడానికి ఏమి మిగిలేదికాదు. పెళ్లికాని ఆడపడుచు, అంతంత మాత్రం ఆరోగ్యంతో ఉన్న మా అత్తగారు, మందులు, అబ్బాయి పై చదువులు చదివించడానికి కావాల్సిన డబ్బు ఇవన్నీ సమకూర్చాలంటే నేను ఉద్యోగం చెయ్యడం చాలా అవసరం.

ఇన్ని ఆలోచనల మధ్య కుషాయిగూడ బస్సు స్టాప్ దాటిపోయి కమలానగర్ బస్సు స్టాప్ ఎప్పు ి వచ్చేసిందో తెలియనే లేదు. మెల్లంగ ఇసిఐఎల్ నుంచి రిక్షా మాట్లాడుకుని ఇంటికి బయలుదేరాను.

ఇంటికి చేరగానే కాళ్ళు, చేతులు కడుకుని, వంటింట్లో టీ పెట్టుకుని నేను ఒక కప్పు టీ తీసుకుని అత్తగారికి ఒక కప్పు అందించాను.

అప్పటికే అత్తగారు కూరలు తరిగేసి, బూరెలకు పెసరపప్పు, తోపుకి మినపప్పు బియ్యం కడిగేసి నానపెట్టేసి, రొట్టెలు చెయ్యడానికి గోధుమ పిండి కలిపేసి ఉంచారు. ఆడపడుచు లత ద్వారాలకు మామిడి కొమ్మలు ఇంకా బంతి పువ్వుల దండలు కడుతున్నాది.

"ఎందుకు అత్తయ్య శ్రమ పడిపోతున్నారు, అసలే మీరు గుండె జబ్బు మనిషి, ఇప్పుడు ఇంత పని చేయడం అవసరమా? నేను వచ్చి చేసుంటాను కదా!" విసుగ్గా అన్నాను.

"రోజల్లా మా అందరికోసం కష్టపడంగా లేంది, నేను నీకు ఈ మాత్రం చెయ్యేకపోతే నాకు మనసు ఒప్పదు!" ఎదురు జవాబు ఇచ్చారు అత్తగారు.

తెల్లవారి నాలుగు గంటలకు లేచి ముందుగా అబ్బాయి మోహన్ను నిద్రలేపి చదువుకోవడానికి కూర్చో పెట్టాను.

అత్తగారు నిద్ర లేవడంతో ఆమెకు ఒక కప్పు కాఫీ అందించి స్నానానికి బయలుదేరాను. బూరెలు, పులిహోర, వంట రెడీ అయేసరికల్లా ఎనిమిది అయింది. పూజ చేసుకుని, క్యారేజీ సర్దుకొని ఆఫీసుకు బయల్దేరేసరికల్లా తొమ్మిది దాటిపోయింది.

బస్సులో ధక్కాముక్కీలు పడుతూ చిన్నంగా పదిన్నరకు

ఆఫీసుకు చేరుకున్నాను. రిజిస్టర్లో సంతకం పెట్టేసి బూరెలు, పులిహోర కేరేజి నుంచి తీసి ప్లేటులో పెట్టి సాంబమూర్తిగారికి అందించాను. మిగతాది మా ప్యూన్ చంద్రమ్మకు చెప్పి అందరికి పంచి పెట్టమన్నాను.

"ఏమైనా చెప్పు....నీ చేతి వంటలో అమృతం వుందమ్మా. బూరెలు, పులిహోర మహా భేషుగా ఉన్నాయ్!" తింటూ సెలవిచ్చారు సాంబమూర్తిగారు. మిగతా స్టాఫ్ కుడా పొగడ్తలతో ముంచెత్తేసారు.

దేముడా ఈ రోజుకు తిట్లగండం గడిచిందని సంతోష్ పడి నా సీట్లోకి వచ్చి పని ప్రారంభించాను.

♦♦♦

"గతం సుడులుగా తిరుగుతూనే ఉంది!".

"గడిచిన కాలానికి గుర్తించడానికి ఎటువంటి ఆనవాళ్లు ఉండవు జ్ఞాపకాలు తప్ప. కొత్త నెల లేదా సంవత్సరం ప్రారంభం కావడానికి ఎటువంటి ఉరుములు లేదా బాకాలు వినిపించవు. అలాగే క్రొత్త శతాబ్దం ప్రారంభమైనప్పుడు కూడా మానవులు మాత్రమే తమ, తమ సంతోషాలను పరి పరి విధాలుగా పండుగలా జరుపుకుంటారు. కాల చక్రం తిరుగుతూనే ఉంటుంది!".

ఇక వర్తమానం లోకి వస్తే......

ఇప్పుడు నాకు ప్రమోషన్ వచ్చి రైల్ నిలయం ట్రాన్స్ ఫర్ అయ్యింది. అనుకోకుండా పాత ఆఫీస్ క్యాషియర్ అప్పల నాయిడు మా ఆఫీసు లిఫ్ట్‌లో కనిపించాడు.

"అప్పలనాయిడు బాగున్నావా ఏమిటి విశేషం?" అని పలకరించాను.

"మేడం మీరు బాగా చిక్కిపోయారు. జుట్టుకూడా బాగా నెరిసిపోయింది!" వొంట్లో బాగా లేదా అని ప్రశ్నించాడు.

"మా సెక్షన్లో కూర్చుని మాట్లాడుకుందాం!" అని జవాబు ఇచ్చాను.

మెల్లగా నడుచుకుంటూ మా సెక్షనకు చేరుకున్నాం.

నేను నా సీట్లో కూర్చుని ఎదురుగా ఉన్న కుర్చీ లాగి అప్పల్నాయిడ్ని కూర్చోమన్నాను.

" మేడం మీకు వొంట్లో ఏదయినా నలతగా ఉందా?" అని అడగడం మొదలుపెట్టాడు అప్పల నాయిడు.

కళ్ళజోడు సర్దుకుంటూ "వయసు పై బడిందిగా, అందుకే అలాగ కనఉబడుతున్నాను. మరేమి లేదు!"

"ఉండు మా ఆఫీసులో మంచి ఫిల్టర్ కాఫీ దొరుకుతుంది తెప్పిస్తాను" అంటూ ప్యూన్‌కు బెల్ కొట్టి పిలిపించెను.

బెల్ శబ్దం విని ప్యూన్ పరుగెత్తుకు వచ్చాడు. రెండు ఫిల్టర్ కాఫీలు తెమ్మని డబ్బులు ఇచ్చాను.

"మీ అబ్బాయి మోహన్ ఎక్కడ ఉన్నాడు?" అని అడగడం మొదలుపెట్టాడు అప్పల నాయిడు.

"వాడు ముంబై ఐ.ఐ.టి లో ఇంజినీరింగ్ చదివి చికాగోలో సెటిల్ అయ్యాడు!" అని జవాబు ఇచ్చాను.

"పోనీలెండి మేడం మీరు పడిన శ్రమకు మంచి ఫలితం దక్కింది!" అని బదులు పలికాడు అప్పల నాయిడు.

కాఫీ రావడంతో బ్యాగునుంచి డయాబిటీస్ బిస్కెట్స్ తీసి అప్పల నాయిడు ముందర ఉంచాను.

"వద్దు మేడం!" అన్నాడు.

"పరవాలేదు రెండు బిస్కెట్లు తీసుకో !"అని బదులు ఇచ్చాను.

బిస్కెట్లు తిని కాఫీ త్రాగి బయల్దేరాడు అప్పల నాయిడు.

♦♦♦

లిఫ్ట్ దగ్గర కాఫీ తెచ్చిన ప్యూన్ కనిపించాడు అప్పల నాయిడుకు.

"ఉన్న ఒక కొడుకు గ్రీన్ కార్డు వచ్చే వరకు అమెరికానుంచి వచ్చే ప్రసక్తే లేదని నిర్మొహమాటంగా చెప్పేసాడు. భర్త పోయి నాలుగు సంవత్సరాల అయ్యింది. ఈమె ఒక్కర్తే ఉంటున్నది లంకంత కొంపలో. ఆఫీసు మూసేసేదాకా మా ప్రాణాలు మీద కూర్చుంటుంది మహా తల్లి !" విసుగ్గా చెప్పడం మొదలుపెట్టాడు.

ఒక్కసారిగా అప్పల నాయిడు మనసు వికలమైపోయింది. ఆమె పరిస్థితి చూసి ఆమె మీద జాలి వేసింది.

"ఏ కొడుకు, భర్త సంసారం గురించి తాపత్రయం పడి ఆఫీసుకు లేటుగా వచ్చేదో, ముందే పరుగులు పెడుతు వెళ్ళేదో,

ఆ ఇంటికి బదులు...

ఆ ఆఫీసే ఇప్పుడు ఆమెకు తోడు నీడ సర్వస్వం అయిపోయింది!"అనుకుంటూ భారీ మనసుతో అప్పల నాయిడు లిఫ్ట్‌లో బయల్దేరాడు.

రాత్రి కావస్తోంది. వెలుగు తున్న దీపం దగ్గరకు అమాయకంగా చేరుతున్నాయి దీపం పురుగులు.ఝుమ్మని రాత్రంతా దీపం చుట్టూ తిరిగే రెక్కల పురుగులు, తెల్లవారే సరికి, కుప్పలుగా రాల వలసిందేగా!! ♦




# అడిగోపుల కవిత్వంపై విశిష్ట విశ్లేషణ

- డా॥ పి.సి. వెంకటేశ్వర్లు
9490164963

*పిడికిలి బిగించి ప్రజలు*
*మ్మడిగా మన యీ వ్యవస్థ మార్చేదాకా*
*పెదబొబ్బ సింహనాదం*
*అడిగోపుల హోరు గాలి ఆగవు సుమ్మీ*

అంటాడు ఆరుద్ర. అడిగోపుల వెంకటరత్నం కవితా దృక్పథాన్ని గురించి, ఆధునిక కవిత్వంలో బలమైన ముద్ర వేస్తున్న అడిగోపులను అభ్యుదయకవిగా విమర్శనా లోకమంతా అంగీకరించింది. ఈయన పదహారణాల ఆధునికకవి. వీరి కవిత్వం అర్థం కాలేదంటే శ్రీశ్రీ చెప్పినట్లు ఆధునిక జీవితమే అర్థంకాలేదని మనం గుర్తించాలి. నాలుగు దశాబ్దాలుగా ఆధునిక కవితా సేద్యం చేస్తున్న అడిగోపుల వారిని ఆయన కవిత్వంలోని ఆధునిక తత్వాన్ని ఆరుద్ర, ఆత్రేయ, మరుపూరి, రావిశాస్త్రి, శేషేంద్ర, భుజంగరాయ శర్మ, భరద్వాజ, నాగభైరవ, రాచపాళెం వంటి ప్రముఖులు ముందుమాటలతో ఆవిష్కరించే ప్రయత్నం చేశారు. రచయిత మెప్పుకోసం కాకుండా కవిత్వంలోని లోతును ఆస్వాదించి పాఠకుల ముందుంచారు. ప్రముఖ విమర్శకుడు, కవి అయిన కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి అడిగోపుల కవితాసారాన్ని, కవి దృక్పథాన్ని ఆసాంతం పరిశీలించి 134 పుటల 'అడిగోపుల అభ్యుదయ కవిత్వం' గ్రంథాన్ని రాశారు.

కవిత్వవిమర్శ రెండు రకాలుగా పుడుతుంది. మొదటిది విమర్శకుడు తనకు తాను రాయాలనుకుని రాసేది కాగా, రెండోది రచయితల కోరికమీద రాసేది. ఈ విమర్శ గ్రంథం మొదటి రకానికి చెందింది. కొండ్రెడ్డివారు అడిగోపుల వెంకటరత్నం కవిత్వాన్ని చదివి, ప్రేరణపొంది ఆయన మొత్తం కవితా సంపుటాలను ఆస్వాదించి, తనభిప్రాయాన్ని విస్పష్టంగా తెలియ జేసిన గ్రంథమిది. ఆధునిక సాహిత్య విమర్శకులకు తొలిపొద్దు కట్టమంచి రామలింగారెడ్డి. ఆ తరువాత రాళ్ళపల్లి, పుట్టపర్తి, గడియారం, వల్లంపాటి, రాచపాళెం వంటి విమర్శకులు ఆ మార్గంలో పయనిస్తూ, విమర్శనా రంగాన్ని పటిష్టం చేశారు. ఆధునిక కవిత్వంపై సి. నారాయణరెడ్డి, వేల్చేరు నారాయణరావు, కడియాల రామ్మోహన్ రాయ్ వంటివారు సాగించిన పరిశోధనలు, భావి పరిశోధకులకు దిశానిర్దేశం చేస్తున్నాయి. అభ్యుదయ, విప్లవ, స్త్రీవాద, దళితవాద కవిత్వాలపై వస్తున్న విమర్శ ఆయా కవిత్వాల్లోని వాడిని, వేడిని విశ్లేషించే ప్రయత్నం చేస్తుంది. 'కవిని నిర్వచించడమే విమర్శకుని పని' అంటాడు రాచపాళెం. అయితే కొండ్రెడ్డి కవిని నిర్వచించడమే కాకుండా ఆయన దృక్పథాన్ని, దాని విరాడ్రూపాన్ని ఈ విమర్శనా గ్రంథంలో సంపూర్ణంగా చూపించాడు. 1984 లో వచ్చిన 'సూర్యోదయం' అనే కవితా సంపుటి నుండి 2019లో వచ్చిన 'పదండి ముందుకు' వరకు మొత్తం కవితా సంపుటాలను నఖశిఖ పర్యంతం పరిశీలించి ఈ గ్రంథంలో పొందుపరిచాడు కొండ్రెడ్డి.

అడిగోపుల వారు రాసిన సూర్యోదయం (1984), ఎన్నాళ్ళీచరిత్ర (1985), జీవన పోరాటం (1986), బానిసత్వం అమ్మబడును (1987), మరణానికి రెండు ముఖాలు (1988), విప్లవానికి పురిటిగది (1990), అశ్రు వీధిలో అగ్నిగానం (1991), యుద్ధమంటే మాకు భయంలేదు (1992), మట్టి మౌనం వహించదు (1994), మహాపథం (1996), రాతిచిగుళ్ళు (1998), అదృశ్యకుడ్యం (2000), సంకెళ్ళు తెగిన చప్పుళ్ళు (2002), శ్వేతపత్రం (2004), విశ్వగీతం (2006), రంగుల చీకటి (2009), రేపటి వర్తమానం (2011), రెక్క విప్పిన రాగం (2013), రేపటి జ్ఞాపకం (2016), ముందడుగు (2017) పదండి ముందుకు (2019) అనే కావ్య సంపుటాలను సంవత్సరాదిక్రమంలో విమర్శిస్తూ సాగిన ఈ రచనలో అడిగోపులవారి కవిత్వాన్ని కొండ్రెడ్డి తమ ధర్మకాటలో డిజిటల్ కొలమానంతో తూచాడు. కవి ఆవేదనను, ఆవేశాన్ని, ఆలోచనను, మార్గాన్ని దిశానిర్దేశాన్ని పొలంలో కొండ్ర వేసినట్లు సూటిగా తెలిపాడు. మార్క్సిస్టు భావజాలాన్ని తారకమంత్రంగా ప్రభోదించిన అలుపెరుగని కవిగా అడిగోపులను మొదటనే పరిచయం చేయడంవల్ల రచయిత ఉద్దేశ్యాన్ని పాఠకులకు స్పష్టపరిచాడు. తనచుట్టూ తాను తిరిగే కవులు కొందరుంటారు. తమ గొప్పను జబ్బలు చరచుకుంటూ ప్రచారం చేసుకునే రచయితలు ఇంకొందరుంటారు. తమ కవిత్వానికి లేని గొప్పతనాన్ని తామే ఆపాదించుకుంటూ ప్రచారంచేసుకునే కవులు మరికొందరు. ఇలాంటివి ఏమీ లేకుండా సాదా సీదాగా జీవితాన్ని కొనసాగిస్తూ, సామాజిక చైతన్యం కోసం కవిత్వం రాస్తున్న అడిగోపుల కవిత్వతత్వాన్ని పరిచయం చేశాడు విమర్శకుడు. ఈ విమర్శనా గ్రంథంలో కవి దార్శనితను, దేగకన్నును, నిబద్ధతను, నిజాయితీని, భౌతికవాదాన్ని, ప్రాపంచిక దృక్పథాన్ని కొండ్రెడ్డి సందర్భానుసారంగా ఉదాహరణలతో నిరూపించాడు. అభ్యుదయం అంటే ఆస్తులకోసం, హక్కుల కోసం పోరాడ్డం కాదు. మంచికోసం మానవీయతకోసం, నడుం కట్టడమూ అభ్యుదయమే. అలాంటి ఆలోచనను రచయిత కొన సాగించిన తీరును విమర్శకుడు విశ్లేషించి చూపించాడు. ఈ గ్రంథానికి రాసిన ముందు మాటలో రాచపాళెం అడిగోపుల వారి కవితాతత్వాన్ని రెండు వాక్యాల్లో చెప్పారు "ఎప్పుడో పండించిన గింజలు, మొలకెత్తని గింజలు, చచ్చుబడిన గింజలు ఇంకా మార్కెట్‌లో ప్రదర్శించుకునే వాళ్ళలాగా అడిగోపుల కవిత్వం ఉండద"ని చెప్పడం వెనుక కవిలోని నిత్యనూతన కవితా వస్తు ప్రదర్శనను వివరిస్తుంది.

కవి హృదయాన్ని, కవిత్వశక్తిని అర్థం చేసుకున్న వాడే సరైన విమర్శకుడు. కొండ్రెడ్డి అభ్యుదయ దృక్పథం గల విమర్శకులు. అందుకే, కవి భావజాలాన్ని ఆయన తార్కిక చింతనను అర్థం చేసుకుంటూ, విమర్శను కొనసాగించాడు. కవికి ఇష్టమైన అట్టడువర్గాల అభ్యున్నతి, శ్రామికవర్గ ఆనందం, స్త్రీ పురుషుల సమానత్వం, పర్యావరణ, రాజకీయ, ఆర్థిక కాలుష్య రాహిత్య సమాజం వంటివి విమర్శకుడికి కూడా ఇష్టమైన వస్తువులు కావడంవల్ల, కవి హృదయాన్ని సరిగ్గా ఆవిష్కరించగలిగాడు. అంతేకాదు, శ్రీశ్రీ, తిలక్, దాశరథి, కుందుర్తి, ఆరుద్ర, సినారె, శేషేంద్ర, శివారెడ్డి, ఎన్. గోపి వంటి దిగ్గంతుల వరసలో అడిగోపులను కూర్చోబెట్టాడు విమర్శకుడు. వారంతా అలుపెరగని కవులుగా అభివర్ణించారు. కవి హృదయాన్ని విప్పి చెప్పే క్రమంలో స్వానుభవాన్ని రంగరించిన కొండ్రెడ్డి, అడిగోపుల కవిత్వంలో సాధించిన ప్రయోజనాలను దాపరికం లేకుండా తెలిపాడు. రచయితల భావ ప్రకటన స్వేచ్ఛను ప్రభుత్వాలు కాలరాస్తున్న నేటి సందర్భంలో, అడిగోపుల వారు సామాజిక రుగ్మతలపై కొరఢా ఝుళిపించిన తీరును, సమాజంలోని అపసవ్య కదలికలను పసిగట్టిన విధానాన్ని, వినీలాకాశంలో అరుణకాంతుల కోసం అంటే వామపక్ష పాలనకోసం ఎదురు చూస్తున్న చూపులను కొండ్రెడ్డి పసిగట్టాడు. అంతేకాదు రచయిత కవితావాక్యాల్లోని భావుకత, తార్కికశైలి కవితావస్తువుకు లోబడి కొనసాగాయని తన విమర్శలో ఉదాహరణ పూర్వకంగా నిరూపించాడు.

అడిగోపుల మొదటి కవితాసంపుటమైన 'సూర్యోదయా'నికి ముందుమాటరాసిన ఆరుద్ర కవిలోని కొత్తచూపును ఆనాడే కనిపెట్టాడని, 'ఆహా' అనేవిధంగా వారి కవితా ఖండికలు ఉన్నాయని మెచ్చుకున్న సందర్భాన్ని కొండ్రెడ్డి గుర్తు చేశాడు. అడిగోపులకు మార్మికంగా కవిత్వం చెప్పేశక్తి ఉన్నప్పటికీ, అందరికీ అర్థం కావాలనే భావనతో సులువైన పదప్రయోగాన్ని ఎంచుకుంటాడని, ఆ పదాలతోనే అభ్యుదయ కాంక్షను వ్యక్తం చేస్తాడని చెప్తూ.

"రాత్రి నాకూ నా కొడుక్కి
పెద్ద పోరాటం

*ఆస్తి పంపకాలు కాదు*
*పంచాయితీ ఎన్నికలు కాదు*
*చలిని తట్టుకోను*
*చాలీచాలని దుప్పట్నీ*
*వాడటు లాగ నేనిటు లాగ"* అని జీవనపోరాటంలోని సంఘర్షణకు అద్దంపట్టే కవితల్ని ఉదహరించి చూపించాడు విమర్శకుడు. స్వతంత్ర భారతదేశానికి డెబ్బైఏళ్ళు వయసు పైబడుతున్నా, కట్టుబట్టలకు కరువైన సంగతిని వ్యంగ్యాత్మకంగా కవి చూపించిన దృశ్యాన్ని విమర్శకుడు పాఠక హృదయాలకు హత్తుకునే విధంగా విశ్లేషించి చూపటం మనం గమనించవచ్చు. అడిగోపులవారు గిరీష్ కర్నాడ్‌లాగా 'అర్బన్ మావోయిస్ట్' అనే బోర్డు మెడలో వేసుకోకపోవచ్చు. ప్రకాష్ రాజ్‌లాగా మీడియా ముందు బాహాటంగా ప్రభుత్వ విధానాల్ని విమర్శించకపోవచ్చు. కానీ ఒక ఇంజనీర్‌గా నాలుగు దశాబ్దాల ముందే 'అన్ని గుండెలు ఎరుపురంగులో వున్నా ఎరుపెక్కేది కొన్ని గుండెలే' అని అన్నాడంటే ఎంతో గుండెధైర్యం కావాలి. కవిలో ఉన్న ఆ గుండె ధైర్యాన్ని విమర్శకుడు ఒడిసిపట్టాడు.

'ఎన్నాళ్ళీ చరిత్ర' కవితా సంపుటికి రాసిన ముందుమాటలో ఆత్రేయ 'వ్యంగ్యమన్న పూదోటలో ముంచి ఊరిన ఇలాంటి కలం పోట్లు ఎన్నో' అనడం వెనుక అడిగోపుల కలం ఎంత పదనుతేలి ఉందో అర్థం చేసుకోవచ్చు. అందుకే సమసమాజ ఆశయంతో రాయబడ్డ ఈ కవితా సంపుటిని గురించి 'సామాజిక బాధల్ని పలువరించి, కలవరించి గాయాల్లోంచి తోడుకున్న అనుభవాల ఆక్రోశాన్ని అక్షరాల్లో బంధిస్తాడు కవి' అంటాడు కొండ్రెడ్డి. అయితే కవి ఆశావాదిగా, విమర్శకుడు వాస్తవిక వాదిగా కనిపిస్తాడు. అందుకే కవి కోరుకునే సమాజం, కవి వేసే ప్రశ్నకు సమాధానం బహుశా ఇప్పట్లో దొరకదేమోనని విమర్శకుడు వ్యక్తం చేసిన అభిప్రాయాన్ని వాస్తవంగా అర్థం చేసుకోవాలి. కవిత్వం ఎలా ఉండాలో మరో కవికి బాగా తెలుస్తుంది. అందుకే కవైన కొండ్రెడ్డి అడిగోపుల రాసిన

*"కయిత్తం రాస్తే....*
*కాకికి అర్థం కావాల*
*కాకిపిల్ల పాడుకోవాలన్నాడు*
*అన్నాడు అప్పిగాడు"* అనే కవితను అమాయకులు కూడా అర్థం చేసుకుంటారని ఉదహరించి చూపాడు. 'జీవన పోరాటం' కవితా సంపుటికి రాసిన ముందుమాటలో మరుపూరు కోదండరామిరెడ్డి అడిగోపుల కవిత్వంలో నేర్పు వేమనబాణీలతో వియ్యమొందుతున్నట్లు ఉందని మెచ్చుకుంటాడు. అలాగే సమాజంలో కనపడీ కనపడనట్లున్న ఆరాటానికి, పోరాటానికి అద్దం పడుతున్న కావ్యంగా జి.యన్.రెడ్డి అభివర్ణించాడు. వస్తువును కవితామయం చేయడంలో అడిగోపుల అందెవేసినచేయి అనీ, ఒక శిల్పం ఎటువైపు వెళ్ళినా మనవైపే చూస్తున్నట్లు కనిపించిన విధంగా, ఆయన కవిత్వం ప్రతి ఒక్కరినీ కనిపెడుతూనే ఉంటుందని వివరించాడు కొండ్రెడ్డి. అందుకు ఉదాహరణగా నేటివ్యవస్థలో పాలకులు మేధోవర్గానికి ఏ విధంగా సమాధులు కడుతున్నారో చెప్పిన కవితను ఉదహరించాడు.

*నేటి వ్యవస్థ*
*మేధావికి*
*రెండు సార్లు*
*సమాధులు కడుతుంది*
*బ్రతికుండగానే*
*ప్రతిభకు*
*చనిపోయాక*
*శవానికి*

బ్రతికున్నప్పుడు అతని బ్రతకుకు అన్యాయం చేసిన వ్యవస్థ, అతను చనిపోయాక మాత్రం న్యాయంగానే సమాధి చేస్తున్న తీరును కవి ఎండగట్టాడని కొండ్రెడ్డి కవితలోని అంతర్యాన్ని విశ్లేషించాడు.

రావిశాస్త్రి అడిగోపుల రాసిన 'బానిసత్వం అమ్మబడును' కవితా సంపుటానికి ముందుమాట రాశాడు. ముప్పైఏళ్ళ కిందట వచ్చిన ఈ కవితాసంపుటిలో రచయితలో కనిపిస్తున్న బహుజన దృక్పథాన్ని విమర్శకుడు సరిగ్గా అంచనా వేశాడు. సమాజంలో గుప్పెడు మనుషులు గూడి జనాన్ని పరిపాలిస్తున్న అన్యాయాన్ని కవి

*"నా పేరు బహువచనం*
*నన్ను స్వారీ చేస్తున్న వాడు ఏకవచనం"* అనే వాక్యాల్లో ఇమిడ్చాడని తెలిపాడు. భౌతికంగా చూసినపుడు ప్రతి మనిషిలో ఉండె గుండె పిడికిలంత ఉంటుంది. అలాగే

బరువు కూడా ఇంచుమించుగా అటోఇటో ఉంటుంది. కానీ ఆ గుండెలోని పరాక్రమం ఆధారంగా మనుషుల్లో చైతన్యం వస్తుంది. కాబట్టి గుండె బరువును బట్టి ఏదీ ఉండదనే తాత్వికతను అడిగోపుల అందించారు.

గుంటూరు శేషేంద్రశర్మ 'మరణానికి రెండుముఖాలు' కావ్యానికి రాసిన ముందు మాటలో భారతీయ భాషల ముందుమాటగా గ్రంథాన్ని అభివర్ణించాడు అలాగే సంజీవ్ దేవ్ కూడా అడిగోపుల కవిత్వం హృదయాన్ని తొలుస్తుందని కితాబిచ్చాడు. ఇలాంటిగొప్పవారు మెచ్చుకున్నందువల్ల ఇదిగొప్ప కవిత్వం కాలేదని, ఆకలిచావును అనారోగ్యపుచావుగా, లాకప్‌హత్యను ఆత్మహత్యగా, మానభంగపు చావును మారణాయుధాల తయారీచావుగా చెప్తున్న సామాజిక వ్యవస్థను ప్రశ్నించినందుకు గొప్పకవిత్వం అయ్యిందని అంటాడు కొండ్రెడ్డి. అంతేకాదు 'నిరుద్యోగికి నెలకు ముప్పై వసంతాలు', 'జీవమున్న విత్తులు మొలకెత్తక పోవడం' వంటి కవితా వాక్యాలు మార్మిక ధోరణిలో ప్రతిభ ఉన్నవాడు ఎదగలేక పోతున్నాడనే వాస్తవాన్ని ధ్వనింపజేస్తున్నాయని వివరించాడు కొండ్రెడ్డి.

'విప్లవానికి పురిటిగది' కవితాసంపుటం గురించి మాట్లాడుతూ తంగిరాల వేంకటసుబ్బారావు 'చీకటి భూమిని బ్రద్దలు కొడుతూ చైతన్య వృక్షమై పైకి లేస్తున్న కవి'గా అడిగోపులను అభివర్ణించాడు. ఆరేళ్ళకాలంలో ఆరవకవితా సంపుటిగా వచ్చిన ఈ రచనలోని కవితాతత్వాన్ని, అభ్యుదయ కాంక్షను కొండ్రెడ్డి చక్కగా అంచనావేశాడు. అభ్యుదయం కోసం ఆకాంక్షించే అడిగోపుల కేకలు వదిలేసి సింహగర్జన చేసే స్థితికి ఎదిగాడని వ్యాఖ్యానించాడు. బూర్జువావ్యవస్థలో బడుగుల పరిస్థితి మర్రిచెట్టు కింద మల్లె తీగ లాగా సాగుతుంది అంటూ

*"మేము మర్రిచెట్టు కింద /మల్లెతీగలా /ఎరగకుండా బతకాలి/ చావకుండా నిలవాలి/ నీడనిచ్చినా పెరగలేదని/ నీతులు మీరు చెప్పుకోవాలి"* అంటూ కవి చెప్పిన వాక్యాలు ఎదగలేకపోయినా, స్వచ్ఛమైన సువాసనలు వెదజల్లే బడుగుల జీవితంతో పాటు, వారిని ఎదగనీయకుండా అణచి వేసే బూర్జువాల అహంకారాన్ని ప్రతిఫలింప చేసిందని అంటాడు విమర్శకుడు. నిరుద్యోగం, నిరాశ వంటి వాటికి మరణం ముగింపు కాదని, పాజిటివ్ థింకింగ్ అలవరచుకోవాలని యువతకు బోధిస్తున్న కవిలోని వ్యక్తిత్వ వికాస భావాన్ని అర్థం చేసుకోవాలని అంటాడు కొండ్రెడ్డి.

'అశ్రువీధిలో అగ్నిగానం' కవితా సంపుటికి తాను చదివిన కళాశాల అధ్యాపకుడు, భావుకుడు అయిన ఎస్.వి. భుజంగరాయశర్మ చేత ముందుమాట రాయించాడు. సమాజాన్ని మార్చడానికి రచయితగా అడిగోపుల తన బాధ్యతను గుర్తించాడని మెచ్చుకున్నారు శర్మగారు. అక్షరాలతో అగ్నిగోళాలను దట్టించగలగడం, అప్యాయతలను మూటగట్టి అందించడం కవిత్వపువేళ్ళను గుండెల్లోకి దింపి శాఖోపశాఖలుగా విస్తరింపజేయటం అడిగోపుల కవిత్వానికున్న గుణాలుగా విమర్శకుడు నిర్ధారించాడు.

*"రిటైరైన నన్ను నువ్వూ/ అమ్మను అన్నయ్యా / పంచుకుంటామంటూ/ నువ్వు రాసిన ఉత్తరం నేడు చేరింది"* అంటూ ఒక ఉత్తరంలోని సందేశాన్ని పాఠకుల గుండెలు పిండేలా కవితగా మలచడం ఈ అభ్యుదయ కవికే సాధ్యమయిందంటాడు కొండ్రెడ్డి. అయితే రచయిత అక్షరాన్ని విచ్చలవిడిగా ప్రయోగించకూడదని, వాటిని అదుపులో పెట్టుకొని అనర్థాలు రాకుండా, అపార్థాలు లేకుండా, అభ్యుదయమార్గంలో ఉపయోగించాలనే కవి ఆశయాన్ని కూడా విమర్శకుడు గుర్తుచేశాడు. స్త్రీ ఆత్మసంరక్షణ విషయంలో అవసరమైతే కత్తిని కూడా అందుకోవాలంటూ

*"పొట్ట నింపుకోడానికి గడప దాటుతున్నావు*
*కొంగు మాటున కత్తి దాచుకోవమ్మా"* అని కఠినమైన సందేశాన్ని కవి ఇచ్చినప్పటికీ అది ఘోరమైన సందేశమేమీకాదని అన్యాయమైన తీర్పులు చెప్పబడుతున్న వ్యవస్థలో ఆమెను జాగ్రత్తగా ఉండమంటున్న కవి ఉద్దేశ్యంలో ఏ మాత్రం తప్పులేదని విమర్శకుడు సమర్థించాడు.

'యుద్ధమంటే మాకు భయం లేదు' కవితా సంపుటికి రాసిన ముందు మాటలో వీరాజి అడిగోపులను పులిలాంటి కవిగా అభివర్ణించాడు. సూర్యుడ్ని తలకింద దాచుకొని, అంతా చీకటి అని వాపోయే మనుషుల్ని తట్టిలేపే కవిత్వాన్ని రాసేకవిగా అడిగోపులను మెచ్చుకున్నాడు. ఆత్మ హత్యలు చేసుకుంటున్న అబలలకు ఆత్మస్థైర్యాన్ని ఇవ్వడం, 'కుట్రను కుట్రతో ఛేదించాలే కాని మరణంతో కాదు' అనే సందేశాన్ని ఇవ్వడం. నేటి యువతరానికి అవసరం అంటాడు విమర్శకుడు. నిలకడలేని మాటతీరును కవి 'నోటినిండా నాలుకలే' అనే పదప్రయోగంతో చూపించడాన్ని కొండ్రెడ్డి

ఎంతో ఆలోచనాత్మకంగా విశ్లేషించాడు.

*నగిషీ చెక్కిన అబద్దాల ముందు/ నమ్మకాల అమ్మకాలకు/ గిరాకీ వుండటం లేదు* అంటూ లోకంలో నిజానికి జరుగుతున్న అవమానాన్ని కవి చెప్పిన తీరును విమర్శకుడు అందిపుచ్చుకుని విశ్లేషించాడు.

"మట్టి మౌనం వహించదు" కవితా సంపుటికి ముందుమాట రాసిన రావూరి భరద్వాజ ఈ కవితా సంపుటాన్ని పెద్ద నిలువుటద్దంగా అభివర్ణించి, అందులో వర్తమాన సమాజమంతా స్పష్టంగా కనబడుతుందని మెచ్చుకున్నాడు. ఈ కవితా సంపుటిలో ఎక్కువ తండ్రి హృదయం ఆవేదన అనుభూతి ఎక్కువగా కనబడుతుందనే విషయాన్ని విమర్శకుడు గుర్తించక పోయినా, అలాంటి కవితలను కొన్నింటిని ఉదహరించాడు.

*కాగితం కలాన్ని నా శ్రమశక్తి /నీకు యిస్తుందిగాని కూర్చోబెట్టి/ చేయిపట్టి రాయించదు* అంటూ కవి చెప్పిన వాక్యాల్లో తండ్రి కొడుక్కి చదువు మీద ద్యాస వుంచమని చెప్పకనే చెబుతున్నట్లు ఉందని కొడుకు బాధ్యతను గుర్తుచేస్తుందని అంటాడు విమర్శకుడు. ఈ సందర్భంలో 'అడిగోపులవారు చూడ్డానికి అమాయకంగా నిశ్శబ్దంగా కనిపిస్తుంటారేగానీ పెన్ను పవర్‌తో ప్రభుత్వాన్ని కదిలించే శక్తి ఉన్న మనిషి అని, అధికారదర్పంతో ప్రవర్తించే వారి గుండెల్లో రైళ్ళు పరిగెత్తించేది ఎలాగో చెప్పే మనిషేనని నేడు కవిత్వాన్ని చదివి అర్థం చేసుకొనే వాళ్ళు పెద్దగా లేకపోవడం వల్ల ఆయనశక్తి చాలా మందికి తెలియటం లేద'ని విమర్శకుడు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు.

'మహాపథం' కవితా సంపుటం దారిద్ర్యం, అవినీతి, అనాచారం, అధికారదాహం వంటి వస్తువులపై దృష్టిపెట్టిందని విమర్శకుడు తెలయజేశాడు. ఈ కవితా సంపుటికి రాసిన ముందుమాటలో నాగభైరవ కోటేశ్వరరావు అడిగోపుల 'కవిత్వంలో విల్లంబు గురి ఉంది. వైవిధ్యపు సిరీ ఉంది. గురి గమ్యం కోసం సిరి రమ్యం కోసం'. అనడంలో కవి కలానికి రెండువైపుల ఉన్న పదునేమిటో అర్థమవుతుంది. ముందు సంపుటాల్లో కత్తితో తిరగమని స్త్రీలకు చెప్పిన అడిగోపుల, ఈ కవిత సంపుటిలో వారిని ఓర్పుగా నేర్పుగా ఓదార్చాదని,

*"చీడ ఎప్పుడూ చిగురుకేనమ్మా / ఎదురు రాయి ఎప్పుడూ నడకకేనమ్మా /తనభారం జనభారం తలకుమించి మోస్తున్న రైలు /ఎప్పుడూ ఆత్మహత్యకు పాల్పడలేదు"*

అంటూ వారిలో ఆత్మస్థైర్యాన్ని నింపాడని విశ్లేషించాడు విమర్శకుడు. అలాగే 'రాతిచిగుళ్ళు' కవితాసంపుటి కవిలో పదునెక్కిన సైద్ధాంతిక దృక్పథాన్ని కవిగా అడిగోపుల ఎదిగన తీరును నిరూపిస్తుంది. కవితాస్పర్శతో రాతి హృదయాల్లో చిగుళ్ళు మొలిపించగల సమర్థత కవికి మాత్రమే ఉందని అడిగోపుల రుజువుచేసిన తీరును విమర్శకుడు వివరించాడు.

*శాస్త్రీయ ప్రణాళికాబద్ధంగా*
*నేలపై నీతి తరమబడింది*
*అస్పృశ్యమై అదృశ్యమైంది*

వంటి వాక్యాల్లో కవి ఆర్ద్రత అర్థమౌతుందని, ఒక వర్గం పేదరికంలోకి నెట్టబడడానికి బ్రహ్మ నుదిటిపై రాసిన రాతగా అభివర్ణించే కర్మసిద్ధాంత వాదుల దుష్టపన్నాగాన్ని నిలదీయాలంటే ప్రతివ్యక్తి సంస్కరించబడాలనే కవి భావనను కొండ్రెడ్డి వివరించాడు.

'అదృశ్యకుడ్యం' కవితా సంపుటికి ముందుమాట రాస్తూ రావెల సాంబశివరావు కవిరాసే వాక్యం, పలికే పదం వినిపించే సందేశం వ్యర్థంగాపోదని, ఒక ఉద్యమంగామారి జనపదాలను కూడగడుతుందనే ఆశాభావం వ్యక్తం చేశాడు. కవిలోని నిబద్ధత, మొండితనం, వట్టుదల ఎలా న్నాయో

*ముడి లోహం కరిగేదాకా /జీవం తొడిగి నడిచే దాకా / ఉద్యమించి సాధించే దాకా /నే రాస్తూనే వుంటాను*

వంటి వాక్యాలు వెల్లడిస్తాయని, ప్రపంచీకరణ ప్రభావాన్ని తెలియ జేయడానికే ఇలాంటి శీర్షికను కవితా సంపుటానికి ఎంపిక చేసుకున్నాడనే విషయాన్ని విమర్శకుడు తెలిపాడు.

రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి ముందుమాటతో వెలువడిన 'సంకెళ్ళు తెగిన చప్పుళ్ళు" సంపుటి పూర్తిగా స్వేచ్ఛకోసం కవిపడిన ఆరాటంగా అర్థంచేసుకోవాలి. మరణంలేని కిరణంగా కవితను కవి అభివర్ణించడం వెనుక

*"ఒక కలం నటించిన కాటి సీనుకు /రంగస్థలం కన్నీటి ఉప్పెనౌతుంది"* వంటి వాక్యాల గాఢతను అర్థం చేసుకోవాలంటాడు విమర్శకుడు. అలాగే 'శ్వేతపత్రం' కవితా సంపుటిలోని అన్ని ఖండికలు సమాజానికి శ్వేతపత్రంగా భావించాలంటాడు కొండ్రెడ్డి.

*"చినుకు రాలింది / బీజం మొలకెత్తింది / ప్రపంచీకరణ*

/చుట్టు ముట్టింది" వంటి కవితా వాక్యాలు క్లుప్తంగా ఉన్నా, పొలంలోని పంటను దోపిడీ చేయడానికి వచ్చేస్తున్న వ్యాపారదళారీలను ప్రపంచీకరణలో పుట్టుకొచ్చిన విషపురుగులుగా కవి భావించడం ఆయనలోని ప్రాపంచిక దృక్పథానికి నిదర్శనం అంటాడు విమర్శకుడు. శ్రీశ్రీ చూపిన భిక్షువర్షీయసీ అలా కావడానికి కారణం సమాజమే. అలాగే అడిగోపుల రాసిన 'ఉమ్మడినేరం'లో మానసిక రోగిగా దర్శనమిచ్చే ఆమె పిచ్చిది కావడానికి పరోక్షకారణం ఉమ్మడినేరమేనంటాడు అడిగోపుల. ఆమె అలా కావడానికి కవి చూపిన కారణాలను అభ్యుదయ విమర్శకుడిగా కొంగ్రెడ్డి సమర్థించాడు. మంచికోసం నడుం బిగించకుండా స్తబ్ధంగా ఉండిపోయిన సమాజాన్ని విమర్శకుడు కూడా తప్పుబట్టాడు.

'విశ్వగీతం' కవితా సంపుటిలో రైతు జీవితాన్ని, మారుతున్న అమ్మతత్వాన్ని కవి గమనించి వాటిపై స్పందించాడు. అందుకే ఆయన జాతీయకవిస్థాయికి ఎదిగాడని అంటాడు కొంగ్రెడ్డి. ఆడపిల్లలు పుట్టారని అమ్మలు కూడా నిర్దాక్షిణ్యంగా పసిగుడ్డును చిదిమేస్తున్న సందర్భాలను కవిగుర్తుచేయడం విమర్శకుడు కూడా అలాంటి వాస్తవాలను ధృవీకరించడం వాస్తవిక విమర్శగా అర్థం చేసుకోవాలి. అలాగే 'రంగులచీకటి' కవితా సంపుటి రచయితలోని దృష్టి తీక్షణతను, నిశితత్వాన్ని తెలియజేస్తుందని శీర్షికపెట్టడంలోనే ఆ ధోరణి అర్థమవుతుందని అంటాడు విమర్శకుడు. ప్రపంచీకరణ నేపథ్యంలో తెరవెనుక విస్తరిల్లుతున్న రంగులచిత్రాలను రచయిత పసిగట్టాడని, స్త్రీని అంగట్లో సరుకుగా చేసి అమ్మకాలు ప్రోత్సహించడాన్ని, చిల్లర డబ్బులకోసం యాచించే బాలుడిని అప్పులకోసం ప్రపంచబ్యాంకు ముందు నిలుచున్న వర్ధమాన దేశాలుగా అభివర్ణించడం వంటివి రచయిత విమర్శనాత్మకత దృష్టిని కనబరిచాడని అంటాడు విమర్శకుడు.

'రేపటివర్తమానం' కవి ఆశయాన్ని సూచించే శీర్షిక. నాలుగ్గోడల మధ్యకూర్చునే కల్పనలతో కవిత్వం రాసే కవుల కోవలోకి అడిగోపుల రాడని, ఎన్నోప్రాంతాలు తిరిగి పరిశీలనజ్ఞానంతో సమాజంలో యింకిపోతున్న విలువలను అధ్యయనం చేస్తూ, పొంగులెత్తే ఆలోచనలతో కవితలు రాస్తున్నాడని

**ప్రపంచం కలయ తిరిగాను**
**అన్ని బాధలు ఒకటి కాదు**
**అన్ని దిగుళ్ళు ఒకటి కాదు**
**అన్ని కన్నీళ్లు ఒకటి కాదు**

అంటూ కవి పలికిన వాక్యాలే నిదర్శనమని తెలిపాడు కొంగ్రెడ్డి. ఈ తిరిగే క్రమంలో చేతికి అందని పంటతో బ్రతుకు భారమై నడుస్తున్న వ్యధార్థజీవులను, వయసు పండడంతో వృద్ధాప్యంలో ఊతంకోసం ఎదురు చూస్తున్న పెద్దవారిని ఓదార్చుతూ,

**వృద్ధాప్యం అనుభవాల ఊరబావి**
**సందేశాల సంపుటి**
**ప్రస్థానాల మార్గదర్శి**
**పద్మవ్యూహాల దిక్సూచి**

అంటూ కవి వారిలో ఆత్మస్థైర్యాన్ని నింపుతున్న తీరును విమర్శకుడు గుర్తించారు. నిరాశతో బ్రతకడం అడిగోపుల కవిత్వానికి అలవాటు లేదనేది ఈ కవితాసంపుటాన్ని చూస్తే అర్థమవుతుంది.

'రెక్కవిప్పిన రాగం' కవితా సంపుటినిండా మానవీయభావనల హోరుగాలి, చిరుగాలి, ఆర్తి, ఆర్ద్రత ఉన్నాయని అంటాడు ముందుమాటరాసిన విహారి. సమాజంలో నిజమైన దృశ్యం అదృశ్యమైపోతూ, అరాచకం హెచ్చుమీరి అవినీతి కట్టలు తెంచుకుంటున్న దృశ్యాలను కవి ఈ సుదీర్ఘ కవితాసంపుటిలో అనేక చోట్ల ప్రస్తావించాడని అంటాడు విమర్శకుడు. పాశ్చాత్యభాష ఎంతచుట్టుముట్టినా, తాను తెలుగును శ్వాసిస్తానని, హరికథల్లో మునిగి తేలుతానని, కూచిపూడి దర్శిస్తానని అంటూ కవి మాతృభాషపైన వ్యక్తం చేసిన ప్రేమను ఎవరైనా శభాష్ అనాల్సిందేనని అంటాడు విమర్శకుడు. 'రేపటి జ్ఞాపకం' కవితా సంపుటి నూతలపాటి గంగాధరం పురస్కారాన్ని పొందింది. భౌతికవాద తత్వంతో అనేక కవితలు సాగాయి. దేవుడు ఎక్కడోలేడు. కవిలో, చిత్రకారుడిలో, గాయకుడిలో ఉంటాడు అంటూ కవి చేసిన ప్రతిపాదనలు మనిషిలోని గొప్పతనాన్ని తెలుసుకోమని ప్రోత్సహిస్తాయని వివరణ ఇచ్చాడు విమర్శకుడు. కొన్ని గ్రామాల్లో అంటరానితనం నేటికి దళితుల్ని వెంబడిస్తూ స్మశానాలకు శవాల్ని అనుమతించని జ్ఞాపకాలను ఇకనైన లేకుండా చేయమని మానవత్వమున్న ప్రతిమనిషిని రచయిత కోరుకున్నాడనే విషయాన్ని విమర్శకుడు గుర్తుచేశాడు.

'ముందడుగు' కవితా సంపుటానికి ముందుమాట రాసిన

మేడిపల్లి రవికుమార్ 'అల్యూజన్' పద్ధతిని కవిత్వంలో వాడుకున్న తెలుగుకవిగా రచయితను గుర్తించాడు. 'అంతంలేని దారుల్లో అనంతం నా నడక' అంటూ కవిగా ముందుకు సాగుతున్న అడిగోపుల కవితా పయనం ప్రతీకాత్మక ధోరణిలో సాగుతుందని అంటాడు కొం(డెడ్డి.

***"ఆ నేల చిరునామా కరువు /ఆ ఊరి ఆనవాలు వలస"*** అంటూ వలసపోయినవాళ్ళు ఎప్పుడొస్తారో తెలియక ఎదురు చూస్తున్న ముసలి వాళ్ళను అడిగోపుల చూడగలడని విమర్శకుడు గుర్తించాడు. పురాణప్రతీకలను చారిత్రక పదాలను 'మిథోపోయి'లో భాగంగా రచయిత చక్కగా ఇమిడ్చాడని గుర్తించాడ

***మనిషి కవి అయితే /వస్తువు పద్యమౌతుంది /కవి శిల్పి అయితే /పద్యం శిల్పమౌతుంది***

వంటి కవితలు శిల్పమర్మాలను తెలిసిన కవిగా అడిగోపుల మాత్రమే రాయగలడని గుర్తుచేశాడు విమర్శకుడు. అభివృద్ధి చెందిన ప్రపంచం, అభివృద్ధి చెందుతున్న ప్రపంచం అని మన నాయకులు చెబుతుంటే కవిమాత్రం నిద్రించే ప్రపంచం, నిద్రలేని ప్రపంచం, మేల్కొన్న ప్రపంచం అనే మూడురకాల ప్రపంచాలని చూస్తాడని, అభ్యుదయభావం గల రచయితలకు మాత్రమే ఇలాంటి దృష్టి ఉంటుందని అంటాడు విమర్శకుడు.

ఇప్పటి వరకు వచ్చిన వాటిలో చివరిదైన 'పదండి ముందుకు' కవితా సంపుటిని గురించి రాస్తూ నిజమైన బాధ, నిజాయితి, నిష్కల్మషం కవిత్వానికి ముడి సరకులుగా తీసుకుంటూ, వస్తువును రసరమ్యంగా బొమ్మకట్టిస్తూ, పాఠకుణ్ణి ముందుంచుతున్న మణిదీపం లాంటి కవిగా అడిగోపులను ఆకాశనికెత్తాడు విమర్శకుడు. రానురాను అడిగోపుల కవిత్వంలో ప్రతిపదం ఎన్నెన్నో అర్థాలను శోధిస్తూ ముందుకు సాగుతుందని, మాటపైన, రాతపైన, తినే తిండిపైన కెమెరాలుపెట్టి, స్వేచ్ఛను హరించే ప్రయత్నం చేస్తున్న పాలకుల తత్వాన్ని రచయిత విమర్శిస్తున్న తీరు

***కంచంలోకి కెమెరాలుపెట్టి /పత్తేదారులై గమనిస్తున్నారు***

వంటి వాక్యాల్లో తెలియజేశాడని విమర్శకుడు వివరించాడు. అడిగోపుల కవిత్వంలోని భావోద్వేగాల ప్రకంపనల తాకిడికి హృదయం చలించి కన్నీరు కారుస్తుందని

***కన్నీరు మనుషులకే కాదు /జంతువులకూ వుంది / ఒకటి మాట్లాడుతుంది /ఒకటి మాట్లాడదు***

వంటి ఖండికల నేపథ్యాన్ని అర్థం చేసుకోవాలని కొం(డెడ్డి అంటాడు.

కె.ఆర్.కె. మోహన్ 'శ్వేతపత్రం' కవితా సంపుటికి రాసిన ముందుమాటలో చెప్పినట్లు అడిగోపుల ప్రతి కవితాసమస్యను కొత్తకోణంలో చూపిస్తుంది. అలాగే కొత్త రచనాశిల్పంతో సాగుతుంది. కవిగా అడిగోపుల వారు వస్తువును గుర్తించడంలోను, పదాన్ని ప్రయోగించడంలోను ఎంతగంభీరంగా మారిపోయాడో, విమర్శకుడిగా కొం(డెడ్డి వెంకటేశ్వరరెడ్డి శైలి కూడా రాటుదేలింది. తొలికవితా సంపుటిని విశ్లేషించినదానికి, మలికవితా సంపుటిని విశ్లేషించినతీరుకు ఎంతో వ్యత్యాసముంది. ముందుగా కవి చెప్పిన భావాన్నే వ్యాఖ్యానిస్తూ సాగిన ఈ విమర్శ చివరికొచ్చేసరికి కవి భావాలతో ఏకీభవించింది. కవి చేసిన ప్రతిపాదనలకు విమర్శకుడు తన మద్దతు ప్రకటించాడు. ఆయన సాగించిన సమసమాజపు బాటలో అందరూ పయనిస్తే బాగుంటుందని ప్రతిపాదన చేశాడు. కవి వామపక్ష భావాలు గల ప్రాంతంలో పుట్టిపెరిగి విద్యాభ్యాసం చేయడం వల్ల కవికి నిర్దిష్ట దృక్పథం ఏర్పడినట్లు అర్థమౌతుంది. అలాగే విమర్శకుడు కూడా చైతన్యం కలిగిన ప్రాంతంనుండే వచ్చినవాడు కావడం వల్ల రచయిత ఆలోచనలతో ఏకీభవించాడు. వ్యవసాయం, కవిత్వం రెండూ ఈ రోజు వ్యసనాలుగా మారిపోయిన సందర్భం. లాభాపేక్ష లేకుండా రైతు, రచయిత తమకృషిని చేస్తూనే ఉన్నారు. అలాంటి నిరంతర కవితా కృషీవలుడిగా అడిగోపుల చేస్తున్న కవిత్వపు వ్యవసాయానికి విమర్శ అనే నాగలితో కొండ్ర వేసి కవికష్టాన్ని ప్రతిఫలింపచేశాడు విమర్శకుడు. శ్రీశ్రీ కవిత్వాన్ని తూచేరాళ్ళు తనవద్దలేవని చలం చెప్పాడు కానీ, అడిగోపుల వారి కవిత్వాన్ని కొం(డెడ్డి వెంకటేశ్వరరెడ్డి మాత్రం సరైన తూకంరాళ్ళతో తూచాడు. కవిత్వాన్ని చదివేవారు తక్కువై పోయినా, విమర్శను చదివే వారు ఇంకా ఇంకా తగ్గిపోతున్నా, చదివిన వారికి మాత్రం ఈ విమర్శనాగ్రంథం చక్కటి దిశా నిర్దేశం చేస్తుంది. విమర్శ ఎలా ఉండాలో, కవిని ఎలా అర్థం చేసుకోవాలో, కవితా తత్వాన్ని ఎలా వివరించాలో సంపూర్ణ అవగాహన కలుగుతుంది. ♦

## నివాళి

# వాసా ప్రభావతి కన్నుమూత



ప్రముఖ రచయిత్రి, లేఖినీ సాహితీ సంస్థ నిర్వాహకురాలు వాసా ప్రభావతి(81) డిసెంబర్ 18న హైదరాబాద్‌లో అంతిమశ్వాస విడిచారు. ఆమెకు కుమార్తెలు మీనాక్షి, లక్ష్మి, మాధవి, కుమారుడు సూర్యప్రకాశ్ ఉన్నారు. ప్రభావతి స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా ఆత్రేయపురం. 'ఆంధ్రసాహిత్యంలో హరిశ్చంద్రోపాఖ్యానం' అనే అంశంపై 1978లో పీహెచ్‌డీ పొందారు. సరోజినీనాయుడు వనితా మహావిద్యాలయ తెలుగు శాఖలో లెక్చరర్‌గా, రీడర్‌గా సేవలందించారు. వాసా ప్రభావతి కథ, కవిత, నవల, నాటకం, గేయం, యాత్రారచన వంటి పలు సాహిత్య ప్రక్రియల్లో నలభైకిపైగా పుస్తకాలు రచించారు. స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా ఆమె రాసిన 'స్వాతంత్ర్యోద్యమంలో మహిళల పాత్ర' రచన ప్రత్యేక గుర్తింపు తెచ్చిపెట్టింది. దువ్వూరి సుబ్బమ్మ జీవితాధారంగా రూపొందించిన 'దేశబాంధవి' నాటకానికి విశేష ఆదరణ లభించింది. 50కిపైగా ఏకాంకికలు, లలితగేయాలు రచించారు. రచయిత్రులు, కవయిత్రులను ప్రోత్సహించాలనే లక్ష్యంతో 'లేఖినీ సాహితీసంస్థ'ను స్థాపించి సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఆమె పదేళ్లు సెన్సార్‌బోర్డు సభ్యురాలిగానూ ఉన్నారు. ప్రభావతి సాహిత్య సేవకు గుర్తింపుగా సుశీలా–నారాయణ రెడ్డి అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయిత్రి పురస్కారం, గృహలక్ష్మి స్వర్ణ కంకణం వంటి పలు అవార్డులు వరించాయి. ◆

---

## కవిత

# శాపగ్రస్తులు

- శ్రీలక్ష్మి చివుకుల
9441957325

నీ భాషను చంపితే
నిన్ను చంపినట్టు కాదా?
అలా మిన్నకుంటావేమి?

అంటుకున్నది నీ ఇల్లే
ఎవరో వచ్చి మంటలను
ఆర్పుతారని చూస్తావేంటి?

నిలువునా దగ్ధం అవుతున్నాయి
నీ ప్రాణపదమైన
సంగీత సాహిత్య సరస్వతులు

పదవుల ఎరతో
పెద్దల నోర్లు మూతపడ్డాయి
ఏ బి సి డి లతో పిల్లల గొంతులు
రంపపు కోత కోస్తున్నారు

నిన్ను నువ్వు రక్షించుకో
ప్రయత్నించు
ఎవరైనా సాయపడతారు



లేకుంటే వినోదం చూస్తారు

ఎవరో వస్తారని
సాయం చేస్తారని
దిక్కులు చూడకు

శాపగ్రస్తుడైన శిలలా
పడి ఉండకు

రేపటితరం నిన్ను చూసి
ఛీ! కొట్టక ముందే
లేచి నిలబడు

దేహంలో సలసల మరుగుతున్న
రక్తం సాక్షిగా చెపుతున్నా!

ఉద్యమించు
తెలుగు కోసము
నినదించు భాష కోసము
మహాయజ్ఞం కోసం

దేహముంది ప్రాణముంది
నెత్తురుంది సత్తువుంది
ఇంతకన్నా సైన్యం కావాలా?

హీనంగా దేబిరించకు ఎవరినీ
ధైర్యంగా ఎలుగెత్తి కేకవేయి
నడచి పోదాం
నియంతల పీకలమీంచి ◆



# ప్రయోగాలకు పట్టం కట్టిన పఠాభి

- శిఖామణి
9848202526

పఠాభి కవిత తెలుగు కవితారంగాన్ని సుమారు మూడు దశాబ్దాలుగా ఏకచత్రాధిపత్యంగా ఏలిన భావకవిత్వం గతాను గతికమై, క్రమంగా ప్రవాహగతిని కోల్పోయి, నిలువ నీటికాసారంగా మిగిలిపోయిన రోజుల్లో, కవిత్వంలో కొత్తదారులు అన్వేషించిన వారిలో పఠాభి ముఖ్యులు. జీవితంలోనూ, కవిత్వంలోనూ తిరుగుబాటును ప్రదర్శించిన కవి పఠాభి. సమకాలంలోనూ, కాలంకంటే ముందువున్న కవి. తెలుగు కవిత్వం ఆధునికత దశలోకి ప్రవేశించక మునుపే అత్యాధునికతను ప్రదర్శించిన కవి. "నా వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాను' అని భీషణ ప్రతిజ్ఞ చేసిన కవి. అచ్చయిన తన తొలి కావ్యం "ఫిడేలు రాగాల డజన్". అంతకు ముందు కవితారంగంలో వేళ్ళూనికొని వున్న సమస్త సంప్రదాయాలను ధ్వంసం చేసింది. తర్వాతి కాలంలో వచన కవితాప్రక్రియ వ్యాప్తికి దారులు సుగమం చేసింది. ఫిడేలు రాగాల డజన్ (1939), కవిత్వంలో ప్రయోగ ప్రియత్వానికీ, నీలగిరి నీలిమలు (1950), కయిత నా దయిత (1978), భాష మీద ప్రభుతకు, ఛందో వైవిధ్యానికి, పఠాభి పంచాంగం(1980) అధిక్షేపానికీ, చమత్కార ప్రియత్వానికి నిదర్శనాలు.

తెలుగులో భారీ బడ్జెట్ సినిమాలు తీసి నష్టపోయిన పఠాభి, కన్నడంలో సంస్కార, చండమారుత, శృంగారమాస వంటి విజయవంతమైన చిత్రాల దర్శకుడు. గణితంలో ఆసక్తివున్న పఠాభి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన గణిత సమస్య 'ఫెర్మాట్ నంబర్ థియరీ'లో కొంత కృషి చేసారు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాలతో పాటు, షెల్లీ, కీట్సు, విట్మన్, వైల్డ్, ఠాగూర్, చలం, శ్రీశ్రీ రచనలు పఠాభిని ప్రభావితం చేసిన అంశాలు. తొలినాళ్లలో భావకవిత్వం ప్రభావంతో యవ్వన స్వప్నము, ఆవేదన, వంటి ఖండకావ్య సంపుటాలు రాసినా అముద్రితంగానే వుండి పోయాయి.

అందాల హరివిల్లు లాంటి శాంతినికేతనం జీవితం నుండి, యూనివర్శిటీ చదువు కోసం కలకత్తా, చిత్‌పూర్ రోడ్డులోని ఇరుకు గదుల నివాసం, అక్కడి నగర జీవితం ఉక్కిరి బిక్కిరి చేసింది. కలకత్తాలో తాను అనుభవించిన యాంత్రిక జీవనాన్ని తర్వాత మద్రాసు నగరానికి అన్వయించి 'రాగాల డజన్' రాసారు. తెలుగులో వచ్చిన మొట్టమొదటి వచన కవితా సంపుటిగా, నగర కావ్యంగా, ఫిడేలు రాగాల

డజన్ చరిత్రలో నిలిచిపోయింది. అయితే సమకాలంలో చలం, శ్రీశ్రీ, ఆరుద్ర వంటి ఒకరిద్దరు తప్ప ఆ కావ్యాన్ని ఆహ్వానించలేకపోయారు, ఆస్వాదించలేకపోయారు. దిగంబరులకంటే ముందు, అంతకంటే ఎక్కువ స్థాయిలో దాడిని ఎదుర్కొన్న కావ్య సంపుటి ఫిడేలు రాగాల డజన్. వెల్చేరు నారాయణరావు తన 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' గ్రంథంలో పఠాభి అలా ఎందుకు రాయాల్సి వచ్చిందో విశ్లేషణ చేసే వరకు దాని మీది నీలినీడలు తొలగిపోలేదు. దీనిలోని 'ఆత్మకథ' ఖండిక మొత్తం పఠాభి కవిత్వానికి మేనిఫెస్టో వంటిది.

శ్రీశ్రీ సూచనలతో తన ప్రణయ కవిత్వం అచ్చు వేయడం మానుకున్నాడు. కానీ, 'వచన పద్యాల దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాను' అన్నాడు. కానీ, చిన్నప్పటి నుండి తాను అభిమానించి, గొప్ప అభినివేశం సంపాదించుకున్న సంప్రదాయ మాత్రాఛందస్సులపై మోజును మాత్రం ఒదులుకోలేకపోయాడు. నిజానికి 1939లోనే ఫిడేలు రాగాల డజన్ వంటి అత్యాధునిక ప్రయోగశాల వంటి వచన కవితా సంపుటి వెలువరించాక, 1977లో ప్రాచీనభాష, వస్తువు, ఛందస్సులను ఆశ్రయించి కొనసాగిన 'కయిత నాదయిత' ను మరొక కవి అయితే వెలువరించి వుండక పోవును. నేను గతంలో పఠాభిని చేసిన ఇంటర్వ్యూలో వచన కవితలు, మాత్రా ఛందస్సు, పన్‌చాంగం ఈ మూడు ప్రక్రియలను తాను ఏక కాలంలో ప్రారంభించి, వివిధ దశలలో కొనసాగించానని స్వయంగా చెప్పుకున్నాడు. ఇది ఒక రకంగా భావజాల పరంగా వైరుధ్యం అనే చెప్పుకోవాలి. 'చివరి ప్రాసలనాబి/ చిత్రమైన పఠాభి/ కావ్య సుధల షరాబి/ ఓ కూనలమ్మ' అని ఆరుద్ర కితాబు యిచ్చినా, కయిత నా దయిత కు రాసిన ముందు మాటలో ఆ కావ్యానికున్న పరిమితులను 'సత్కవులందరిలో కనిపించే సద్భావనలన్నీ ఈ సంపుటిలో అక్కడక్కడా కనబడతాయి. సంవిధానపు లతాగుల్మాలలో ఆ కుసుమాలు మరుగున పడతాయి' అని ఆరుద్ర సరిగ్గానే అంచనా వేసారు.

ఇక పఠాభి మూడో గ్రంథం పఠాభి పన్‌చాంగం, వ్యంగ్యపు వజ్రతునకలు. ఫిడేలు రాగాల డజన్ వంటి అధిక్షేప వచనకవితా సంపుటి, ఛందస్సును మైనపు ముద్దలా మలచిన కయిత నాదయిత గేయసంపుటి వంటి రచనలు చేసిన పఠాభి తనలో సహజ సిద్ధంగా వున్న హాస్యచతురత, సెన్స్ ఆఫ్ హ్యూమర్లు, వ్యంగ్య వైభవాన్ని మేళవించి పన్ చాంగం రచించారు. ఇంగ్లీషులో వున్న పన్‌ను, తెలుగు పంచాంగం ను మేళవించి, 'పన్ చాంగం' అనే కొత్త పదబంధాన్ని సృష్టించి పన్‌లను రాసారు. వేసినా, తీసినా బాధ కలిగించునవి పన్నులు – అని పన్ను మీద పఠాభి చెప్పిన పన్ విని నవ్వనివారుండరు. అందుకే ఆరుద్ర పన్నులలో సంపన్నుడు పఠాభి అని చమత్కరించాడు. పఠాభి పన్‌చాంగంలోని పసిడి పలుకుల విటమిన్- బి గుళికలను రోజుకొకటి చొప్పున సేవిస్తే తెలుగు వాడి మనస్సుకి ఆరోగ్యము, ఉల్లాసము సిద్ధిస్తాయని నేను గ్యారంటీగా చెప్పగలను అని శ్రీశ్రీ అన్నాడంటే ఈ పన్ ఎంత శక్తివంతమైనవో అర్థం చేసుకోవచ్చు.

వచన కవితను చేపట్టినా, మాత్రాఛందస్సులలో గేయాలు నడిపించినా, చిన్ని చిన్ని మాటల విరుపులో పెద్ద అర్థాలు స్ఫురింపజేసినా అన్నిటా పఠాభి ప్రయోగాలకు పట్టంకట్టిన కవి. ఆధునికులలో అత్యాధునిక కవి. అయితే పఠాభి రచనల్లో వస్తురూపంగా 'ఫిడేలు రాగాల డజన్' మాగ్నమ్ ఓపస్ అని చెప్పక తప్పదు. 2018 ఫిబ్రవరి 19న పఠాభి శతజయంతి సంవత్సరం ప్రారంభం అయింది. శతజయంతి ప్రారంభ సదస్సును యానంలో తెలుగుశాఖ, గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీ, కవిసంధ్య సంయుక్త నిర్వహణలో ఆంధ్రప్రదేశ్ భాషా, సాంస్కృతిక శాఖ సౌజన్యంతో నిర్వహించటం జరిగింది. ఈ సదస్సు ప్రసంగ పత్రాలు కొన్ని ఈ ప్రత్యేక సంచికలో ముద్రించటం జరిగింది. పఠాభి అమృతోత్సవ సమితి గతంలో ముద్రించిన పఠాభి రచనల త్రిపుటిని శతజయంతి సందర్భంగా ఆర్ట్స్ అండ్ లెటర్స్ ప్రచురణ సంస్థ పునర్ముద్రించటం సంతోషదాయకం. తెలుగు కవులు, రచయితల సాహిత్య సర్వస్వాలను వెలువరిస్తున్న మనసు ఫౌండేషన్, బెంగళూరు వారు పఠాభి రచనల సర్వస్వాన్ని ముద్రించటం అభినందనీయం. శతజయంతి సందర్భంగా పఠాభి కవిత్వంపై మరోసారి వెలుగు ప్రసరించటం ఆధునిక కవిత్వంలో పఠాభి ప్రాసంగికతకు గుర్తింపుగా భావిద్దాం.

**(పఠాభి సాహిత్యం – జీవితం – శతవసంతాలు (1919 – 2019), సంపాదకుడు: డా౹౹ శిఖామణి- పుస్తకం ముందుమాట)** ◆

# సమరం

- గోపగాని రవీందర్
9440979882




దారులనిండా హారతులతో స్వాగతం
పాలకులు నడిచే మార్గమది
ఎక్కడ ఆటంకం కల్గద్దు

నిత్యం సతమతమయ్యే వాళ్ళకు
చోటుండదక్కడికి
రోడ్డు మీద నడవటానికి సైతం
అనుమతి దొరకదు
అవసరమైతే బారికేడ్లు, ముళ్ళకంచెలతో
పహరా ఉంటుంది
బాష్పవాయువు గోళాలు
సిద్ధంగా ఉంటాయి
గొంతెత్తి నినాదాలు వద్దు
పాలకుల శాంతికి భంగం కలుగుద్ది

మా పాలన అద్భుతం
గిట్టని ప్రతిపక్షాలే
అశాంతికి పూనుకుంటాయి
వాళ్ళతోటే ఇబ్బందులు
ప్రజలు సుఖంగానే ఉన్నారు
పెద్ద అక్షరాల్లో పతాక శీర్షికల్లో వార్తలు
అవార్డుల మీద అవార్డులు వస్తాయి

పంటకు గిట్టుబాటు ధర గూర్చి అడగొద్దు
నిర్ణయాలు చక్కగా చేసినమంటారు
అమ్మటానికి పోతే
దిగులు ముఖాలతో రైతులుంటారు
న్యాయం కోసం తపిస్తారు
దగా జరిగిందని ఆవేదనలొద్దు
పాలకులు మీ శ్రేయస్సును
చూస్తారంటారు
మీ ఆత్మహత్యలు
అత్యంత మామూలు విషయం

మా మాటలు వినని వాళ్ళతో
చర్చలు జరగవనంటారు
ఆఖరి క్షణాల దాక ఉత్కంఠ తప్పదు
సడక్ మీది ఆర్తనాదాలు
వినపడని రాజుల సౌదాలవి

వైభవంగా ఉత్సవాలుంటాయి
ఊరేగింపులుంటాయి
ఉపన్యాసాలుంటాయి
వాగ్దానాలుంటాయి
వీటిముందు మీ సమస్యలేపాటి?

వినతులు విజ్ఞత్తులు తప్ప
ప్రశ్నలు వద్దు
ప్రజాస్వామ్యంలో ఉన్నం కదా!
అడుక్కోవడం కాదు
అడుగుతారు ప్రజలని
ఎన్నడు తెలుసుకొంటారో పాలకులు
అప్పటి దాకా తప్పవు
సమ్మెలు... సమరాలు...! ♦

---

# నానీలు

- కె. ఎల్. సత్యవతి
9440210103



పసిపాప
గుక్క పెట్టింది
భవిష్యత్తు
భయపెట్టినట్లుంది

మంచిపనికి
ముడిసరుకు మానవత్వం
పదుగురికి అందాలి
దాని ప్రతిఫలం

రెక్కలు చచ్చుబడితే
డొక్కలకు విశ్రాంతి
వద్దన లేక
బ్రతుకు విస్తరి ఖాళీ

అమ్మ చేతి గోరుముద్ద
బలవర్థకం
నాన్న చెప్పే మంచిమాట
రాదారి దీపం

పండుటాకు
రాలిపోయింది
పైవాడి నుండి
పిలుపు వచ్చినట్లుంది

ఆమె లేని అతడు
మౌన సముద్రం
అతడు లేని ఆమె
కన్నీటి జలపాతం ♦



# మేనత్త

- యం.ఆర్. అరుణకుమారి
8121523835

'అనూ

ఎలా ఉన్నావూ? ఇంట్లో అందరూ బాగున్నారా? ఈ మధ్యేమన్నా మనూరికి వెళ్ళొచ్చావా? అమ్మా! నాన్న బాగున్నారా? ఆరోగ్య సమస్యలే ఏమీ లేవు కదా కొత్తగా! అమ్మా మోకాళ్ళ నొప్పులు సరే... నాన్న బి.పి., షుగరూ కంట్రోల్లోనే ఉన్నాయి కదా!

అనూ! ఈ మధ్య నాలుగైదు రోజులుగా నా మనసేమీ బాగుండలేదు. ఎందుకో.. ఉత్తుత్తినే.. కారణమేమీ లేదసలు. కానీ ఒకటే దిగులుగా... బాధగా అన్పిస్తోంది. నిద్ర రాదు. అన్నం దిగదు. అసలు ఏ పనీ చెయ్యబుద్ధి కాదు.

ఎందుకో తెలీటం లేదుగానీ... శంకరమ్మత్త ఎక్కువగా గుర్తొస్తోంది... నాల్రోజుల కిందట కల్లో కన్పించినప్పట్నుంచీ అత్త బాగానే ఉంది కదా! అత్త చెప్పదు కానీ.. ఈ మధ్య తను కొంచెం డీలాపడింది. 'ఏమిటత్తా! అంటే నవ్వింది. 'వయసు పెరిగేకొద్దీ ఆర్యోగం తరుగుతుంది అమ్మా!" అందే కానీ ఏమీ చెప్పలేదు. సానుభూతి, సహానుభూతి, సహాయం చెయ్యడం ఎంత ఇష్టమో...... వాటిని పొందడం అంత అయిష్టం అత్తకు. అందుకే ఎవరికీ ఏమీ చెప్పదు.

అనూ! అరవై ఏళ్ళు వస్తున్నా అత్త ఎంత అందంగా ఉంటుందో కదా! వయసులో ఉన్నప్పుడు ఇంకా... చాలా అందంగా ఉండేది. తెల్లగా, పొడవుగా, గుండ్రని మొహం, పెద్ద పెద్ద కాటుక కళ్ళు, నుదుట గుండ్రని బొట్టు, పొడవాటి జడ, జడనిండా పూలు.. (ఎప్పుడు ఏ పూలు దొరికితే అవి జడలో ఉండాల్సిందే) పొద్దున్నే స్నానం చేసేసి... చక్కటి చీరకట్టులో.. పెదాలపై చెరగని చిరునవ్వుతో... అత్త చాలా హుందాగా ఉండేది. ముత్యాల వరసలా ఉండే తెల్లటి పలువరసతో అత్త నవ్వు... మరో ఎస్సెట్ ! నాకు బాగా ఇష్టం.

అనూ! అత్త పల్లెలోనే పుట్టి పెరిగినా... ఎక్కువ చదువుకోకపోయినా చాలా సంస్కారం, తెలివితేటలూ ఉన్న మనిషి. తనకు శుచీ, శుభ్రతా ఎక్కువే. 'ఇల్లు సూసి.. ఇల్లాల్ని చూడు' అంటారు కానీ... అత్త తను ఎంత అందంగా, శుభ్రంగా ఉంటుందో.. ఇల్లు కూడా అలాగే ఉంచుతుంది. ఎక్కడి వస్తువులక్కడ... పొందిగ్గా శుభ్రంగా సర్దుతుంది. మనం చిన్నప్పుడు వాళ్ళ ఇంట్లో.. ఏవన్నా వస్తువులు, పుస్తకాలు తీసినా, పడేసినా... సున్నితంగా మనకు చెప్పి.. మన చేతనే సర్దిపించేది.

బహుశా ఆ అలవాటు వల్లనే మనకు శుభ్రంగా ఉండడం, ఉంచడం అలవడ్డాయని నాకు అప్పుడప్పుడూ అన్పిస్తూంటుంది. ముఖ్యంగా ఆరుమంది పిల్లల ముండే మనింట్లో... ఎక్కడివక్కడ ఉండే వస్తువులు, బట్టలు, పుస్తకాలు.. నేనే ఎక్కువగా సర్దుతూ... దుమ్ములు దులుపుతూ.. చెత్తలూడుస్తూ ఉంటే అమ్మ ముచ్చట పడేది. నాన్న 'సర్దుడు రాణి', క్లీనింగ్ క్వీన్' అని కితాబిచ్చేవారు. కానీ.. నానమ్మ మాత్రం అరుస్తూ ఉండేది. 'పొద్దుకూ అట్టా ఊడ్చి.. ఊడ్చీ.. ఇంట్లో లక్ష్మిందేవిని తరిమేస్తొండావు' అని.

"ఏం కాదు ఇల్లు శుభ్రంగా ఉంటేనే లక్షిందేవి ఇంట్లో

ఉంటాదంట. లేకపోతే దరిద్రదేవత వచ్చేస్తాదంట" అన్నా నేనోసారి పెద్ద.... ఆరిందాలా....!

"అబ్బో! ఎవరమ్మా నీకు చెప్పిన సుబ్బక్కా!" నానమ్మ రాగాలు తీసింది.

"అత్త... శంకరత్త చెప్పింది. అత్తావాళ్ళిల్లు చూడు పో! ఎంత బాగుంటాదో!"

"ఆ ! ఉంటాదుంటాది. ఎందుకుండదూ...? పిల్లా.. జల్లానా ఆయమ్మకు?" నానమ్మ ఈసడింపుగా అంది. ఆమె ఈసడింపు నాకప్పుడు అర్థం కాలేదు. కానీ... అత్తకు పిల్లల్లేరని... అందరూ ఆమెను చిన్నచూపు చూస్తారనీ... కొంచెం పెద్దయ్యాక తెలిసింది. పెళ్ళిళ్లు, పేరంటాలు, శ్రీమంతాలు, బారసాలలు... నలుగుపెట్టడానికి, ఆశీర్వదించడానికి.. చివర్న మొక్కుబడిగా పిలుస్తారనీ.. ఒక్కోసారి పిలవరనీ తెలిసి నాకే బాధన్పించింది.... మరి అత్తకు ఎంత బాధ ఉండేదో!

అందరు ఆడవాళ్ళలా అత్త వీధి అరుగుల మీద, ఇరుగింట్లో... పొరుగింట్లో చేరి కబుర్లు మాట్లాడదు. తీరిక దొరికితే పుస్తకం చదువుతుండేది. దినపత్రికలు, వారపత్రికలు ఇంటికే వచ్చేవి. జవానుతో లైబ్రరీ నుండి నవలలు తెప్పించుకొనేది.

"ఎప్పుడూ చదువుతూనే ఉంటావు. నువ్వూ పరీక్షలు రాస్తావాత్తా?" అన్నానోసారి అమాయకంగా చిన్నప్పుడు.

అత్త నవ్వేసింది. "ఈ పుస్తకాలు పరీక్షలు రాయడానికి కాదు అమ్ము! జీవితంలో ఎదురయ్యే పరీక్షలు, సమస్యలు ఎదుర్కొనే ధైర్యాన్నిస్తాయి. కాల, మాన పరిస్థితుల్లో మనం ఎలా ఉండాలో తెలిపే జ్ఞానాన్నిచ్చేవే పుస్తకాలు. సాహిత్యాన్ని చదివితేనే మనిషి మనసు.. మేధస్సు వికసించేది". అంటూ ఏదేదో చెప్తుంటే.. పూర్తిగా అర్థమవలేదుగానీ... 'సాహిత్యపఠనం' అలవాటు మాత్రం అత్తవల్లనే.. అత్త దగ్గర్నుండే ... అత్త ఇంట్లోనే... నాకు అలవడింది.

మామ అప్పుడు మనూర్లోని తహశీల్దారు ఆఫీసులో సూపర్నెంటుగా పనిచేసేవారు. తర్వాత ప్రమోషనొచ్చి తహశీల్దారు అయ్యారులే! ఆఫీసు జవానే... ఇంటి దగ్గరా... పనులు చేసేవాడు. సరుకులు, కూరగాయలు తేవడం, పోస్టాఫీసుకు వెళ్ళడం లాంటివి. అత్త ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళేది కాదు. ఊరికెళ్ళాలంటే మామతో, గుడికి అమ్మతో వెళ్ళేది.

మన చిన్నప్పుడు జట్కాబండ్లు ఉండేవి. అందులోనే మనం ఎక్కడికన్నా వెళ్ళేది. తర్వాత రిక్షాలు, ఆటోలూ వచ్చాయి. అత్తకు నేనంటే చాలా ప్రేమ. ఆమె గుడికెళ్ళినా... సినిమాకెళ్ళినా.. నేనూ తనతో ఉండాల్సిందే! మనింట్లో చిన్న పిల్లవు నువ్వే. నిన్ను వదలి అమ్మ వచ్చేది కాదు. జట్కాబండి తోలే అతను.. జానీ... నల్లగా తుమ్మమొద్దులా ఉండేవాడు, తాగుబోతు. అతని కళ్ళు ఎప్పుడూ ఎర్రగా ఉండేవి. అతన్ని చూస్తేనే నువ్వు జడుసుకొనేదానివి. అతని బండిలో రానని మొండికేస్తే... అమ్మ బలవంతంగా నిన్ను ఎత్తుకొని ఒళ్ళో కూర్చొబెట్టుకొనేది. నువ్వు అన్నం తిననన్నా.. అల్లరి చేస్తున్నా.. నానమ్మ జానీని పిలుస్తానని నిన్ను బెదిరించడం నీకు గుర్తుందా అనూ!!

"అలా భయపెట్టకండి. పిల్లల్లో ఇప్పుడు ఏర్పడే భయం పెద్దయ్యాకా పోదు. 'బూచి' అని 'దెయ్యం' అని... చిన్నప్పుడే పిరికితనం నూరిపోస్తే ఎలా?" అని అత్త నానమ్మనే కాదు.. అలా ఎవరేనా పిల్లల్ని భయపడ్తుంటే సున్నితంగా మందలించేది. 'పెద్ద.. కని సాకేసిందిలే ! ' అని వాళ్ళు గొణిగినా అత్త విననట్లు ఉండేదో.. విన్నా పట్టించుకొనేది కాదో... నాకు తెలీదు.

అయితే... అత్త ఎదురుగా ఎలా పడితే అలా మాట్లాడాలంటే మాత్రం భయపడేవారు జనాలు. అత్త గొంతులో, మాటల్లో.. నిర్భీతి, ఖచ్చితత్వం.. ఎవరినీ మారు మాట్లాడనిచ్చేది కాదు. తన నీతి, నిజాయితీలను అందరూ గౌరవించేవారు. అయితే చదువు, సంస్కారం అంతంత మాత్రమే ఉండేవారికి మాత్రం ఆమె "గర్విష్టి" ఆమె ... తన ఆత్మగౌరవం, ఆత్మాభిమానాల్ని కాపాడుకొనే వైనం.. ఇతరులకు గర్వంగా, అహంభావంగా కన్పించి ఉండొచ్చు. అభిమానానికి, అహంభావానికి వెంట్రెకవాసి తేడానే కదా! అది విజ్ఞులకే అర్థమవుతుంది.. అందరికీ కాదు. అర్థం చేసుకొన్న మామ... ఆ కాలంలోనే డిగ్రీ చదివి.... ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నా... అత్తను చాలా ప్రేమగా, గౌరవంగా చూసుకొనేవాడు. మితభాషి, గంభీరంగా ఉండే మామంటే మనకు రవంత భయమే కానీ.. మామ... అత్తకు భయపడేవాడు తెలుసా. అత్త చెప్పిందే చేసేవాడు. అత్త చాలా తెలివైందని... బాగా ఆలోచించిగాని ఏదీ మాట్లాడదని, చెప్పదని మామ నమ్మకం. అది నిజం కూడా.

నీకు తెలుసా అనూ! మామకు 'మందు' తాగడం బాగా అలవాటయ్యాక, తాగినపుడు తనను తాను కంట్రోల్ చేసుకొనే పరిస్థితి దాటిపోయాక, బయట తాగకూడదని అత్త కండిషన్ పెట్టింది. ఇంట్లోనే తాగమంది. జవాను తెచ్చిపెట్టేవాడు. బల్ల మీద నీళ్ళు, గ్లాసు, నంజుకోవడానికి పల్లీలో, పకోడీలో, ఏదో

ఒకటి.. తనే అమర్చేది.

ఇది తెలిసి చాలా మంది ఆశ్చర్యపోయారు. సోకాల్డ్ పెళ్ళాలు ముక్కుమీద వేలేసుకున్నారు. చిన్నా చితకా ఈర్ష్యతో గొణిగారు. దుమ్మెత్తిపోశారు.

"ఎక్కడన్నా.. మొగుడు తాగతా వుంటే వద్దని పోట్లాడే పెళ్ళాల్ని చూశాం గానీ....

ఇట్లా.. ఇంట్లోనే తాగమని.. తనే అన్నీ పెట్టే ఆడదాన్ని ఎక్కడా చూళ్ళేదమ్మా!"

అత్త లెక్కపెట్టే ఆడది కాదు. ఈ విషయం అమ్మకు తెలిసి.. ఎందుకలా చేస్తున్నావని అడిగింది. అమ్మ... అత్త చాలా సఖ్యతగా, ఒకరిపట్ల మరొకరు స్నేహంగా అభిమానంగా ఉండేవారు. అత్త తిన్నగా జవాబు చెప్పేది ఒక్క అమ్మకే.

"ఏం చేసేది వదినా ! బయట తాగి.. పడుతూ లేస్తూ... జవాను సాయంతో ఇంటికి రావడం... తనకు తెలీకుండానే ఏదేదో వాగుతూ ఉండడం... చూసేవాళ్ళకు ... ఎగతాళి కాదూ? మనకు నగుబాటు కాదా? ఆయన హోదాకు, ఆయన భార్యగా నాకూ గౌరవమా? కాదు కదా! ఇంట్లో అయితే లిమిట్‌గా తాగి, తిని, గమ్మున పడుకొంటారు. ఎవరేమనుకొంటే మనకేంటి? ఇళ్ళ దగ్గర... రోడ్ల మీద... వీధుల్లో పడి పోట్లాడుకుంటుంటే.. అసహ్యమన్పించదా వాళ్ళకు? చేతనైతే వాళ్ళ మొగుళ్ళ తాగుడు మాన్పించుకోవాలి గానీ.. ఇంకొకళ్ళ మీద పడి ఏడ్వడం ఎందుకూ? అయినా.. మా ఇంట్లో.. ఆయన తాగితే ఎవరికి నష్టం? కష్టం?"

అత్త మాటలకు ఎదురు చెప్పే అవకాశమే ఇవ్వదు. మరీ మొండిగా ఎవరేనా వితండవాదం చెయ్యబోతే..." అది మీ అభిప్రాయం. మీతోనే ఉండనివ్వండి" అని అక్కడితో సంభాషణ తుంచేస్తుంది.

"అత్తా ! నువ్వింత బాగా మాట్లాడ్డం ఎక్కడ నేర్చుకొన్నావూ?" అని అడిగానోసారి.

"అవసరాలే అన్నీ నేర్పిస్తాయి అమ్మా!" అత్త ఎందుకో నిట్టూర్చింది.

అత్తకు చిన్నవయసులోనే పెళ్ళియిందని, చాలా బిడియస్తురాలని, ఎక్కువ మాట్లాడేదేకాదని,... అత్తగారింట్లో అత్తమామలు, బావ తోడికోడలు, ఆడపడుచూ అత్తను చాలా బాధలు పెట్టారని... మెల్లమెల్లగా.. ధైర్యాన్ని కూడదీసుకొని ఎదిరించడంతో ఇంట్లో బాగా గొడవలు జరిగేదని... గొడవలు, అత్త బాధ చూడలేక మామ ట్రాన్స్‌ఫర్ చేయించుకొని వచ్చారని అమ్మ చెప్పింది.

అయితే అత్తింటివారు ఎవరొచ్చినా... ఎన్నాళ్ళుండినా... అత్త ఏ మాత్రం విసుక్కోకుండా అతిథి మర్యాదలు చక్కగా చేసేది. ఉన్నన్నాళ్ళూ... మాంసం, చికెన్, చేపలు, ఫలహారాలు... రోజుకోరకం చేసి పెట్టేది. అత్త వంట బాగా చేసేది. చెయ్యి కూడా పెద్దదే పెట్టడానికి. స్పెషల్స్ ఏమి చేసినా ముందు మనింటికి పంపేది. పనిమనిషికి రోజు అన్నం, కూరలూ ఇచ్చేది. ఉదయం నుండి రాత్రి దాకా మామతోనే ఉండే జవాను జవాను చాల మటుకు ఇక్కడే భోంచేసేవాడు.

అత్తకు తన, పర బేధం లేదు. అందరినీ సమానంగా ఆదరించేది. యాలకులు వేసి అత్త పెట్టే... చిక్కటి 'టీ' అంటే మనకందరికీ ఇష్టం కాదూ!

ఊట బావి నుండి ఉబికి వచ్చే నీటితరంగాల్లా... అత్తను తలచుకొంటే చాలు... నా మనసు పొరల్లో దాగినవి.... దాచుకొన్నవీ.. ఎన్నెన్నో మధుర జ్ఞాపకాలు.. గుర్తుకొస్తాయి. నా పెదాలపై చిరునవ్వుల పూలు పూయిస్తాయి. కానీ... ఇప్పుడు మాత్రం ఎందుకో రవంత అలజడిగా అనిపిస్తోంది.

అనూ! అత్తకు టైలరింగ్ వచ్చు. రంగుదారాల్తో ఎంచక్కా బట్టల మీద రకరకాల కుట్లుతో ఎంబ్రాయిడరీ చేయడం వచ్చు. అప్పట్లో 'విమల్ పాలిష్టరు' క్లాత్ కొత్తగా వచ్చింది. తెల్లని క్లాత్ కొని పరికిణి కుట్టి.... కింద అంచులాగా... కుండీ, తీగలు, ఆకులు, పూలతో డిజైన్ తనే వేసి... ఎంతో అందంగా కుట్టింది. చాలా రోజులు పట్టింది పూర్తవడానికి. "బూబుసానమ్మలాగా... ఎప్పుడూ ఆ కుట్టడమేమిటి? మళ్ళీ తలనొప్పి అని బాధపడుతుంటావూ?" అని మామ మెత్తగా కోప్పడ్డం నేను విన్నాను. అత్త నవ్వేసి కుడుతూనే ఉంది. కుట్టడం పూర్తయ్యాక... దానిపైకి పచ్చరంగు జాకెట్టు కుట్టి నాకు ఇచ్చింది. థాంక్స్ చెప్పాలన్న ఇంగితం తెలీని వయసు.

మరుసటి రోజు శుక్రవారం. తలస్నానం చేస్తే... మన ఒత్తయిన పొడవు జుట్టు ఆరదని.. అమ్మ "చేపముల్లు" జడ వేసేది (జుట్టును పై నుండి కింది దాకా సన్నని పాయలు పాయలుగా పక్కల నుండి తీసుకొంటూ మధ్యలో జడ అల్లడం)

అత్త కుట్టిచ్చిన కొత్త డ్రస్ వేసుకొని, మైసూరు మల్లెల దండ జడలో పెట్టుకొని ఆ శుక్రవారం బడికి వెళ్ళిన రోజు... అందరి చూపులూ .... నా పరికిణి పైనే.... "చాలా బావుంది. ఎవరు కుట్టింది?" అంటూ మీ రాజేశ్వరి మేడమ్, పద్మమేడమ్ పట్టి పట్టి చూశారు. "మా అత్త!" అని నేను చాలా గర్వంగా చెప్పినట్లు గుర్తు. బాగా చిరిగిపోయేంత వరకూ... ఆ పరికిణిని నేను చాలాసార్లు వేసుకొన్నా!

మైసూరు మల్లెల చెట్లు ఇప్పుడు ఎక్కువ కన్పించడం లేదు. ఎక్కడన్నా కన్పిస్తే... నాకు వెంటనే అత్త గుర్తొస్తుంది. అత్త వాళ్ళింటి పెరట్లో మైసూరు మల్లెల చెట్లు పొదలు పొదలుగా

ఉండేవి. పూలు గుత్తులు గుత్తులుగా పూసేవి. కాడలు చాలా సన్నగా, పొట్టిగా ఉంటాయి కాబట్టి కట్టడానికి కుదరదు. అత్త సాయంత్రమే విడిచిన పూల గుత్తులు కోసి... పూలు విడదీసి సూదితో దండ గుచ్చేది. పూలు పూసినన్నాళ్ళు నాకు, తనకో దండ గుచ్చేది.

"ఆ పొదలకు, పూల వాసనకూ పాములు చేరతాయి. కొట్టించెయ్య "వాని మామ అన్నా వద్దనేది." పాములుంటే ఉ ండనీ! వాటి జోలికి మనం పోతేనే.. అవి మనల్ని కాటేస్తాయి. లేకపోతే వాటి మానాన అవి ఉంటాయి." అంటుంటే "ఝాన్సీరాణికున్నంత ధైర్యం... అందరికీ ఉండొద్దా?" అని నవ్వేవాడు మామ.

సాయంత్రాలు, శెలవుదినాలు... ఎక్కువగా నేను అత్త వాళ్ళింట్లోనే ఉండడం అత్త నన్ను స్వంత బిడ్డలా ప్రేమగా చూసుకోవడం వల్లా కావచ్చు మా ఇద్దరికీ ఎక్కువ అనుబంధం ఏర్పడిపోయింది.

మామకు చంద్రగిరికి బదిలీ అయి... వెళ్ళిపోతుంటే.... నేను అత్తను గట్టిగా పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. వారం రోజులు జ్వరపడ్డాను కూడా. అత్త తన బాధ, కన్నీళ్ళు ఎవరికీ చూపించదు కదా! పెదవి బిగబట్టి నన్ను ఓదార్చింది.

"శెలవుల్లో వద్దువుగానీ అమ్మూ!" అంటూ అన్నట్లుగానే ప్రతి శెలవులకూ నన్ను తీసుకెళ్ళేది. ఒక్కోసారి నువ్వూ నాతో వచ్చేదానివి కదూ! చుట్టుపక్కల ఉండే గుళ్ళకు తీసుకెళ్ళేది. అలా మనం శ్రీనివాస మంగాపురం ఫస్ట్ చూసింది అప్పుడే.

అత్తతో ఎక్కువగా ఉండడం వల్ల.... నేను కొన్ని టిప్స్ కూడా నేర్చుకొన్నాను. అవి ఇప్పటికీ నాకు ఉపయోగపడ్తున్నాయి. తడిబట్టలకు కాకుండా ఆరిన తర్వాతే గంజి పెట్టడం, టీ కాచిన గిన్నెలో వెంటనే నీళ్ళు పోసి పెట్టడం వల్ల మరక గట్టిపడకుండా క్లీన్ చెయ్యడం సులభమవుతుంది. అప్పట్లో లిక్విడ్ బ్లూ లేదు. పొడి ఉండేది. అది నీళ్ళతో కలిపితే.. సరిగా కలవకుండా బట్టల మీద చుక్కలు చుక్కలుగా మరకలు పడేవి. అత్త ఒక చిన్న బట్టలో పొడి వేసి మూటకట్టి దానిని నీళ్ళలో వేసి తర్వాత బట్టలు జాడించమనేది. అప్పట్లో చాలా మంది స్త్రీలు... రోజూ.. కొందరు శుక్రవారమన్నా తప్పనిసరిగా మొహానికి పసుపు రాసుకొనేవారు. అత్త సోపు నురగతో కలిపి పూసుకొనేది. దానివల్ల మొహమంతా సమంగా... ఎక్కువ లేకుండా ఉంటుందనేది. ఐరన్ చేసిన బట్టలు మనిషికి హుందాతనాన్నిస్తాయనేది.

"అత్త నగలు ఎక్కువ పెట్టుకొనేది కాదు. చీరలు, నగలు సినిమా నటుల పేర్లుతో రావడం ఇప్పటికీ ఉంది కదా! అప్పుడు వాణిశ్రీ నెక్లెస్ (నాన్‌సెట్) అని అందరూ వేలం వెర్రిగా చేయించుకొన్నారు. మామ కూడా అత్తకు చేయించాడు. అప్పుడు నేను అత్తవాళ్ళింట్లోనే ఉన్నాను. కంసాలి ఇంటికి తెచ్చిచ్చివెళ్ళాక .... మొదట నా మెడలోనే వేసింది. పెద్ద పెద్ద పువ్వుల డిజైన్‌తో గ్రాండ్‌గా ఉన్న నెక్లెస్ మెడనిండుగా అందంగా ఉంది.

"చూడండీ! అమ్ము ఎంతంగా ఉందో నెక్లెస్ వేస్తే!" అత్త మామతో మురిపెంగా అంటే.... "అవునవును... పెళ్ళికూతుర్లా ఉంది' అన్నాడు మామ.

"పో మామా!" అని నేను సిగ్గుపడితే.... "ఆరోజు వస్తుందిలే!" నవ్వారిద్దరూ.

మరుసటి రోజు చినరెడ్డెమ్మ పెళ్ళికి వెళ్ళాం. అత్త కొత్త కమ్మలు పెట్టుకొని నెక్లెస్ నాకే వేసింది. పెళ్ళిలో చాలామంది నెక్లెస్ బాగుందని మెచ్చుకోవడం.... నాకు గుర్తే.

తనకన్నా చెల్లెలికి ఎక్కువ నగలు పెట్టారని పెళ్ళిలోనే పెద్ద రెడ్డెమ్మ గొడవపెడితే అత్త ఎంతో సమయస్ఫూర్తిగా, చాకచక్యంగా మాట్లాడి గొడవ సద్దుమణిగేలా చేసింది. "చిన రెడ్డెమ్మనీ ఎంగిలిపాలు తాగి పెరిగిన నీతోబుట్టువు. నువ్వు తన పట్ల ఒక తల్లిలా ప్రేమ, అభిమానంతో అండగా ఉండి. మళ్ళీ మళ్ళా మీరు ఒక తల్లి కడుపులో పుడతార.... పెరగతారా? ఈ జన్మలో పుట్టారు. ఒకరకొకరుగా ఉండాలి. బంధాల కన్నా బంగారం ముఖ్యం కాదు." అత్తమాటలు నాకిప్పటికీ మరపురావు.

"తీసుకవడంలో కన్నా ఇవ్వడంలోనే ఎక్కువ ఆనందం ఉంటుంది." నా మనోక్షేత్రంలో నాటుకొన్న బీజాక్షరాలు.

డిగ్రీలతో కొలిచే చదువు అత్త చదవలేదుగానీ..... సాహిత్యాన్ని బాగా చదవడంతో అత్త చాలా బ్రాడ్ మైండెడ్‌గా ఉండేది. సాంప్రదాయాలు, ఆచారాలు మనిషికి మేలు చేయాలే గాని... దుఃఖాన్ని, బాధను కల్గించే దురాచారాలను మూఢంగా పాటించనవసరం లేదని చెప్పేది. చెప్పడమే కాదు ఆచరించేది కూడా.

గుండెపోటుతో హఠాత్తుగా మామ చనిపోతే... లోల్లోపల ఎంత కుమిలిపోయినా ధైర్యంగా నిలబడింది. "దినం' కు కావల్సిన ఏర్పాట్లన్నీ తనే స్వయంగా పర్యవేక్షించడం ఒక ఆశ్చర్యమైతే... తాళిబొట్టు, మెట్టెలు తప్ప పూలు, కుంకుమ, గాజులు తియ్యకపోవడం మరింత విస్మయం కల్గించింది అందరికీ.

"మన ఆచారం కదమ్మా..." అంటూ ఎవరో రాగాలు

తియ్యబోతే మధ్యలోనే ఆపింది.

"నాకు బుద్ధి తెల్సినప్పట్నుంచీ బొట్టు, పూలు, గాజులు పెట్టుకొంటూనే ఉన్నా! ఇప్పుడెందుకు తీసెయ్యాలి? భర్తతో వచ్చింది తాళి, మెట్టెలే కదా!" అనేసింది.

మూతులు ముడచుకొన్నా... చెవులు కొరుక్కొన్నా... నొసళ్ళు చిట్లించినా.... భర్తంటే ప్రేమ, గౌరవం లేదని, బరితెగింపు, గయ్యాళి ఆడదని ప్రచారం చేసినా ఏ మాత్రం చలించని ధీర వనిత.... అత్త. ఒంటరితనం అత్తను బాగా బాధపెట్టినా భరించింది.

"సర్వీసులో ఉండగానే మామ పోయారు కాబట్టి నీకు ఉద్యోగం ఇస్తానన్నా వద్దన్నావట.ఎందుకత్తా?" అని ఓ సారి అడిగాను.

"మామకు నేనంటే చాలా ప్రేమ అమ్మూ! ఎంత ప్రేమంటే.... నన్ను ఎవరేనా.. చూస్తే కూడా భరించలేనంత. మామ ఉన్నంతవరకూ నన్ను దేనికీ బయటకు పంపలేదు. ఇవాళ... ఆయన లేరని... వెళ్ళడం... నాకు ఇష్టంగా అన్పించలేదు. అయినా మామ పెన్షన్ వస్తుంది. ఉండడానికి స్వంత ఇల్లు కట్టారు. నా ఒక్కదానికి చాలు కదా! అయినా.... మామ నన్ను వదలి ఎక్కడికి పోతారు? నాతోనే ఉన్నారు. చూడు ఎలా నవ్వుతున్నారో.?" మామ ఫోటో చూపుతూ అంది.

మామ నిలువెత్తు ఫోటో చేయించి హాల్లో పెట్టింది. దానికిందే ఆయన వాడిన టేబులు, కుర్చీ వేయించింది. అత్త ఎప్పుడూ ఆ కుర్చీలోనే కుర్చునేది. చదవడం, తినడం, టీవీ చూడ్డం..! నిద్రవస్తే పక్కనే ఉన్న దీవాను మీద పడుకొనేది.

"ఆ ఉద్యోగం.. ఎవరన్నా చదువుకొన్న నిరుద్యోగికి వస్తే.. ఆ వ్యక్తి కుటుంబం బతుకుతుంది కదా! అయినా నేను పెద్దగా చదువుకోలేదు. ఏ స్వీపరో, జవాను ఉద్యోగమో.. నేను చేస్తే ... మహారాణిలా నన్ను చూసుకొన్న మామ బాధపడరా?అయినా అమ్మూ! ఆడపిల్లలు బాగా చదువుకోవాలి. తను కాళ్ళ మీద తాము నిలబడాలి. ఒకప్పటి ఆడంబరాలన్నీ ఇప్పుడు నిత్యావసరాలైపోయాయి. కాబట్టి భార్యభర్తలు ఇద్దరూ కష్టపడక తప్పని పరిస్థితి. పిల్లల చదువులూ "కొనే" రోజులైపోయాయి కదా!!"

అత్త ఏమి మాట్లాడినా పూర్తి అవగాహనతో ఆలోచింపచేసేలా ఉంటుంది.

"నిజమే అత్తా ! మామకు నువ్వంటే చాలా ప్రేమ. భయం కూడా!" నేను నవ్వాను అత్త కూడా నవ్వింది గట్టిగా. "నిజం అమ్మూ.. మీ మామకు చీకటంటే ఎంత భయమో! రాత్రిళ్ళు ఎప్పుడన్నా కరెంట్ పోతే... " శంకరా... శంకరా.." అని పిలిచేవారు. అంతా మేకపోతు గాంభీర్యమే! చిన్న సమస్యకూ ఎక్కువ ఆందోళన పడిపోయేవారు." అత్త కళ్ళు చెమర్చడం... బాధగా అన్పించింది. "ఆత్మీయులు దూరమైన బాధకన్నా... వారి జ్ఞాపకాలు ఎక్కువ బాధిస్తాయి అమ్మూ!" అత్త గొంతు గద్గదమైంది.

బావకు కూడా అత్తంటే ఇష్టం. మేమిద్దరం మాకు వీలైనపుడల్లా వెళ్ళి అత్తతో కాసేపు మాట్లాడి వస్తుంటాము. వీలుకాకపోతే ఫోన్లోనన్నా మాట్లాడుతుంటాము.

ఇదిగో.. ప్రియాంక ప్రసవం కోసం అమెరికా వచ్చిన ఈ మూడ్నెల్లూ అత్తతో మాట్లాడ్డమే కుదరలేదు. ఇండియా రాగానే ముందు వెళ్ళి అత్తను చూడాలి.

"నిన్నా... మొన్నా.. గౌన్లేసుకొని నా ముందు నువ్వు తిరుగాడినట్లే ఉంది. అప్పుడే నువ్వు అమ్మమ్మవు కూడా కాబోతున్నావు" అని నవ్వింది అత్త అమెరికా వచ్చేముందు. అలా.... మనసారా.. స్వచ్ఛంగా.. హాయిగా నవ్వుతున్న అత్తరూపం నా మనసులో, కళ్ళల్లో అలా నిలిచిపోయింది. పదే పదే గుర్తొస్తోంది. అదిగో! బాబు లేచినట్టున్నాడు. ఉంటాను అనూ! అత్తను ఓ సారి చూసిరా తీరిక చేసుకొని. నీ బదులుకై ఎదురు చూస్తూ

మీ

అక్క

♦♦♦

అక్కా

మేమంతా వెళ్ళి అత్తను చూసి వచ్చి వారమైంది. తను ఇప్పుడు చాలా సంతోషంగా, శాంతిగా ఉండి ఉంటుంది..... మామ ఫోటో పక్కనే తనూ ఫోటో అయ్యి.

అత్త మనకు స్వంత "మేనత్త" కాకపోయినా.. మన చిన్నతనంలో ఉద్యోగరీత్యా.. మనూరికి... మన పక్కింట్లోకి వచ్చినప్పట్నుండి.. ఇప్పటిదాకా మనకు మేనత్త ప్రేమను.. ప్రతిఫలాపేక్ష లేకుండా పంచిన అద్భుతమైన వ్యక్తి అత్త. ఆమె మన జ్ఞావకాల్లో ఎప్పటికీ చిరంజీవే! జీవితంతో ఒంటరిపోరాటం చేసి అలసిన అత్త మృత్యుదేవత కౌగిలిలో హాయిగా సేద తీరిందని భావించడం తప్ప బాధపడి మనం చేసేదేం లేదు.

నీ ఆరోగ్యం జాగ్రత్త!

ఉంటామరి

నీ

అనూ ! ♦



# మన పౌరసత్వం

- ఎం.వి.ఎస్ శర్మ

చట్టం ఏం చెబుతోంది?

పౌరసత్వ చట్టం 1955 డిసెంబరు 30 నుండి అమలులోకి వచ్చింది.

1. ఎవరికి పౌరసత్వం లభిస్తుంది?

(అ) 26-1-1950 తర్వాత నుండి 1-7-1987 లోపు ఈ దేశంలో పుట్టిన ప్రతీ వ్యక్తీ ఈ దేశ పౌరసత్వానికి అర్హుడు.

(ఆ) 2003లో పౌరసత్వ చట్ట సవరణ జరిగింది. దాని ప్రకారం 1-7-1987 నుండి 2003 సవరణ జరిగిన నాటి మధ్య కాలంలో భారతదేశంలో పుట్టిన వ్యక్తి తల్లిదండ్రులలో ఒకరైనా ఆ నాటికి భారతీయ పౌరులై ఉంటేనే ఆ పుట్టిన వ్యక్తికి ఈ దేశ పౌరసత్వం లభిస్తుంది.

(ఇ) 2003 సవరణ తర్వాత ఈ దేశంలో జన్మించిన వ్యక్తి తల్లిదండ్రులిద్దరూ ఈ దేశ పౌరులైతేనే ఆ వ్యక్తికి పౌరసత్వం లభిస్తుంది. తల్లిదండ్రులిద్దరిలో ఒకరు ఈ దేశ పౌరులుగా ఉండి రెండోవారు పౌరులుగాకున్నా ఈ దేశంలోకి చట్ట సమ్మతంగా వచ్చి వుంటే అటువంటి తల్లిదండ్రులకు ఈ దేశంలో జన్మించిన వ్యక్తికి కూడా పౌరసత్వం లభిస్తుంది.

(ఈ) 26-1-1950 తర్వాత, 1992 డిసెంబరు 10వ తేదీకి ముందు ఇతర దేశాలలో జన్మించిన వ్యక్తికి తండ్రి గనుక భారతీయ పౌరుడైతే ఆ వ్యక్తికి కూడా భారతీయ పౌరసత్వం లభిస్తుంది.

(ఉ) 10-12-1992 తర్వాత ఇతర దేశాలలో జన్మించిన వ్యక్తి తల్లిదండ్రులలో ఏ ఒక్కరు భారతీయ పౌరులైనా ఆ వ్యక్తికి భారతీయ పౌరసత్వం లభిస్తుంది.

(అయితే ఆ తల్లిదండ్రులు కూడా విదేశాలలో జన్మించిన వారైతే విదేశాలలో జన్మించిన వారి బిడ్డలకు భారతీయ పౌరసత్వం రాదు)

2. పైన ప్రస్తావించిన పౌరసత్వ నిబంధనల ప్రకారం భారతీయ పౌరులు కాని వారు ఈ దేశంలో పౌరులుగా నమోదు కావాలని కోరుకుంటే వారికి దిగువ పేర్కొన్న అర్హతలలో ఏదైనా ఒకటి ఉండాలి.

(ఎ) భారతదేశ మూలాలు కలిగి వుండి, కనీసం ఏడేళ్లు భారతదేశంలో ఉండి వుంటే ఆ తర్వాత మన దేశ పౌరస్వతం పొందవచ్చు.

(బి) భారతీయ మూలాలు కలిగి వుండి, స్వతంత్రం రాక మునుపు ఉన్న అవిభక్త భారతదేశంలో గాక వేరే ఏ దేశంలోనైనా పౌరుడిగా ఉన్న వ్యక్తి కూడా మన దేశ పౌరసత్వం పొందవచ్చు.

(సి) భారతదేశం లోని పౌరుని వివాహం చేసుకుని ఏడు సంవత్సరాలు ఈ దేశంలో నివాసం ఉంటే పౌరసత్వం పొందవచ్చు.

(డి) భారతీయ పౌరుల పిల్లలు దేశ పౌరసత్వం పొందవచ్చు.

(ఇ) తల్లిదండ్రులిద్దరిలో ఏ ఒక్కరైనా భారతీయ పౌరులై వుంటే యుక్త వయస్కులైన వారి సంతతి భారతదేశంలో ఒక సంవత్సరం నివసించాక పౌరసత్వం పొందవచ్చు.

ఎఫ్. విదేశాలలో ఉండే భారతీయులు (ఓవర్సీస్ సిటిజన్లు) ఆ విదేశీ పౌరసత్వం నివాసం వుంటే మనదేశ పౌరసత్వం పొందవచ్చు.

3. ఇవి గాక ఎవరైనా వ్యక్తి శాస్త్ర, సాంకేతిక, సామాజిక,

## కవిత

# అమ్మ ఒడి

- కె. చైతన్య కుమార్



నవమాసాలను మోసి
పెంచి పెద్ద చేసిన తల్లి నీ ఋణం
ఎలా తీర్చుకోగలనమ్మా...
నీ జోల పాటలలో
నీ జీవితం నింపి
నా లాలి పాటలతో
లోకాన్ని చూపావు
నీ గుండెలపై ఎత్తుకొని
ఊపిరాడని ముద్దులతో
అలుపెరగని మాటలతో
ఒక్కమారు అమ్మా అనరా కన్నా అంటూ
అక్కున చేర్చుకొన్న - అమ్మఒడి నా కన్నతల్లి
నా కనిపించిన దీపం
అమ్మ స్పర్శలో పులకరించిన
నా దేహం
అమ్మ లోగిలి నాకు మరపురాని జాబిలి ◆

సాహిత్య, తాత్విక రంగాలలో మానవాళి పురోగతికి తోడ్పడిన వారు, ప్రపంచ శాంతి కోసం విశేష కృషి చేసిన వారికి కేంద్ర ప్రభుత్వం పౌరసత్వం ఇవ్వవచ్చు.

ఈ నిబంధనలను పరిశీలిస్తే జాతి, కులం, మత విశ్వాసం వీటి ప్రాతిపదికన మన దేశ పౌరసత్వం లేదని స్పష్టం అవుతుంది. కొత్తగా ఎవరికైనా పౌరసత్వం ఇవ్వాలన్నా, అప్పుడు కూడా జాతి, కుల, మత, విశ్వాసాలతో నిమిత్తం లేదు. సదరు వ్యక్తి ఈ దేశంలో మూలాలు కలిసి వుండడమో లేక ఈ దేశంలో నిర్ణీత కాలం నివాసం ఉండడమో మాత్రమే ప్రాతిపదికగా ఉంది.

ఇప్పుడు బిజెపి ఆ ప్రాతిపదికనే మొత్తంగా మార్చివేసింది. పౌరసత్వం ఇవ్వాలా, వద్దా అనేదానికి సంబంధం లేని మతాన్ని ప్రాతిపదికగా తెచ్చింది. ఇది రాజ్యాంగ మౌలిక స్వభావాన్ని మార్చివేసే ప్రయత్నమే.

4. జాతీయ పౌరసత్వ గుర్తింపు కార్డులు

దీనికి సంబంధించి 2014లో అప్పటి యుపిఎ ప్రభుత్వం చట్ట సవరణ చేసింది. భారతీయ పౌరులందరికీ పౌరసత్వ గుర్తింపు కార్డు (నేషనల్ ఐడెంటిటీ కార్డు) తప్పనిసరిగా జారీ చేయాలని, అందుకోసం 'జాతీయ పౌరసత్వ రిజిస్టర్'ను నిర్వహించాలని ఆ సవరణ నిర్దేశించింది. దీనిపై కొందరు సుప్రీంకోర్టుకు అప్పీలు చేశారు. ఈ నిబంధనను దేశం మొత్తానికి వర్తింపజేయడం సరికాదని, వివాదం ఉన్న అసోం ప్రాంతం వరకే పౌరసత్వ రిజిస్టరు తయారీ ప్రక్రియను పరిమితం చేయాలని ఆదేశించింది.

సుప్రీంకోర్టు 2013లో ఇచ్చిన ఈ ఆదేశానికి విరుద్ధంగా జాతీయ పౌరసత్వ రిజిస్టరును దేశం మొత్తానికి వర్తింపజేసే విధంగా బిజెపి ప్రభుత్వం నిర్ణయించింది. 2021 జనాభా లెక్కల సేకరణతో దీనిని అనుసంధానం చేయనుంది.

ఇప్పుడు ప్రభుత్వం ఎవరి పౌరసత్వాన్నైనా ప్రశ్నించవచ్చు. అప్పుడు మనమే రుజువు చేసుకోవాలి. ఈ దేశం లోనే పుట్టినట్లు దాఖలా ఏంటి?

పుట్టిన స్థలానికి ఎక్కువ మంది దగ్గర రుజువు ఉండదు. స్కూలు సర్టిఫికెట్‌లో 10వ తరగతి బోర్డు సర్టిఫికెట్‌లో పుట్టిన తేదీ ఉంటుంది తప్ప ఏ ఊళ్లో పుట్టిందీ ఉండదు. మునిసిపల్, పంచాయితీ రికార్డుల్లో జనన, మరణ రిజిస్టర్లు ఉంటాయి. వాటిలో నమోదు అయి వుండాలి. లేదా ప్రభుత్వ ఆస్పత్రులలో ప్రసవం జరిగినట్లు ధృవపత్రాలు వుండాలి. ఎవరి దగ్గర ఉంటాయి? ఇప్పుడు కావాలంటే ఎవరిస్తారు? అధికారులు ఎవరిని ప్రశ్నించవచ్చు? ఈ ప్రశ్నలు అందరిలోనూ భయాందోళనలు రేకెత్తిస్తున్నాయి. ఈ భయాందోళనలు ముస్లిం మైనారిటీలలో మరీ ఎక్కువగా ఉన్నాయి.

గ్రామీణ ప్రాంతాల ప్రజల వద్ద రికార్డులు ఏముంటాయి? పొట్ట చేతబట్టుకుని బతుకుతెరువు కోసం వలసలు పోయిన కార్మికుల వద్ద ఏ రికార్డులుంటాయి?

ఇన్నేళ్లూ ఈ దేశ పౌరులు కాని వారెవరో గుర్తించే బాధ్యత ప్రభుత్వం మీద ఉండేది. ఇప్పటి నుంచీ మనం ఈ దేశ పౌరులమని రుజువు చేసుకోవాల్సిన అగత్యం కల్పించింది మోడీ ప్రభుత్వం. ఇది సరైనదేనా?

ఎవరినైనా చట్టం ముందు ముద్దాయిగా నిలబెడితే, అతగాడు నేరస్తుడు అని రుజువు చేయాల్సిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంటుంది. అలాగాకుండా, ఎవరినైనా తెచ్చి ముద్దాయిగా నిలబెట్టి ఫలానా నేరం నువ్వు చేయలేదని నిరూపించుకో అంటే అర్థం ఏంటి? న్యాయం తలకిందులవడమే కదా?

ఇంత తీవ్రమైన దాడి జరుగుతున్నప్పుడు కూడా ప్రేక్షకుల్లాగా ఉండిపోదామా? ◆

విశ్లేషణ

# డా॥ రెంటాల సాహిత్య పరామర్శ






- డా॥ జోశ్యుల కృష్ణబాబు
9866454340

కొంతమంది వ్యక్తుల్ని చూడగానే ఆత్మీయంగా ఎదురువెళ్ళి పలకరించాలనిపిస్తుంది. వాళ్ళు మనకు మరింత దగ్గరైతే బాగుండునని పిస్తుంది. వాళ్ళతో కలిసి ముచ్చటించాలని పిస్తుంది. వాళ్ళు మాట్లాడుతుంటే అలా ఎంతసేపైనా వినాలనిపిస్తుంది. వాళ్ళతో సంభాషణ అదినేరుగా కాని, ఫోన్‌లో కాని, ఎంతో ఉత్సాహంగా, ఉల్లాసంగా, అనిపిస్తుంది. మాట్లాడటం అయిపోయాక కూడా ఎంతో హాయిగా ఉండి ఆ మాటల ప్రేరణతో ఈరోజు ఏదొకటి చదవాలి, ఏదైనా రాయాలి అని కూడా అనిపిస్తుంది. అదిగో! సరిగ్గా అలాంటివ్యక్తే డా॥ రెంటాల శ్రీ వేంకటేశ్వరరావు.

మనం కొంత మందిని కవులుగా, రచయితలుగా, విమర్శకులుగా, విశ్లేషకులుగా, సమీక్షకులుగా, వక్తలుగా చాలా ఇష్టపడతాం. కాని ఎందుకో వ్యక్తిగా ఇష్టపడలేం. కాని రెంటాలను ఎవ్వరైనా ముందు వ్యక్తిగా ఇష్టపడతారు. ఆయన రచనల్ని, చదివాక, ఆయన ఉపన్యాసాల్ని విన్నాక ఆయనకి వీరాభిమానులుగా మారిపోతారు. ఇక ఆయన రాసిన గజల్స్ అయితే అవి విశ్వవ్యాప్తంగా ఆయనకి ఎందరో అభిమానుల్ని సంపాదించిపెట్టాయి.

రెంటాల తొలిగురువు వారి తాతగారు. పక్కలో పడుకోపెట్టుకొని పద్యాలుచెపుతూ కాళహస్తీశ్వర శతకం, మనుచరిత్ర, వసుచరిత్ర వంటి గ్రంథాలలోని పద్యాలను కంఠస్థం చేయించేవారు. ఇక వీరి తొలి రచన 5వ తరగతిలో ఉండగా తోటి పిల్లలతో కలిసి ప్రదర్శించాలన్న కుతూహలంతో, మూడు నాలుగు పేజీల్లో సొంతంగారాసిన "శమంతకమణి" నాటక స్క్రిప్ట్. రెంటాల చిన్నప్పటి నుండి విపరీతమైన పుస్తక పఠనాభిలాషి. ఇంటర్ సెలవులలో ఒక పెద్దాయన యొక్క చిన్న ప్రేరణతో చేమకూర వేంకట కవి రాసిన సారంగధర చరిత్ర మొత్తం కూడబలుక్కొని చదివేసారు. అందుకే ఈయన సైన్స్ స్టూడెంట్ అయినా, ఎమ్మెస్సీలో సీటు వచ్చినా కాదని, ఉస్మానియా యూనివర్సిటీ సాయంకళాశాలలో చేరి మరీ ఎమ్.ఏ., తెలుగు లిటరేచర్ చేసారు. వివిధ ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో తెలుగు అధ్యాపకునిగా పనిచేసి 2018లో ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణ చేసారు.

ఇక వీరి రచనా వ్యాసంగం విషయానికి వస్తే అది రాశిలో చిన్నదైనా వాసిలో మిన్న అని చెప్పితీరాలి. 2006లో "అవగాహన" అనే శీర్షికతో 23 సాహిత్య వ్యాసాల సంకలనాన్ని వెలువరించారు. ప్రతి వ్యాసంలోను ఆయన లోతైన పరిశీలన-పరిశోధన దృక్పథాలు వ్యక్తమవుతాయి. చేరా, కట్టమంచి, రాళ్ళపల్లి, విశ్వనాథ, జలసూత్రం, తాపీ ధర్మారావు, ఇస్మాయిల్, విశ్వంభర, హైకూ, పేరడీ, విప్రతీపం వంటి మంచి విశ్లేషణాత్మక వ్యాసాల సంపుటి ఇది. అయితే "భిన్న రుచిర్హి లోక:" అన్నట్లు నాకు ఇందులో "విప్రతీపం" "తాతయ్య నేర్పిన పద్యాలు" అనే రెండు వ్యాసాలు చాలా బాగా నచ్చాయి. "ఐరనీ" అనే ఆంగ్లపదానికి బ్రౌణ్యనిఘంటువు వక్రోక్తి, నిందా స్తుతి అనే అర్థాల్ని సూచిస్తే, ఆ అర్థాలలో కొంత అవ్యాప్తి దోషం కనిపిస్తోందని, ఐరనీకి విప్రతీపం అనే పదం సరిగ్గా

నరిపోతుందని చెప్పి ఆ విప్రతీపంలోని భేదాల్ని ఉదాహరణలతో చాలా చక్కగా వివరించారు. అలాగే తాతయ్య నేర్పిన పద్యాలలో అసలు, పద్యం మీద ఇష్టత, ప్రబంధాన్ని వ్యాఖ్యానాలతో సహా ఔపోశన పట్టటం, తనకు ఎలా అలవాటయ్యాయో వివరించారు. ఎమ్.ఏ., చదువుకొనే రోజుల్లో వంతరాం రామకృష్ణారావు గారు, అమరేశం రాజేశ్వర శర్మగారి పాఠాలు ఎలాంటి ప్రేరణనిచ్చాయో చెప్పారు. అంతకంటే ఎక్కువగా తన సహాధ్యాయులతో చర్చల ద్వారా, వారికి తరచుగా పాఠాలు బోధించటం ద్వారా లాభపడ్డానని ఈ వ్యాసంలో రెంటాల తన విద్యార్థి దశను గూర్చి స్మరించుకొన్నారు.

రెంటాలకు సాహిత్యంలో హాస్యం, అధిక్షేపం, విప్రతీపం, వంటివన్నీ చాలా ఇష్టం. అందుకే 2010లో "నవ్వు మొహం" అనే హాస్యరచనలు చేసారు. గూడవల్లి నాగేశ్వరరావు గారి ప్రేరణతో విశాలాంధ్రకు రాసిన హ్యూమర్ ఫీచర్స్ ఇవి. తరువాత ఎమెస్కో వారు వీటిని అచ్చువేయించారు. రెంటాలను మామూలుగా చూస్తే కొంచెం సీరియస్ రచయితగా అనిపిస్తారు. కాని ఇందులో ప్రతిఅక్షరం వారి హాస్యప్రియత్వానికి అద్దం పడుతుంది. నటులు, సుశిక్షితులు కాకుండా నాటకాలువేస్తే ఎన్ని అవస్థలు పడాల్సివస్తుందో "పిచ్చివేషాలకథ" అనే వ్యాసంలో ఎంతో హ్యూమరస్‌గా చెబుతారు. పైగా వ్యాసంలో కొసమెరుపు భలే ఉంటుంది. అలాగే ఎలక్షన్స్‌లో ప్రిసైడింగ్ ఆఫీసర్ పడే అవస్థల్ని, సందిగ్ధతల్నీ "ఎలక్షన్ విశేషన్లు" అనే వ్యాసంలో హాస్యాన్ని జోడిస్తూ చెప్తారు. ఇక చివర్లో "వేలు" అనే నాటిక ఆద్యంతం అద్భుతమైన హాస్యంతో తొణికిసలాడుతుంది.

ఇక రెంటాల చాలా పొదుపైన కవి. 2011లో "పిట్టలకాలనీ" అనే శీర్షికలో ఒక చక్కని హైకూ సంకలనాన్ని వెలువరించారు. "అల్పాక్షరముల అనల్పార్థరచన" అన్నమాట ఈ హైకూ కవిత్వానికి బాగా సరిపోతుంది. అయితే రెంటాల విషయంలో ఈమాట ఆయన రచనలన్నిటికీ సరిపోతుందనాలి. ఆయన ఉపన్యాసానికైతే మరీ సరిపోతుందని చెప్పితీరాలి. ఇందులో మొత్తం 163 హైకూలు ఉన్నాయి.

సాధారణంగా పిల్లిపిల్లల్ని గాని, కుక్కపిల్లల్ని గాని మనం మచ్చిక చేసుకొంటాం. కాని ఆయన "ఆ పిల్లిపిల్ల.. ప్రేమతో..మమ్మల్ని మచ్చిక చేసుకొంది" అంటారు. అలాగే మన సొంత ఊరు ఒకటి ఉంటుంది. మనం ఉద్యోగార్థం వేరే ఊర్లో సెటిల్ అవుతాం. అనుకోకుండా మన ఊరి బస్సు ఎదురైతే ఎలా ఉంటుందో చెపుతూ "మా ఊరి బస్సు ఎదురై... మనస్సునెక్కించుకొని వెళ్ళిపోయింది" అంటారు. చిన్నపిల్లల్తో వెడితే బజారు ఎలా ఉంటుందో చెపుతూ "పాతబజారే...పసివాడితో వస్తే..ఎంత కొత్తగా ఉంది" అంటారు. ఏ ఇంటికైనా ఓ చక్కని చెట్టూ దానిపై వ్రాలే పక్షులూ ఉంటే ఎలా ఉంటుందో చెపుతూ "మేం ఒంటరిగాలేం.. మా ఇంటి పక్క చెట్టు...ఓ పిట్టల కోలనీ" అంటారు. ఇలా తటిల్లతల్లాంటి హైకూలు ఇందులో కనిపిస్తాయి.

ఇక డా॥ రెంటాల 2012లో "లోపలికి" అనే శీర్షికతో 17 వ్యాసాల సంకలనాన్ని తీసుకువచ్చారు. ఇందులో సాహిత్యం ఎందుకు? అంటూ మొదలు పెట్టి, పానుగంటి, కొ.కు. శేషేంద్ర, గోర్కీఅమ్మ, నారాయణభట్టు, నన్నయ, ఆముక్తమాల్యద తిలక్, హైకూ, ఉపన్యాసం ఒక సాహిత్య ప్రక్రియ, వంటి వ్యాసాలు మొదలుపెడితే మనల్ని, కూడా లాక్కుపోతాయి.

ఇందులో చివరి వ్యాసంలో ఉపన్యాసాన్ని కూడ ఒక సాహిత్య ప్రక్రియగా అంగీకరించి తీరాలంటారు రెంటాల. ఎందుకంటే ఒక ఉపన్యాసం పుస్తక పఠనానికి ప్రేరేపించి శ్రోతను సాహిత్య పాఠకుడిగా తయారు చేయవచ్చు. ఒక ఉపన్యాసం ఏదైనా ఒక మంచి రచన చెయ్యటానికి పురికొల్పవచ్చు. ఒక ఉపన్యాసం గొప్ప కథనో, నవలనో చదివితే కలిగే సాహిత్యానుభవాన్ని ఇవ్వవచ్చు. కాబట్టి ఉపన్యాసం కూడ ఒక సాహిత్య ప్రక్రియ అంటారు వీరు.

ఇక 2015లో "ఆధునిక తెలుగు సాహిత్యంలో అధిక్షేపధోరణులు" అన్న వీరి పిహెచ్.డి., సిద్ధాంత గ్రంథాన్ని విశాలాంధ్ర వారు ప్రచురించారు. ఇది 1992లో తెలుగు విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథం. దీనికి ఉత్తమ సిద్ధాంత గ్రంథంగా తూమాటి దోణప్ప స్వర్ణపతకం కూడా లభించింది. 1980ల మధ్య వరకు వచ్చిన అధిక్షేప రచనల విశ్లేషణ ఇందులో కనిపిస్తుంది. అధిక్షేప స్వరూపస్వభావాల విశ్లేషణ, దాని పరిమితులు, ప్రభావాలు, అధిక్షేపానికి వస్తువు, సాధనాలు, స్వరం-వీటన్నిటినీ ఉదాహరణలతో ఈ గ్రంథంలో సమన్వయం చేసిచూపారు.

ఇక 2017లో పదవీవిరమణ సందర్భంగా వీరు వెలువరించిన మరొక వ్యాస సంకలనం "ఒలుపు". ఇందులో

మొత్తం 20 వ్యాసాలు. ఇవన్నీ కవిత్వం, విమర్శ, హాస్యం, జానపదం, స్మృతివ్యాసాలు, పరిచయం, కథ, నాటకం, కన్యాశుల్క ప్రభావం–ఇలా విభిన్న అంశాలకు చెందిన వ్యాసాలు ఉన్నాయి. వ్యాసాలన్నీ నిజంగానే విషయాన్ని ఒలిచి మనముందు పెట్టినట్లు ఉంటాయి.

ఇక ఇవన్నీ ఒక ఎత్తైతే వారి హృదయంలో నుండి సుస్వరంగా వెలువడిన తెలుగు గజల్స్ ఒక ఎత్తు. వీరు రాసిన గజల్స్, గీతాలు కలిపి 2017 అక్టోబర్‌లో "రెంటాల గజళ్ళు, –గీతాలు" మంత్రశాల–అనే శీర్షికతో ఒక పుస్తక రూపంలో వెలువడ్డాయి.

*"నాన్న నాకు చొక్కా తొడగడమే తెలుసుగాని,*
*కనిపించని కవచమొకటి కడుతున్నది తెలియలేదు"*

అంటూ నాన్నపై రెంటాల రాసిన గజల్ ఎంతకరడుగట్టిన కొడుకునైనా కదిలించకమానదు. ఈ గజల్ రెంటాలను విశ్వవ్యాప్తకవిని చేసింది. కోట్లమంది అభిమానుల్ని సంపాదించి పెట్టింది. అలాగే నిరంతరం వెన్నంటి ఉండే ఇల్లాలు పుట్టింటికి వెళితే ఆ ఇల్లు ఇల్లులా ఉండదని వాపోతూ రాసిన గజల్, "నమ్మదగిన మనిషేడీ అమ్మతప్ప" అంటూ అమ్మపైన రాసిన గజల్, అలాగే 'వాన' పైనా 'చలి' పైనా "ఎండ" పైనా, "చదువు కొనేరోజుల ముచట్ల పైనా", " ప్రేమ" పైనా–ఇలా మానవ సంబంధాలన్నిటిపైనా, మనసును తడిమే ప్రకృత్యంశాలపైనా చాలా చక్కని గజల్స్ రాసారు రెంటాల.

ఇక రెంటాల గొప్ప ఉపన్యాసకులు. ఏ అంశంపై ప్రసంగిచాలన్నా లోతైన ప్రిపరేషన్‌తో వెళతారు. నిరంతరం ఎన్నో ప్రసంగాలు చేస్తున్నా ప్రతి ప్రసంగాన్ని ఒక పరీక్షగా ఫీలవుతారు. ఇక ప్రసంగం మొదలుపెడితే శ్రోతను తన కూడా తీసుకెళ్ళిపోతారు.

వీరు మధునాపంతుల వారి ఖండకావ్యాలపై చేసిన ప్రసంగాన్ని మధునాపంతుల ట్రస్ట్ వారు 2015లోనే ఒక 30 పేజీల పుస్తకంగా ప్రచురించారు. వీరి చాలా ప్రసంగాలు వివిధ వ్యాససంకలనాలలో నిక్షిప్తమై ఉన్నాయి.

రెంటాల ఏదైనా ఒక గ్రంథానికి రాసిన ముందుమాట కూడా భలే విలక్షణంగా ఉంటుంది. మూసపోసినట్లు ఒకే పద్ధతిలో ఆయన ముందుమాటలుండవు. ముందుమాటలు, సమీక్షలు, అంతో ఇంతో రాగద్వేషాలకు అతీతంగా ఉండాలి. శ్రీ బొల్లోజుబాబా "కవిత్వభాష" పుస్తకానికి ముందుమాట రాస్తూ అందులో తనకి నచ్చిన అంశాల్ని సూచిస్తూనే 'అండర్‌స్టేట్‌మెంట్' వంటి కొన్ని అంశాలలో విభేదించారు. అవసరమైతే అలా విభేదించాలి కూడా. బాబా గారు కూడా సహృదయతతో ఆయన ఖండించిన అంశాల్ని తొలగించకుండా యదాతథంగా అలాగే ఉంచేసారు.

ఇక రెంటాలలో చాలామందికి అంతగా తెలీని మంచి పద్యకవి కూడా దాగి ఉన్నాడు. ఆయన పద్యం ఎంతో హృద్యంగా, పటిష్టంగా ఉంటుంది. మచ్చుకి తెలుగు భాషను గూర్చి ఆయన రాసిన ఒక చిన్న కందపద్యం.

*"పలుకిచ్చితి తలపిచ్చితి*
*కలలిచ్చితి విచ్చితి వెరకయు నూహాయు రె*
*క్కలుగా నెగయగ తల్లీ!*
*తెలుగూ! నీ ఋణము మేము తీర్చగలమటే"*

అంటూ ఎంతో అందంగా రాసారు. అప్పుడప్పుడు ఇలా వీరి కలం నుండి పద్యాలూ వెలువడు తుంటాయి.

ఆయన పూర్తిగా అటువైపు వెళ్లిపోయి ఉంటే చేయితిరిగిన పద్యకవుల సరసన చేరేవారు. కానీ కాలనిర్ణయం అదికాదు. అందుకే ఆయన విభిన్న రచనలతో సంప్రదాయ ఆధునిక కవులందరి హృదయాలలోను చోటు సంపాదించుకొన్నారు.

ఇక రెంటాల ఇటీవలే "అయిన్ రాండ్" రాసిన "ఫౌంటెన్‌హెడ్" అనే పెద్ద నవలని చక్కని తెనుగులోనికి అనువదించారు. రోజుకు నాలుగైదు గంటలపాటు కూర్చుంటే సుమారు కొంచెం అటూ ఇటూగా సంవత్సరకాలం పట్టింది ఈ అనువాదానికి. అనువాదమంటే ఆషామాషీకాదు. అందులోను 75 ఏళ్ళుగా ఎందరో పాఠకులు చదువుతోన్న నవల ఇది. 20కి పైగా భాషలలోకి వెళ్ళిన నవల. 70 లక్షల ప్రతులను మించి అమ్ముడుపోయిన నవల. కాలాలు, దేశాలు దాటి వచ్చిన నవల. 845 పేజీల ఈ నవలను రెంటాల ఎంతో ఓపిగ్గా, శ్రద్ధగా అనువదించారు. ఈ నవల రెంటాలను తప్పక గొప్ప అనువాదకుడిగా సాహితీ లోకంలో ఉన్నత శిఖరాగ్రాన అధివసింప చేస్తుంది.

ఇలా రెంటాల ఒక మంచికవిగా, విమర్శకునిగా, వక్తగా, అనువాదకునిగా, అధ్యాపకునిగా, వీటన్నిటికి మించి స్నేహానికి ప్రాణంపెట్టే ఒక మంచి వ్యక్తిగా మనకి కనిపిస్తారు. అందుకే వారి సాహిత్య–వ్యక్తిత్వాలలో, సాహిత్యం కంటే కూడా ముందుగా వారి వ్యక్తిత్వమే నాకెక్కువ ఇష్టం అవుతుంది. నాకే కాదు ఎవ్వరికైనా అంతే! ◆

# కొండిగాడు

- డా॥ తవ్వా వెంకటయ్య
9703912727



తిరుపతి ఆస్పత్రిలో చికిత్స పొందుతూ కొండిగాడు చనిపోయినట్లు ఊరంతా తెలిసింది. వారం రోజుల కిందట తమ ఊర్లో నుండి పక్కఊరికి పుల్లలు కొట్టడానికి పోతా పోతా టీవీఎస్ స్కూటరు ప్రమాదానికి గుర్రై నోటిగుండా నెత్తరొచ్చింది. కడపకు తీసుకొని పోయినారు. అక్కడ వాళ్ళు కాదంటే తిరుపతికి తీసుకొని పోయినారు. అక్కడ చేరినాక బాగానే ఉందని చెప్పినారు. అది తెలిసినప్పుడు ఊర్లో చాలా మంది ఊపిరిపీల్చుకున్నేరు. మన కొండిగానికి బాగానే ఉందంటలే పరవాలేదు అని అందరూ చెప్పుకుంటా ఉండిరి. ఇంతలేకే పిడుగులాంటి వార్త ఊరంతా పాకిపోయింది. పాపం కొండిగాడు అని కొందరు, ఒరేయ్ కొండిగాడు లేకపోతే ఎట్టరా అనేటోల్లు కొందరు. తవ్వారుపల్లెలో ఈ కులము ఆ కులము అనకుండా అందరి నోళ్లలో నాలుక లాగా ఉండినాడు కొండిగాడు.

అసలు పేరు కొండయ్య నలుగురి బిడ్డల తండ్రి. సుమారు అరవై సంవత్సరాల వయసు. చదువు అచ్చరం ముక్క రాదు. పూర్తిగా వ్యవసాయ కూలీ. వంశపారంపర్యంగా వచ్చిన ఎట్టితనం .తండ్రి నుంచి వచ్చిన రెండు ఎకరాల భూమి . ఇదే బతుకుదెరువు. భూమి సాగు సేచ్చడు. రైతులకు పనికి పోతడు. ఇంటి రైతులకు వెట్టితనం సేచ్చడు. ఆడబిడ్డకు పెళ్లి చేసినాడు. మిగిలిన ముగ్గురు మగపిల్లల్ను సదివించుకుంటాండాడు. పెద్ద కొడుకు హైదరాబాదులో గ్రూప్ టు శిక్షణ తీసుకుంటాండాడు. మరొకడు ఎం.సి.ఏ చదువుతున్నాడు. ఇంకొకడు పాలిటెక్నిక్ చదువుకుంటాండాడు. కొండిగాడు బతికుండగా ఇంటి రైతులకు ఎట్టితనం సేచ్చాండే. వాళ్ళు సచ్చిపోతే వారికి గుంతలు తీచ్చండే. వారి ఎనుములు సచ్చినా, కుక్కసచ్చినా దాంటను తీసకపోయి ఊరావతల పారేచ్చండే. ఊళ్ళో ఎవరికైనా ఒళ్ళు బాగా లేకపోతే దిగదీచ్చండే. వామిదొడ్లో పనికి పోతండే. నీరుగట్టు పనిసేచ్చండే. ఇప్పుడు ఆ పనులన్నీ ఎవరు సేచ్చారూ. అందుకే వీళ్లందరి దిగులు. కొండయ్య బాగా తాగుబోతు. కడుపారా మందు తాపి కొంత లెక్క చేతిలో పెడితే ఏ పని సేచ్చడు. ఇది అందరికీ తెలిసిన సత్యం. అందుకే చీటికిమాటికి ఏ పని అవసరమైనా కొండయ్య దగ్గరికి వస్తారు అందరూ .

ఒక తూరి ఊర్లో అంకాలమ్మ తిన్నాల రోజు ఇంటి రైతు సుబ్బారెడ్డి అంకాలమ్మ కు మొక్కుబడిగా దున్నపోతును వదిలినాడు. దున్నపోతును అంకాలమ్మకు బలి ఇచ్చే ఒక రోజు ముందు రాత్రి సుబ్బారెడ్డి కొండయ్య ఇంటికాడికొచ్చి "ఏరా కొండిగా రేపు మీరంతా సీకట్లోనే( వేకువ) ఇంటికి రావాల్రా అని చెప్పి పోయినాడు. తన ఇంటి రైతు అంకాలమ్మ కు దున్నపోతును మొక్కుబడిగా వదిలినాడని సంవత్సరం కిందటే కొండయ్యకు తెలుసు. దాంతో తోటి మాలలకు తలా

ఎనిమిది సేర్లు పోను మిగిలిన సియ్యలన్నీ ఆరేసుకోవచ్చని ఎంతో సంబరంతో మునిగినాడు. రాత్రంతా నిద్ర పోలె చుట్టాల అందర్నీ పిలిచినాడు. రాత్రి రెండు గంటలప్పుడు కోడిని పట్టుకొని కోసినాడు. తన పెళ్ళాన్ని లేపినాడు. ఏయ్ లేయ్యే తెల్లవారి పోతంటే ఇంకా నిద్రేనా? లేచి కోడి సియ్యల కురాకు సెయ్. పోయి దున్నపోతును పట్టుకొని రావాల. గమ్మున నిద్రపోవడానికేనా పండగొచ్చింది .. లేచి చెయ్ అని పెళ్ళాన్ని నిద్ర లేపి, బొడ్డులో ఉన్న మందు సీసా తీసి సెమ్ములో పోసుకొని నీళ్ళు కలుపుకొని గుటగుటా తాగె. పగలంతా పని చేసి వచ్చిన కొండయ్య పెళ్ళాం దేశమ్మ ఏందిబ్బా నీ రొప్పట. రోంతన్న తెల్లవారనీ. నీ పంపరా నీదేనా. మనసల్లు రోంతసేపన్నా నిద్రపోనియ్యవే నీ పాసుగుల సేచ్చలే సించ్చుకుందువు. అని ఆదరాబాదరా కోడికురాకు పొయ్యినేసింది. రోంతసేపు ఉడుకుతానే ఉడికి ఉడకని కురాకు తెల్లెలో బేసుకొని ఆ కైపు మోపున పీకల కాడికి తిన్నేడు కొండయ్య.

అప్పటికి నాలుగు గంటలయింది. ఇంకా నమాజ్ కూడా నదవలేదు. ఎట్టిమాలల ఇంటి కాడికి పోయి ఎట్టిమాల్లోల్లనందర్ని నిద్ర లేపినాడు. రేయ్ రమణ లేయ్యి రా సోమి సుబ్బాడ్డి ఇంటి కాడికి పోయి దున్నపోతును పట్టుకొని రావాల, అని తన చిన్నాన కొడుకును లేపినాడు. తన మేనత్త కొడుకు ఇంటి కాడికి పోయి తూటు మామ లెయ్యి, నువ్వే ఇంతసేపు పండుకుంటే ఎట్టబ్బా. లేయ్యి మామ బెన్నె పొద్దు పోతది అని చెప్పి, ఎనిమిది మంది ఎట్టి మాలలను లేపి తనవెంట తోడుకుని తెల్లవారేటప్పటికల్లా సుబ్బారెడ్డి ఇంటి కాడికి పోయినాడు .అప్పటికే సుబ్బారెడ్డి పెళ్ళాం లేసి బోనం కుండ సిద్ధంగా చేసింది.

పలకలు(తప్పెట) వాయించే వాళ్ళు వచ్చినారు. సుబ్బారెడ్డి ఇంటి యాప చెట్టుకు కట్టిన దున్నపోతును ఇప్పి పగ్గాలు వేసి గట్టిగా కట్టినారు. ఎనిమిది మంది ఎట్టి మాలలు బిర్రుగా పట్టుకున్నారు దున్నపోతు పారిపోకుండా. సుబ్బారెడ్డి భార్య బోనం కుండ భుజాన్ని పెట్టుకున్నేది. ఇంటిల్లిపాది బయలుదేరినారు. ఎట్టిమాలలు పలకలు వాయించుకుంటూ ఊలలు, కేకలు, డాన్సులు చేసుకుంటా వీధి గుండా బయలుదేరి తూర్పు చేలల్లో జమ్మిచెట్టు కాడికి పోయినారు.

సాకలి గుర్రప్ప చిన్న కొడుకు వేట కొడవలి తీసుకొని దున్నపోతు తలకాయను ఒక్క దెబ్బకు తెగ నరికినాడు. సుబ్బారెడ్డి పొట్టేలును కూడా అంకాలమ్మ కు బలి ఇచ్చినాడు.

అంకాలమ్మకు బలి ఇచ్చిన దున్నపోతును ఎట్టిమాలలు అందరూ కలిసి దున్నపోతు కాళ్లకు తాళ్లు కట్టి పెద్దబదెలు దున్నపోతు కాళ్ళ సందులో నుంచి దూర్చి భుజాలకెత్తుకొని బరువుగా ఇంటికి తెచ్చినారు. పొట్టేలును సుబ్బారెడ్డి ఇంటికి తీసుకపోయినారు సాకలోళ్ళు.

అంకాలమ్మ కాడ నుంచి తెచ్చిన దున్నపోతును కొండయ్య ఇంటికాడ తుమ్మ చెట్టు కింద పడేసినారు. కత్తులను ఇసుక రాయి మీద నూరి బాగా పదును ఎక్కించారు. ఎనిమిది మంది ఎట్టి మాలలు కాక మరి కొందరు దున్నపోతు చుట్టూ గుమిగూడి ఉన్నారు. నలుగురు నాలుగు వైపుల దున్నపోతు కాళ్లు పట్టుకొని చర్మం ఒలిచి జబ్బలు తీసి పక్కన పెట్టి, ఓ గంట కల్లా సియ్యలు కువ్వ పోసినారు. ఎనిమిది మంది మాలలకు తలా ఒక సేరు సియ్యలు పోగా మిగిలిన దున్నపోతు కూరనంతా కొండయ్య తన బంధువులతో కలిసి ఒరికిళ్ళు కోసి దండెలు దండెలుగా ఆరేసినాడు.

కూర పొయ్యికెక్కించింది కొండయ్య భార్య. మాలలంతా ఎవరింటికి వాళ్ళు పోయినారు. కొండయ్య ఒక్కడే దున్నపోతు తల కోచ్చుందు. ఇంతలో ఇంట్లో ఫోన్ మోగింది. బ్బా ....బ్బీవ్ ఫోను అరుచ్చుంది . సూచ్చురా అని చెప్పింది కొండయ్య భార్య. నేను పనిసేచ్చుండగదే ఊరుకుండానా ఇట్ల దెంకోనిరా మాట్లాడతా ఎవరో.. అని బిస్సగా దున్నపోతు తల కోస్తా రొప్పుతా చెప్పినాడు కొండయ్య.

ఫోన్ తీసుకచ్చి కొండయ్య కిచ్చింది భార్య.

అలో.. అలో... ఎవరుబ్బా.. ఏందిరా దీనేమ్మ ఈ సెల్లు ఇనపడే సావదు. అలో ...ఆ ఏంరా పెద్దోడా బాగుండావా? తిన్నాలకు రమ్మంటే రాకపోతివి సుట్టాలంతా వచ్చినారు. నువ్వు లేకపోతే ఎట్టనో ఉంది. మీయమ్మ గూడా దిగులుగా ఉంది. ఆడ నువ్వు ఈడ మేము. ఏం తింటాండావో.. ఏం తినలేదో . ఏమి ఇయ్యాలప్పుడు ఫోన్ చేసినావే. ఏమన్నా అవసరంగా ఉందా అని అడిగినాడు. లెక్క పంపియాల్నా ఎంత ? మూడువేల రూపాయలా పంపిచ్చులే. ఈ రోజో రేపో పంపించ్చులే. బాగా సదువుకో నామాదిరి మీరు పని సెయ్యలేరు. నాకంటే సదువు గిదువులేదు. మీరు బాగా సదువుకోవాల ఈ మాలా మాదిగ కట్టం మీ వల్ల కాదురా. అని చెప్పి ఉంటా పని శానా ఉంది. అని ఫోను పెట్టేసినాడు.

యేయ్ పోను తీసకపోయి ఇంట్లో పెదుదురా అని పిలిచినాడు పెళ్లాన్ని కొండయ్య. ఎవరుబ్బా ఫోన్లో అని అడిగింది భార్య. ఎవరే మనోడే పెద్దోడు లెక్క కావాలంట

మూడు వేలు. తీసుకొని వచ్చి పంపిచ్చా, అని అదారాబాదరా సియ్యలు కోసే పనిని పక్కన పెట్టి ఊళ్ళోకి పోయినాడు. నాగిరెడ్డి ఇంటి దగ్గరికి పోయి ఆయన భార్య బయట ఉంటే మ్మా నాగిరెడ్డి లేదూ అని అడిగాడు. కొండయ్య మాట వినగానే ఇంట్లో నుండి నాగిరెడ్డి బయటకు వచ్చి ఏమి రా ఇంతలేకే మొదలు పెట్టినవా తాగేది అని మందలింపుగా పలకరించినాడు. అది కాదు బ్బా ఒక మూడు వేల రూపాయలు లెక్క కావాల నా పెద్ద కొడుక్కు అవసరంగా ఉంది. ఫోన్ చేసినాడు, బువ్వపెట్టే హాస్టల్లో కట్టాలంట సర్దుబాటు చేయిబ్బా. నేను పనికి వచ్చి సెల్లుపెడతాలే అని అడిగినాడు. యాడుంది రా లెక్క. పత్తి అడిగే నా కొడుకు లేదు. ఒడ్లు అన్నీ అట్టనే ఉండాయి. యాడుంది లెక్క. యాడన్న చూసుకోపో తర్వాత ఇచ్చా అని ఉత్త చేతులు చూపించినాడు. సరేలే బ్బా లేకపోతే నువ్వగంగ ఏం సేచ్చవ్. ఉంటే ఇచ్చేవానివే. అని సెంచిరెడ్డి ఇంటికి పాయ. సెంచి రెడ్డి కొండయ్య ముఖం సూచ్చానే ఏమి రా ఇట్ట వచ్చినావు పనులన్నీ అయిపోయినాయా అని అడిగాడు. అది కాదు బ్బా నీతో పని ఉండి వచ్చినా అన్నాడు. నాతో ఏం పని రా. ఓ మూడు వేలు లెక్క కావాలా నా పెద్ద కొడుకు అయిదాబాదులో ఉన్నాడు. వానికి పంపియాలా. యాడ ఉందిరా లెక్క. దిక్కు తెలియక సచ్చంటే. ఎప్పుడూ లెక్క లెక్క అంటాంటావు. రేపు వారంలో ఇచ్చలే. మొన్ననే ఓ పది వేలు ఉంటే పొట్టేలు పట్టుకొని వచ్చినా మల్లా లెక్కొట్టొచ్చది. అని ఆయప్ప ఊరికినే పంపించా. అట్ట అయిదారు మందిని అడిగా ఏ ఒక్కరూ ఇయ్యలా. అందరూ మా దగ్గర లేదు, మా దగ్గర లేదు అన్నేరు. ఇంటికి వచ్చా వచ్చా వీరారెడ్డి దగ్గరికి పోయినాడు. రెడ్డి మంచం మీద కూర్చొని అప్పుడే సియ్యలు తింటా ఉండి కొండయ్య మొఖం చూడగానే రా రా కొండిగా సియ్యలు తిందూరా అని పిలిచే ప్రేమగా. కొండయ్య నెత్తిగీరుకుంటా నాకేం వద్దులేబ్బా ఇంటి కాడ సుబ్బాడ్డి వదిలిన మాంచి దున్నపోతునుకోసినా సియ్యలకు కొదవలేదు. ఈ పొద్దు నీతోనే పని ఉండి వచ్చినా ఈరారెడ్డి . ఏం పని చెప్పు రా అడిగిన వీరారెడ్డితో మూడు వేలు లెక్క కావాలబ్బా అన్నాడు. వీరారెడ్డి ఏదుందిరా లెక్క సరేలే. మాటాంతు రా తీసుకొని పోదు అని చెప్పినాడు. దాంతో కొంత నిమ్మలపడి. ఇంటికి వచ్చా వచ్చా బాలిరెడ్డి అంగడిలో ఒక క్వార్టర్ మందు తీసుకొని ఇంటికి వచ్చి తాగినాడు. కడుపారా తిన్నేడు. పడ్డుకుని పొద్దుమాటేంతుగా వీరారెడ్డి ఇంటికి పోయినాడు. వీరారెడ్డి బాండు రాయించుకొని మూడు వేల రూపాయలు చేతిలో పెట్టాడు. సంబరంగా ఇంటికి తీసుకుని వచ్చి వేరే వాళ్లకు చెప్పి ఆ లెక్కను తన పెద్దకొడుకు పంపించినాడు. పెద్ద కొడుక్కు ఫోన్ చేసి నాయనా నీకు లేక్క పంపించినా చూసుకో .రేపు వారం ఇంటికి రారా నిన్ను చూడ బుద్ధి అయితాంది. వట్టి తునకలుండాయి. బాగా చేసుకుని తిందువు గాని ఇంటికి రా అని పిలిచినాడు . సందకాడ అందరూ పండుకున్యాక కొండయ్య ఒక్కడే లేసి పెళ్ళాన్ని బువ్వ పెట్టమని సెప్పినాడు. పెళ్ళాం గిన్నె నిండా పెట్టిన సియ్యలకూర బువ్వా కడుపారా తిని కళ్ళలో నుండి కన్నీళ్ళు రాల్చినాడు. ఎందుకుబ్బా ఏడుచ్చండవు అని అడిగింది భార్య. ఏం లేదే అబ్బికి లెక్క పంపియ్యడానికి ఊరంతా తిరిగినా ఎవరు ఒక రూపాయి ఇయ్యలా. ఆ ఈరారెడ్డి కాళ్లుకడుపు పట్టుకుంటే మూడు వేలు ఇచ్చినాడు. అందరికీ పని చేసినా నా అక్కరకు ఒక్కరంటే ఒక్కరు కూడా ఆదుకోలేదు. ఆ ఈరారెడ్డి తప్ప. నేను చచ్చిపోతే మీ బతుకెట్టా అని కళ్ళ నీళ్ళు పెట్టినాడు. కొండయ్య భార్య కూడా ఏడుస్తూ.. ఏంది మాటలుబ్బా అయ్యి తిని పండుకో ఏం కాదు గాని మన రెడ్లే సాయం సేచ్చారు. అని ధైర్యం చెప్పింది. వారం దినాలు గడిచిన తర్వాత పెద్దకొడుకు ఇంటికి వచ్చినాడు. మధ్యాహ్నం పూట ఒట్టిముక్కలకూర, సంగటి చేసుకొని అందరు తిన్నారు. కొడుకు నిద్రపోతుంటే లేపి నాయనా నేను సుంకేసులకు పుల్లలు కొట్టడానికి పోతాండా మాటాంతు వచ్చా, అని చెప్పి బయలుదేరినాడు టీవీఎస్ స్కూటర్ లో.

కొండయ్య పెళ్ళాం కొండయ్యను ఆపి నీకు మోటర్ సైకల్ శాతకాదు కదా వాళ్ళ స్కూటర్ ఎందుకు తెచ్చుకున్నేవుబ్బా అనింది. ఆ సుంకేసుల అయ్యప్ప ఇచ్చింటే తీసకచ్చినా. ఏం నాకెందుకు చేతకాదు సైకిల్ తొక్కుతాన్లా బాగానే. అట్టనే ఇదీ. అని తన భార్య చెప్తున్నా లెక్కచేయకుండా మూడు అమ్ములు మందు తాగి స్కూటర్ ఎక్కి బయలుదేరినాడు కొండయ్య. బయలుదేరిన రోచ్చేపటికి ఎవరో పరుగుపరుగున కొండయ్య భార్య దగ్గరకు వచ్చి ఓమ్మా నీ మొగుడు స్కూటర్ నుంచి కింద పడినాడని చెప్పినారు. ఆమె బోరుమని మొత్తుకుంటా తన కొడుకులను, తన బావ కొడుకులను పంపించింది. అటు నుంచి అటే కడపకు తీసుక పోయినారు. ఆడ కాదంటే తిరుపతికి తీసుకపోయినారు. అప్పుడు పోయినోడు పానంతో వచ్చాడనుకుంటే శవమై తిరిగి వచ్చుండాదు నాయనా... మాకు ఇంగదిక్కెవరు, తండ్రో... అని గుండెలు పగిలేలా ఏడుస్తోంది.

## కవిత

# మనః దర్పణం

- సింగారపు రాజయ్య
9945744332

అద్దం మీద దుమ్మూ ధూళి చేరి
ప్రతిబింబం సరిగా కనబడనట్టు
మనోదర్పణంపై కూడా అపుడపుడు
అపార్థాల మరకలు చేరి మనుషుల
ప్రతిరూపాలు మసకగానే అగుపిస్తాయి.

మనసులోని అపార్థాల తెరల
మాటునుండి
చూసినప్పుడు అవతలి వ్యక్తి మూర్తిమత్వం
లోపభూయిష్టంగానే కనబడుతుంది.

అపార్థాల తెరలకు తోడు కళ్ళకు అహపు
నల్ల చలువ కళ్ళజోళ్ళు కూడా జోడైతే
మరకల లోతు పెరిగి మొండిగా మారి
ప్రతిరూపం అస్పష్టమై
వ్యక్తి ఉనికే ప్రశ్నార్థకమౌతుంది.

స్నేహ బంధమైనా



రక్త సంబంధమైనా
సంభాషణ వస్త్రంతో తరచుగా
తుడుస్తుంటేనే మనోదర్పణం
తేటతెల్లమౌతుంది.
మరకలు తొలగి
అరమరికలు లేని ప్రతిబింబం
ఆవిష్కృతమవుతుంది.

మనము బెట్టు విడిచి మెట్టు దిగి
మాటల చేతులు చాచినా
అవతలి వ్యక్తి అందుకోకపోతే
మనసుకు మనసుకు నడుమ
దూరం తరగదు
మనిషికి మనిషికి మధ్య
బంధం బలపడదు ◆

---

సాయంత్రానికి కొండయ్య శవాన్ని ఇంటికి తీసుకు వచ్చినప్పుడు ఊరి రైతులందరూ గుమిగూడి వచ్చినారు. అందరూ కొండయ్య భార్యపిల్లలకు ధైర్యం చెప్పినారు. ఏమీ కాదులేమ్మీ మేము ఉండాముకదా భయపడద్దు లే అని ధైర్యం చెప్పినారు. వారందరి మాటల వల్ల గుండె దిటం చేసుకున్నేది దెశమ్మ.

దినాలు అయిపోయినాయి. కొడుకులు ముగ్గురు ఇంటి దగ్గరే ఉంటారు. కొండయ్య భార్య తన పెద్ద కొడుకు తో హైదరాబాదు బోయి చదువుకో నాయనా అని చెప్పింది. పోతా లేమ్మా అని చెప్పి ఓ నెల రోజులు ఇంటి దగ్గరే ఉన్నాడు. ఒకరోజు పొద్దున్నే అందరు నిద్రలెయ్యందే వీరారెడ్డి ఇంటి కాడికి వచ్చినాడు. మీ్మ దెశమ్మా అని గట్టిగా పిలిచినాడు. ఏంబ్బా ఇంతపొద్దన్నే వచ్చినావు అనింది. ఏం లేదుమ్మీ ఎనుము సచ్చిపోయింది. అది పడేయ్యాలా ఎవరినన్నా పంపియ్యి అని చెప్పి పోయినాడు. ఇన్నాళ్లు తన మొగుడు ఇట్టాంటియన్నీ చూసుకుంటా ఉండే. ఇప్పుడు ఏమి చేయాలో దిక్కుతోచక నిద్రపోతున్న తన పెద్ద కొడుకును నిద్ర లేపింది. నాయనా ఈరారెడ్డి ఎనుము సచ్చిపోయిందంట ఎనిమిదిమంది ఎట్టిమాలోల్లను తీసుకొనిపోయి ఆ ఎనుమును పడేసిరా నాయనా అని చెప్పింది. కొండయ్య పెద్దకొడుకు నిద్ర లేసి కళ్ళు నులుముకుని తూర్పుదిక్కు చూసినాడు. అప్పుడే ఉదయించిన సూర్యుడు మబ్బుల్లో కి మళ్ళీ జారుకుట్టున్నట్టు అనిపించింది .ఇంటి పక్కన ఉన్న బడెను భుజాన పెట్టుకుని తోటి వెట్టిమాల్లోల్లను పిలుచుకొని వీరారెడ్డి ఇంటి దొడ్డి గుమ్మం దగ్గరకు పోయినారు. పశువుల పాకలో పడిఉన్న ఎనుమును ఎట్టిమాలలు పొర్లించి దాని కాళ్ళకు తాడు కట్టి బడెను దూర్చి ఎనిమిది మంది ఎత్తుకచ్చి ఊరావతల పడేసినారు. అందరికి చెమటలు కక్కుతున్నాయి. కొండయ్య పెద్దకొడుక్కు మాత్రం భుజం నొప్పి పట్టింది. తన తండ్రి ఇన్నేళ్లు ఇటువంటి పనులు ఎంత ఓర్పుగా చేశాడో తలచుకున్నాడు. ఈ మాలా మాదిగ పనులు మీరు సెయ్యలేరు. బాగా సదుకోనాయనా అని తన తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చినయి. గుండెలు ఆవిరయ్యాయి. తన చేతిలో ఉన్న బడెను విసిరి చెట్లల్లో పడేశాడు. మబ్బుల్లో దాగిన సూర్య కిరణాలు మబ్బులను విడిచి ముఖం మీద పడ్డాయి. వెనక్కి చూడకుండా తన వాడవైపు బయలుదేరినాడు. ◆

# అమ్మభాష



- మందరపు హైమవతి
9441062732

కొండమీద నుంచి దూకే జలపాతం తుంపురులు మన ఒంటిమీద పడి గిలిగింతలు పెడతాయి. వర్షం వెలిసాక నిర్మలమైన ఆకాశం సరోవరంలో దూదిపింజల్లా తెల్లని మబ్బుల హంసలు ఒయ్యారంగా విహరిస్తుంటాయి. రూపాయి నాణెం కూడా స్పష్టంగా కనిపించే నిర్మలమైన నీళ్ళు ప్రవహించే నదిలో స్నానం చేస్తుంటే ఎప్పటికీ బయటకు రాబుద్ధికాదు. మన ఆప్తులు, మిత్రులు మరణిస్తే మనస్సు కన్నీటి కడలి అవుతుంది. చిరకాలానికి చిన్ననాటి స్నేహితుడు ఇంటికి వచ్చినపుడు మనసు ఆనందంతో గంతులు వేస్తుంది. మనం రాసిన రచనకు గుర్తింపు వచ్చినపుడు పారవశ్య ప్రవాహంలో మునిగిపోతాం. ఇలాంటి అనుభూతులను, భావోద్వేగాలను పంచుకోవాలంటే మాతృభాషలోనే సాధ్యమౌతుంది.

మన తెలుగుభాష చాలా గొప్పది. తెలుగుకు తెనుగు అనే పర్యాయపదం కూడా ఉన్నది. తెనుగు అంటే తేనెలాగా తీయనైన భాష అని అర్థం. తెలుగు అజంత భాష. తెలుగు భాషను పలికేటప్పుడు వీనులవిందుగా వుంటుంది. తెలుగు లిపి కూడా ముత్యాల లాగా గుండ్రంగా వుంటుంది.

తిక్కన, పోతన, మొ॥ కవులు తమ కవిత్వంతో తెలుగుభాషను సుసంపన్నం చేసారు. అన్నమయ్య, పదాలు, త్యాగయ్య కీర్తనలు, వీరబ్రహ్మం తత్వాలు, వేమన, బద్దెన పద్యాలు, తెలుగువారి నాలిక చివర నాట్యమాడుతుంటాయి. శిశువు పుట్టడం, పెరగడం, పెళ్ళి చేసుకోవడం ఇలాంటి వివిధ, విభిన్న సందర్భాలలో నిత్యజీవితంలో జానపదుల గళాల్లో పలికే జానపదగేయాలు మనను ఉర్రూతలూగిస్తాయి. తెలుగు వాళ్ళుగా పుట్టినందుకు, తెలుగు భాషలో మాట్లాడుతున్నందుకు మనం ఎంతో గర్విస్తాము. ఎన్ని విధాలుగానో ఆనందిస్తాము.

కానీ మన తెలుగు వారికి తెలుగు అంటే అభిమానం లేదు. తెలుగు భాషా పండితులు, భాషాభిమానులు కూడా తెలుగులో సంతకాలు చేయరు. ఇంట్లో మాట్లాడేటప్పుడు సగం ఇంగ్లీషు మాటలు మాటలాడతారు. చక్కని తెలుగు మాటలున్నా వాటి బదులు ఇంగ్లీషు మాటలే మాటలాడతారు. అన్నానికి రైసు అని, కూరకు కర్రీ అని, నీళ్ళకు వాటర్ అని అంటారు. వాటర్ బాటిల్, మిల్క్ పాకెట్, ఫ్రూట్స్ అనే మాటలు బాగా అలవాటయ్యాయి. ప్రజలు నిత్యజీవితంలో గుడ్‌మాణింగ్‌తో మొదలై గుడ్‌నైట్‌తో పూర్తవుతుంది.

షాపుల బోర్డుల పేర్లన్నీ ఇంగ్లీషులోనే వుంటాయి. కేవలం ఆంగ్ల లిపి కాదు 'మోర్' అని, 'ఇంప్రెషన్స్', 'వుడ్‌ల్యాండ్' అని ఇంగ్లీషు పదాలనే వాడతారు. ఎవరైనా మంచినీళ్ళ సీసా, అన్నం, కూర ఇలాటి మాటలు మాట్లాడితే వాళ్ళను ఆదిమ యుగానికి చెందిన ఆటవికుల్లాగా చూస్తారు.

పత్రికల్లో కూడా బుక్‌షెల్ఫ్, స్పోర్ట్సు, సండే కామెంట్ అని శీర్షికలు పెడతారు. ఇక ఛానళ్ళలో ఓపెన్ హార్ట్ విత్ ఆర్.కె అని రకరకాలుగా ఇంగ్లీషు పేర్లతోనే కార్యక్రమాలు నిర్వహిస్తారు.

మ్యారేజీ హాలు, వెడ్డింగ్, కార్డు, బర్త్ డే, ఏనివర్సరీ, ఫంక్షను, సెర్మనీ అనే ఇంగ్లీషు మాటలను అలవోకగా

పలుకుతుంటారు. ప్రజల్లో ఇంగ్లీషు భాషా వ్యామోహానికి కారణాలేమిటో అర్థం కాదు. బహుశా ఇంగ్లీషులో మాట్లాడితే గొప్ప అనుకొంటారు. ఇంకా ఏంకర్ల భాష మరింత ఘోరమైనది. మాట్లాడే భాషనిండా ఇంగ్లీషు మాటలే. తెలుగు భాషా పరిమళం కొంచెం కూడా మనకు తాకదు.

ఇక తల్లిదండ్రులందరూ తమ పిల్లలు ఆంగ్లమాధ్యమంలోనే చదువుకోవాలని అనుకొంటున్నారు. ఈ పాఠశాలల్లో ఫీజులు ఎక్కువైనా, అప్పులు చేసైనా అక్కడే చదివిస్తున్నారు. అందువల్లనే పాఠశాలల్లో ఆంగ్లమాధ్యమం ప్రవేశపెట్టామని ప్రభుత్వం చెబుతుంది.

ప్రాథమిక విద్య మాతృభాషలోనే సాగాలని ఎంతోమంది విద్యావేత్తలు అన్నారు. ఐనా తెలుగు భాషాభిమానం లేని ప్రభుత్వం మొండిగా ఒకటి నుండి ఆరవ తరగతివరకు ఆంగ్లభాషలోనే బోధన జరపాలని నిర్ణయించుకొన్నది.

ఎవరైనా మాతృభాషలోనే తమ భావాలను సులువుగా వ్యక్తీకరించగలరు. కిందపడి దెబ్బలు తగిలినప్పుడు ఎవరైనా 'అమ్మా' అని అంటారు కానీ 'మమ్మీ' అనరు కదా! మాతృభాష మీద పట్టు సాధించినపుడు మిగిలిన భాషలు నేర్చుకోవడం కష్టమేమీ కాదు. ఒకటి నుంచి ఐదవ తరగతి వరకు విద్యార్థులకు మాతృభాషలోనే బోధన జరపాల్సి వుండగా ఇంగ్లీషులో విద్యాభ్యాసం ఎంతవరకు సమంజసం.

పాఠశాలలో చేరడంతోనే ఆంగ్ల మాధ్యమంలో విద్యార్థులకు పాఠాలు బోధించినపుడు అర్థం చేసుకోవడం కష్టం. పిల్లలకు తేలిగ్గా అర్థం కావడానికి ఉపాధ్యాయులు కొన్ని సందర్భాలలో తెలుగులోనే చెప్తారు.

ఈ సందర్భంలో గొప్పవాళ్ళు మాత్రమే ఆంగ్లమాధ్యమంలో చదవాలా? పేదలకు ఇంగ్లీషు చదువులు అక్కరలేదా? వాళ్ళు ఎప్పటికీ ఎదగకుండా "ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉండిపోవాలా అని కొందరు అంటున్నారు. కేవలం ఆంగ్లమాధ్యమంలో బోధిస్తేనే సమాజంలో పేద ధనిక తారతమ్యాలు నశిస్తాయా? ఇప్పటికీ వెలివాడలు, దళితులుపై దమనకాండలు అంతరించలేదు. మరి అక్కడ సమానత్వం సాధించవచ్చును కదా!

ఏ బడిలో చేరకుండానే అమ్మఒడిలో ఉంగా ఉంగా అనే చిన్నారి వయసులోనే ఎవరూ నేర్పకుండానే అవ్వ తాత పదాలు పిల్లలు పలుకుతారు. అదీ మాతృభాష గొప్పతనం. ప్రాథమిక విద్యాబోధన మాతృభాషలో ఉండాలని, అప్పుడే విద్యార్థులకు ఎన్నో విధాలుగా ప్రయోజనం కలుగుతుందని జాతీయ విద్యా పరిశోధన, శిక్షణ మండలి (ఎన్‌సిఈఆర్‌టీ) సంచాలకుడు ఆచార్య హృషికేష్ సేనాపతి చెప్పారు. విద్యార్థులు అమ్మభాషలో అధ్యయనం చేసినప్పుడు వివేచన, ఊహాశక్తి, విశ్లేషణా సామర్థ్యం, సృజనాత్మకం పెంపొందుతాయి. ప్రపంచవ్యాప్తంగా ఎన్నో అధ్యయనాలు ఇదే విషయాన్ని చెప్తున్నాయి.

ప్రపంచంలో ఆంగ్లబోధన లేని దేశాలే అన్ని రంగాల్లో ముందంజలో వున్నాయని 'ఆంగ్లమాధ్యమం – అభివృద్ధి' అనే అంశంపై ఇటీవల మూడు సంస్థలు చేసిన అధ్యయనంలో తెలిసింది. ఆంగ్లంతోనే అభివృద్ధి సాధ్యమనేది కేవలం అపోహ మాత్రమే. ఆర్థికంగా ఎదిగిన పది దేశాల్లో ఆంగ్లం మాట్లాడేవి అమెరికా, బ్రిటన్ మాత్రమే. అక్షరాస్యత, తలసరి ఆదాయం, ఆరోగ్య ప్రమాణాల ఆధారంగా రూపొందించే మానవాభివృద్ధిసూచిలో అగ్రస్థానంలో ఉన్న పది దేశాల్లో సింగపూర్, ఆస్ట్రేలియా తప్ప మిగతావన్నీ మాతృభాషలోనే చదువుతూ ప్రపంచాన్ని శాసిస్తున్నారు. ప్రపంచంలోని 52 దేశాల్లో ఉన్నత విద్యాబోధన ఆంగ్లమాధ్యమంలో జరుగుతున్నది. వాటిలో అమెరికా, ఆస్ట్రేలియా కెనడా, యుకె, సింగపూర్ తప్ప మిగిలినవన్నీ పేదరికంతో బాధపడుతున్నాయి.

కన్నతల్లిని, జన్మనిచ్చిన ఊరిని, తల్లి భాషను గౌరవించని వాళ్ళు ఇక దేన్ని గౌరవిస్తారు. మాతృభాషలో విద్య నేర్చుకోవడం తల్లిపాలు తాగినంత బలం. పరాయిభాషలో చదువుకోవడం డబ్బాపాలకు అలవాటుపడటమన్నమాట. తల్లిపాలలో వున్న బలం డబ్బాపాలలో వుండదు కదా!

ఐనా మన తెలుగు వాళ్ళకు పరభాషా వ్యామోహం ఎక్కువ ఆంగ్లభాషకు ముందు సంస్కృతంపై మోజు తర్వాత ఆంగ్లం అంటే అతిమోజు. దశాబ్దాల కిందటే పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు తెలుగు వాళ్ళ తెలుగు భాషా వైముఖ్యాన్ని చీల్చి చెండాడారు. మాతృభాషలో "కావుకావు"మని అరవని కాకులు ఆంగ్లంలో ఎలా అరుస్తాయి అంటూ తెలుగు వారి ఆంగ్లభాషా వ్యామోహాన్ని ఎండగట్టారు. కొన్ని దశాబ్దాలు గడిచినా మనకు ఇదే మారని పరిస్థితి ఇదే దౌర్భాగ్యం.

కొన్ని కార్పొరేట్ శక్తులు స్వలాభం కోసం విద్యను వ్యాపారంగా మార్చారు. ఇంగ్లీషు మీడియం పాఠశాలలను నెలకొల్పారు. లక్షల లక్షలు ఫీజులు వసూలు చేసారు. ఇంగ్లీషు మీడియం పాఠశాలలో చదవకపోతే పిల్లలకు ఉద్యోగాలు రావు

## కవిత

# పొగమంచు

- కొండా శిరీష
6300396530



ఆకాశం చలి శిల్పాన్ని చెక్కుతూ
మంచు పుప్పొడిని రాలుస్తోంది
మంచు షామియానా కింద నడిరాత్రి నడుస్తూ
బద్ధకంగా ఉదయిస్తోంది
మనసుపొద్దు పొడవట్లేదు
మబ్బులా ముసురుకుంది
ఏ దుఃఖపుగాలి ఆవహించిందో
కన్నుల అద్దాలపై కన్నీరై జారుతోంది
మంచి ముసుగేసిన మసగ రూపాలు మెల్లమెల్లగా
రంగులుమారుస్తూ
దారిన నడుస్తున్న పాదాలకు రాయిలా అడ్డు
తగులుతున్నాయి
ఇంకా సగం ఉదయమే ఉదయించింది
సగం రంగులనే చూయిస్తూ....
అయినా!

ఏ పొగమంచు అంచున దాక్కున్నా
సూర్యుని కిరణాల
కళ్ళ నుండి తప్పించుకోలేవు

మంచి కంబళి కప్పుకున్న చెడు మంచు
నిప్పుకణికలకు చలించాల్సిందే
భగభగా మండుతూ
గప్పున ఎగసే పొగల సెగలకు
కుతకుతలాడుతున్న మట్టి బుడగలకు
భీకర శబ్దాల దుర్గంధాలు భస్మం అవ్వాల్సిందే....

◆

---

అనే భావాన్ని సామాన్య జన హృదయాల్లో నాటి తమ విద్యా వ్యాపారాన్ని బాగా విస్తరింపచేసికొన్నా ఆంగ్లమీడియంలో తమ పిల్లల్ని చేర్పించే తల్లిదండ్రులందరూ తెలుగుమీడియంలో చదివిస్తే పిల్లలకు ఉద్యోగాలు రావు అని నమ్మకం ఏర్పడిపోయింది. ఎక్కడో ఉన్నా తమిళులు ఇక్కడ తమిళపాఠశాలలు పెట్టుకొంటారు. కన్నడిగులు కన్నడ సేవాసంఘాలు నిర్వహించుకొంటారు. మన ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం తెలుగును దూరంగా విసిరిపారేయడం మన తెలుగువారి దౌర్భాగ్యం. ఇరుగు పొరుగు వారైన తమిళులు ఎక్కడకు వెళ్ళినా తమిళం తప్ప మరొకటి మాట్లాడరు. ప్రపంచంలో ఎక్కడకు వెళ్ళినా తమ భాషను సంప్రదాయాలను మరచిపోరు కన్నడిగులు అంతే. మళయాళీలు కూడా అదే భాషాభిమానాన్ని చూపిస్తారు.

మనదేశంలో మాతృభాషా ద్వేషులు తెలుగు వారు ఒక్కరే. లేకపోతే మన పాలకులే అమ్మభాషకు వ్యతిరేకంగా ఆంగ్లభాషకు పట్టం కట్టడం ఏమిటి? ప్రపంచంలో ఎక్కడా ఉండదు. మన భాష అధికార భాషగా లేని బెంగుళూరు వంటి కొన్ని ప్రాంతాల్లో తెలుగు బోధించే పాఠశాలలు ఉన్నాయి. మన తెలుగు రాష్ట్రంలో మాత్రం తెలుగును నిర్లక్ష్యం చేయడం ఎంత దారుణం.

గూగుల్ కూడా అన్ని భాషలతోపాటు తెలుగును గుర్తించింది. తమిళకవి సుబ్రహ్మణ్య భారతి 'సుందరం తెలుగు' అన్నాడు 'దేశభాషలందు తెలుగు లెస్స' అని అన్నారు. 'ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్' అన్నారు. ఈ మాటలన్నది పరభాషల వాళ్ళు కానీ తెలుగు వారికి మాత్రం తెలుగంటే అభిమానం లేదు. అమ్మభాషను విస్మరించే వారికి ఆ భాషలోని సాహిత్యం, సంస్కృతి ఎలా అర్థం అవుతుంది.

ప్రాథమిక దశలోనే ప్రతి విద్యార్థికి మాతృభాష అవసరం. ఆ తర్వాత ఏ భాషలోనైనా అభ్యసించవచ్చును. కానీ ప్రభుత్వం వారు ప్రాథమిక దశలోనే తెలుగును తొలగించడం విద్యార్థుల భవిష్యత్తుకు గొడ్డలిపెట్టు. ప్రభుత్వం ఇప్పటికైనా పునరాలోచించి ఈ నిర్ణయాన్ని మార్చుకొంటే మంచిది.

తెలుగును ఉపాధి భాషగా చేయడానికి ప్రయత్నించాలి, ఆంగ్లంలో వున్న సాంకేతిక పదాలను తెలుగులోకి అనువదింపచేయాలి. దీనికి సమర్థులైన అనువాదకులను నియమించాలి. ప్రైవేటు పాఠశాలల్లో కూడా తెలుగు మాధ్యమాన్ని ఒకటి నుంచి ఐదవ తరగతి వరకు తప్పనిసరి చేయాలి. తెలుగులో మాట్లాడితే శిక్షలు విధించే పాఠశాలలకు గుర్తింపు రద్దు చేయాలి. తెలుగు భాషాభివృద్ధి దిశగా పాలకులు చిత్తశుద్ధితో నిర్ణయాలు తీసుకోవాలి.

మనకు అధికార భాషాసంఘం తెలుగు అకాడమీ ఉన్నాయి. అవి పేరుకు మాత్రమే మిగిలిపోకుండా ప్రజల్లో తెలుగు భాషా వ్యాప్తికి కృషి చేయాలి. అప్పుడే మన రాష్ట్రంలో తెలుగు వెలుగుతుంది.

◆


14.04.1939 - 12-12-2019

## గొల్లపూడి మారుతీరావు కన్నుమూత

సుప్రసిద్ధ రచయిత, నటుడు, సంపాదకుడు, వ్యాఖ్యాత గొల్లపూడి మారుతీరావు డిసెంబర్ 12న కన్నుమూశారు. తెలుగు సినిమా రంగంలో మాటల రచయితగాను, నటుడిగానూ సుపరిచితుడు గొల్లపూడి. సినిమాల్లోకి రాకముందు నాటకాలు, కథలు, నవలలు రాశారు. రేడియో ప్రయోక్తగానూ, అసిస్టెంట్ స్టేషను డైరెక్టరుగానూ, ఆంధ్రప్రభ (దినపత్రిక) ఉపసంపాదకుడిగానూ పనిచేశారు. సినిమా రంగంలో ఆయన మొట్టమొదటి రచన డాక్టర్ చక్రవర్తి. 1959లో ఆంధ్రప్రభ దినపత్రిక ఉపసంచాలకునిగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించారు. తరువాత రేడియోలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్ గా ఎంపికై, హైదరాబాదుకు మారారు. ఆకాశవాణి విజయవాడలో కూడా పనిచేశారు. ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య సినిమాతో నటుడిగా సినిమారంగ ప్రవేశం చేశారు. మారుతీరావు రాసిన తొలి కథ ఆశాజీవి. ప్రొద్దుటూరు నుండి వెలువడే స్థానిక పత్రిక రేనాడులో 1954, డిసెంబరు 9న వెలువడింది. చిన్న వయసులోనే రాఘవ కళా నికేతన్ పేరున ఆయనొక నాటక బృందాన్ని నడిపారు. ఆడది (పినిశెట్టి), కుక్కపిల్ల దొరికింది, స్వయంవరం (రావి కొండల రావు), రిహార్సల్స్ (సోమంచి యజ్ఞన్న శాస్త్రి), వాపస్ (డి.వి.నరసరాజు), మహానుభావులు (గోగోల్ రాసిన An Inspector Calls ఆధారంగా సోమంచి యజ్ఞన్న శాస్త్రి చేసిన రచన) నాటకాలకు నిర్మాణం, దర్శకత్వం వహించడంతోపాటు, ప్రధానపాత్రధారిగా నటించాడు. హెచ్ఎంటివి ఛానల్‌లో ధారావాహికంగా ప్రముఖ తెలుగు కథలను, కథకులను పరిచయం చేశారు. బహుముఖ ప్రజ్ఞను కనబరచి తెలుగు సాహిత, సాంస్కృతిక చరిత్రలో ప్రముఖ స్థానం పొందిన గొల్లపూడి మారుతీరావుకు సాహిత్య ప్రస్థానం నివాళి అర్పిస్తున్నది. ◆

---



## 'నవోదయ' రామ్మోహనరావు కన్నుమూత

ప్రముఖ పుస్తక ప్రచురణ కర్త, నవోదయ పబ్లికేషన్స్ అధినేత రామ్మోహనరావు (85) డిసెంబర్ 22 న విజయవాడలోని తన స్వగృహంలో కన్ను మూశారు. పుస్తక ప్రచురణ రంగంలో ఆయన విశేషమైన కృషి చేసి గుర్తింపు పొందారు. 1934లో కృష్ణా జిల్లాలో జన్మించిన రామ్మోహనరావుకు చిన్ననాటి నుండి పుస్తకాలు అంటే ఎనలేని మక్కువ. ఆయన మొదట విశాలాంధ్ర బుక్‌హౌస్‌లో కొంతకాలం పనిచేశారు. ఆ తరువాత 1957లో గుడివాడలో నవోదయ పబ్లికేషన్స్‌ను స్థాపించారు. ఏడాదికే దాన్ని విజయవాడకు మార్చారు. దాదాపు ఆరు దశాబ్దాల పాటు ప్రచురణ కర్తగా అభ్యుదయ సాహిత్యాన్ని ప్రచురించారు. అప్పటి నుండి నేటి వరకు ఎంతోమందికి పుస్తకాలను అందించడంతో ఆయన పేరు నవోదయ రామ్మోహనరావుగా నిలిచిపోయింది. శ్రీశ్రీ, ఆరుద్ర, బాపు, ముళ్లపూడి వెంకటరమణ, గోపీ చంద్ వంటి ఎందరో ప్రముఖ రచయితల పుస్తకాలను ప్రచురించారు. బాపు గీచిన అందమైన బొమ్మలతో పుస్తకం అట్టకు వన్నెతెచ్చారు. తరువాత అది తెలుగు పుస్తక రంగానికి ఒక ఒరవడిగా మారింది. నవత ట్రాన్స్‌పోర్ట్ సంస్థ అధినేత కీ.శే. బోస్ సోదరి ఝాన్సీని ఆయన వివాహమాడారు. 1989లో విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ ఆధ్వర్యంలో పుస్తక ప్రదర్శన ప్రారంభించినప్పుడు వ్యవస్థాపక అధ్యక్షునిగా పనిచేశారు. తెలుగు ప్రచురణ రంగం పట్ల తుదిశ్వాస వరకూ తన ఆసక్తిని వదులుకోని అసలు సిసలు తెలుగు సాహిత్య ప్రేమికుడు నవోదయ రామ్మోహనరావుకి సాహిత్య ప్రస్థానం జోహార్లర్పిస్తున్నది. ◆

# స్వీకారం



## కొత్త క్యాలెండర్ కవిత్వం
**డా॥ రావి రంగారావు**

**వెల : 100/- పేజీలు: 112**

**ప్రతులకు : 9247581825**

కవి అనేవాడు చేయాల్సిందల్లా ఒక్కటే/ కవిగా కరిగిపోయి కరిగిపోయి/ కవితగా ప్రపంచం లోకి ప్రవహించటమే/ జనంలోకి ఇంకిపోయి ఇంకిపోయి/ మనుషులలో మానవత మొక్కగా మొలకెత్తటమే/ మనుసులలో పరిమళాలు చక్కగా ప్రసరించటమే

**- డా॥ రావి రంగారావు**



## ఈశ్వరమ్మ శతకం
**శ్రీధర్ కొమ్మోజు**

**వెల : 75/- పేజీలు: 75**

**ప్రతులకు: 9989464467**

ఈ శతకంలో నేటి సమాజంలోని అన్ని రుగ్మతలను ఎత్తి చూపారు శ్రీధర్ గారు. దేశభక్తితో పాటు పెద్దల పట్ల, స్త్రీల పట్ల గౌరవం, మాతృ భాషాభిమానం అందరికి ఉండాలని, కుటుంబాన్ని – సమాజాన్ని ప్రేమించడం మానవుని కనీస కర్తవ్యమని ప్రబోధించారు. శతకంలోని ప్రతి పద్యం ఒక కొత్త రుచిని అందిస్తున్నది.

**- మండలి బుద్ధప్రసాద్**



మహారాష్ట్ర

## తెలుగు రచయితల కథా సంకలనం
**సంకలనం: సంగెవేని రవీంద్ర**

**వెల : 200/- పేజీలు: 208**

**ప్రతులకు: 022-2780167**

మహారాష్ట్రలో ఉంటున్న తెలుగు కథకుల రచనలతో ఒక ప్రత్యేక సంచిక తీసుకురావాలనుకున్నాం. ఈ కథా సంచికలో 31 మంది రచయితల కథలున్నాయి. మహారాష్ట్రలో గతంలో వ్యక్తిగత కథా సంపుటాలు ఎన్నో వెలువడి ఉండొచ్చు. కానీ, ఇలా 31 మంది రచయితల కథల్ని ఒకే సంపుటిగా ప్రచురించడం మొదటిసారి జరుగుతోంది.

**- బండి నారాయణరెడ్డి**

**- మాదిరెడ్డి కొండారెడ్డి**



తెలుగు భాషా వైతాళికులు

## గురజాడ, గిడుగు...
**సంపాదకులు: పేరిశెట్టి శ్రీనివాసరావు**

**వెల :350/- పేజీలు: 223**

**ప్రతులకు: 9989242343**

తెలుగు భాషా వైతాళికులు: గురజాడ, గిడుగుల పైన 2016లో రాజమండ్రిలో ఏర్పాటు చేసిన గోష్టిలో సమర్పించిన యాభై పత్రాల సమాహారం మీ చేతుల్లోకి వచ్చింది. అక్షర సాహితీ సాంస్కృతిక సేవాపీఠం వారి తరపున డా. పేరిశెట్టి శ్రీనివాసరావు సంకలనం చేసిన ఈ వ్యాసాలు మరొకసారి గురజాడ గురించీ, గిడుగు గురించీ ఆలోచింపచెయ్యడమే కాక, కొన్ని కోణాలను కూడా తెరుస్తున్నాయి.

**- వాడ్రేవు చినవీరభద్రుడు**



ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యానుశీలనం

## అద్వితీయ
**విహారి**

**వెల :150/- పేజీలు: 186**

**ప్రతులకు: 040-24093432**

ఇది 'అద్వితీయు'!. ఆచార్య కొలకలూరి ఇనాక్ గారి వ్యక్తిత్వ, సాహిత్య వ్యక్తిత్వ దర్పణంగా – సార్ధక నామధేయు!. ఇది 'అద్వితీయు'! సాహిత్య పరామర్శ. విమర్శ కాదు. ఈ రెండూ పర్యాయపదాలు కావు. ఇది ఒక సాహితీవేత్త దీక్షాదక్షతల 'చలనం – గమనం – పయనం' ల అక్షర గీత. ఆ అక్షర కృషీవలుడు ఆచార్య ఇనాక్.

**- విహారి**



## మిత్ర సమాసం లఘు సిద్ధాంత గ్రంథం
**ఆచార్య కొలకలూరి ఇనాక్**

**వెల :75/- పేజీలు: 107**

**ప్రతులకు: 9440243433**

నేనీ పరిశోధన, ఏ పట్టా కోసమో చేయలేదు. ఏ డిగ్రీకీ సమర్పించలేదు. ఎక్కడా ప్రచురించలేదు. ఒక సెమినారులో పత్ర సమర్పణ చేయటం తప్ప. 1979లో ముగించిన ఈ లఘు సిద్ధాంత గ్రంథం ఏనాటికైనా ప్రచురించాలని భద్రంగా ఉంచాను. ఈనాటికి కుదిరింది. ఇది నలభై ఏళ్ళనాటి కృషి. ఇప్పటికీ ఎవరికైనా, ఏ పరిశోధకుడికైనా, ఏ విమర్శకుడికైనా, ఏ మాత్రం ఉపయోగపడినా నా కృషి ధన్యమే.

**- కొలకలూరి ఇనాక్**

# స్వీకారం



## దిక్కులేనోడు నాటిక

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

వెల : 27/- పేజీలు: 46

ప్రతులకు : 9440243433

కంచికచర్లలో జరిగిన సంఘటన ఆధారంగా ఈ నాటిక రాశాను. కోర్టులో కేసు నడుస్తున్నందువల్ల అప్పుడు దాన్ని 'కేవలం కల్పితం' అన్నాను. అప్పుడు అది వాస్తవిక జీవిత చిత్రీకరణమే. ఇప్పుడు కొంత కల్పించాను. ఇది పునర్నిర్మాణం పొందింది.

**- కొలకలూరి ఇనాక్**



ఆత్మ కథాత్మక నవల

## పులుల బోను - నేను

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

వెల : 75/- పేజీలు: 123

ప్రతులకు: 9440243433

దీన్ని 1959 ఏప్రిల్ నెలలో రాశాను. అప్పటికి దానిపేరు 'కాలమేఘాలు'. నేను నల్ల మేఘమై కన్నీరు కార్చటం, కాలం మేఘంలా బరువుగా కదిలిపోవటం నాకింకా గుర్తే! కన్నీరు ఆరిపోయింది. సంఘర్షణ మేఘాలు తొలిగిపోయాయి. అప్పుడు ఈ నవలను ప్రచురించలేకపోయాను. దీన్నిమధ్య చదివాను. ఆనందం కలిగింది. సవరించాను. నవల పేరు మార్చాను.

**- కొలకలూరి ఇనాక్**



ఆత్మ కథాత్మక కథానికలు

## మనూళ్లల్లో మా కథలు

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

వెల : 120/- పేజీలు: 104

ప్రతులకు: 9440243433

నాకు తెలిసిన, చూచిన, అనుభవించిన జీవిత శకలాలే కథేతివృత్తాలు. నాలుగేళ్ళ నుంచి, పన్నెండేళ్ళ దాకా విస్తరించుకొన్న నా బాల్యంలోని కొన్ని సంఘటనలీ కథానికలు. వీటిని రాయటం వల్ల నా బాల్యస్మృతులు ప్రక్షాళితమయ్యాయి. మా అమ్మ, మా నాయన, మా అయ్యవారులు, మామయ్యలు, బంధువులు, ప్రజలు, ప్రకృతి, గాలి, నీరు, నేల, నింగి, క్షుదాగ్ని నాతోపాటు ఈ కథానికల్లో పాత్రలు.

**- కొలకలూరి ఇనాక్**



## మొలక కవిత్వం

**భానుశ్రీ కొత్వాల్**

వెల :90/- పేజీలు: 90

ప్రతులకు: 9866863913

ఆమె కవితా ప్రపంచంలో పువ్వులు, పిల్లలు, భవిష్యత్తుపై ఆశ, ప్రకృతిపై ప్రేమ, సమస్త పీడిత జనసందోహాల పోరాటపటిమ గురించిన విశ్వాసం ఇవన్నీ చోటుచేసుకున్నాయి. వస్తులోపం దృష్టికోణలోపం, కవిత్వీకరణ లోపంలేని అచ్చమైన కవితలు కొలువుదీరాయి ఈ సంకలనంలో. భానుశ్రీ కవిత్వాన్నంతా చదివిన తర్వాత చాలా ఆశ, నమ్మకం కలుగుతున్నాయి. స్పందించే హృదయాలు, కన్నీరుకార్చే కళ్ళు, చేయందించే మానవులు ఉంటారనీ, ఈ కర్కశ సమాజంలో పీడితులకు ఊరటనిచ్చి, పోరాడమని పిలుపునిచ్చే గొంతులు ఉన్నాయని మరొకసారి తెలుస్తుంది.

**- ఓల్గా**



## దగ్ధ పల్లవుల పాట దీర్ఘ కవిత

**ఏటూరి నాగేంద్రరావు**

వెల :60/- పేజీలు: 40

ప్రతులకు: 8919851069

ఈ దీర్ఘ కవిత ఆద్యంతమూ ఒక అశ్రు జలపాతమై మన మీద దూకుతూనే వుంటుంది. నిర్దయురాలైన స్త్రీ వాకిట నిలబడిన ఒకానొక అన్‌వాంటెడ్ విజిటర్ వేదనాత్మక రసాత్మక క్రియ ఇది. ఇందులో వస్తువుతో ఎవరైనా విభేదిస్తారేమో కాని నాగేంద్ర అగ్నిలా మండే అశ్రుసిక్త అక్షరాలను వదిలించుకోలేరు.

**- బి. ప్రసాదమూర్తి**




పలువ్యాధుల నివారణకు

## పంచపత్ర పానీయం

నేను - నా యోగ (సులభమైన ఆసనాలు)

**కూతురు రాంరెడ్డి**

వెల :80/- పేజీలు: 112

ప్రతులకు: 9000415353

యోగాసనాల్లో కఠినమైనవి కొన్ని, సరళమైనవి కొన్ని - అబ్బో! ఇవి మనకు అసాధ్యం, మనవల్ల కాదు అన్నవి కొన్ని ఉంటాయి. మన శరీర ఆకృతి, మనకు దొరికే సమయాన్ని బట్టి 'ఒక గంటసేపు యోగా' చేస్తే చాలు. అందుకు అతి ముఖ్యమైనవి, అందరికీ సులభమైనవీ కొన్ని ఆసనాల గురించి, వాటి సూక్ష్మములను గురించి తెలియజేయడానికే నా యీ చిన్న ప్రయత్నం.

**- కూతురు రాంరెడ్డి**

# స్వీకారం

చలపాక ప్రకాష్ కవిత్వ తత్వం
## మూడోకన్ను - కావ్యదర్శనం
**పోతగాని సత్యనారాయణ**
వెల : 30/- పేజీలు: 80
ప్రతులకు : 9441083763



ఇతని కవిత్వంలో హంగులు, ఆర్భాటాలు కనిపించవు. పాండిత్య ప్రకర్షను ప్రదర్శించాలనే ఉబలాటం ఉండదు. భాషాడంబరాలకు పోయి పాఠకుడిని బెదరగొట్టడం అస్సలు కనబడదు. ఇతని కవిత్వంలో మానవుని జీవిత పరివేదన ఉంది. అంతేకాదు, కవితావేశంతోపాటు దానిని సహృదయునికి సంక్రమింప జేయాలన్న తపన ఉంది.

**- పోతగాని సత్యనారాయణ**

అక్షరాలతో
## కరచాలనం కవిత్వం
**శ్రీమతి ములుగు లక్ష్మీ మైథిలి**
వెల : 100/- పేజీలు: 96
ప్రతులకు: 9440088482



లక్ష్మీమైథిలీ కవితల్లో ప్రకృతి సోయగాలున్నాయి. పర్వాల పారమార్థిక తలపోతలున్నాయి. దేశభక్తి భావనలున్నాయి. యువతకు ఉజ్జ్వల భవిష్యత్ సందేశకామనలున్నాయి. నేటి సమాజ అస్తవ్యస్తతలను అద్దంలో చూపెట్టి తూర్పారబడుతూనే, ఆశావహ భవిష్యత్ వైపు సందేశ హారిగా నిలుస్తారు.

**- సుధామ**

## బంగారు కల చారిత్రక నవల
**డా॥ సి. భవానీదేవి**
వెల : 75/- పేజీలు: 184
ప్రతులకు: 9866847000



హంపీ విజయనగరం యొక్క ఒకనాటి వైభవం, శిల్పసౌందర్యం, దేవాలయ నిర్మాణం, లలిత కళలు, యుద్ధవిద్యలు, రాజ్యంలో వుంటూనే కుట్రదారుల పన్నాగాలు ఇలాటివెన్నో తెలుసుకోవాలంటే ఈ కాలంలో ఒక కరదీపిక డా॥ సి. భవాని గారు రచించిన 'బంగారు కల' చారిత్రక నవలే అధారం.

**- డా॥ ముక్తేవి భారతి**

## బుగతలనాటి చుక్కపల్లి నవల
**చింతకింది శ్రీనివాసరావు**
వెల :150/- పేజీలు: 181
ప్రతులకు: 8897147067



ఈ అరుగును ఆవుపేడతో అలికించుకునే మామూలు అరుగులా తీసి పారేయలేం. చుక్కల ముగ్గులెట్టించుకునే సాధారణ అరుగులా తీసిపారేయలేం. చుక్కల ముగ్గు లెట్టించుకునే సాధారణ అరుగులా కొట్టిపడేయలేం. ఇది మహోత్తరమైన అరుగు. మహోన్నతమైన అరుగు. పేక క్రీడకు పెన్నిధి. కంపీకి నిలయం. రన్‌మోరుకు రంగస్థలం. స్కోరుకు సొగసుకత్తె. సీక్వెన్స్‌కు సిరులపంట. జానాపట్లకు జాతీయవేదిక. నికరంగా మాట్లాడాలంటే అగ్రహారీకులందరి పేకాట్లకీ స్థితమతి. ఈ అరుగు సొద.. ఈ ఊరి కథే... ఈ నవల.

**- ప్రచురణ కర్తలు**

## ఎదారి బతుకులు పల్లెకతలు
**ఎండపల్లి భారతి**
వెల :100/- పేజీలు: 120
ప్రతులకు: 040-23521849



భారతి కథలు అభివృద్ధి చెందుతున్న భారతదేశపు క్రీనీడలను చూపించిన కాగడాలు. పాతికకు పైనున్న ఈ కథల్లో ఆమె చిన్నతనపు రోజుల మొదలు, నోట్ల రద్దు, పల్లెలపై కూడా టీవీల ప్రభావం వరకూ ఒక పరిణామ క్రమం వున్నది. మారీమారని పల్లెబ్రతుకు వెతలున్నాయి. తన అమ్మనుడిలోనే కథ చెబుతూ చివర్లో కొన్ని జీవితసత్యాలను అలవోకగా మన మీదకి విసురుతుంది చాలా ఒడుపుగా. నగర మధ్యతరగతి భద్రజీవుల కథలు కావివి. కులం రీత్యా వర్గం రీత్యా సమాజపు అంచులలోనుంచీ ఇంకా నడిమధ్యకు రావడానికి పెనుగులాడుతున్న జనం వెతలు

**- పి. సత్యవతి**

## ఆజాద్ హింద్ ఫౌజ్
(భారత జాతీయ సైనం)
## ముస్లిం పోరాట యోధులు
**సయ్యద్ నశీర్ అహమ్మద్**
వెల :400/- పేజీలు: 484
ప్రతులకు: 9440241727



ఈ గ్రంథంలో నుండి తొంగి చూస్తున్న మన స్వాతంత్ర్య సమరయోధులు మేం సాధించిన స్వాతంత్ర్యాన్ని ఈ తరం ఎలా కాపాడుతుందోనని వీక్షిస్తుంటారు. ఈ తరం ఆ చరితార్థులకు జవాబుదారీ కావాలి. భారత్‌ను సెక్యులర్ వ్యవస్థగా రాజ్యాంగాన్ని మనం ఆవిష్కరించు కున్నప్పటికీ సమాజం కుల, మత వర్గాల పునాదుల మీదే మనుగడ సాగించటం విచారకరం. ఈ పుస్తకం ఆసాంతం చదివాక ప్రతి చదువరీ ఒక్కసారి ప్రస్తుత పరిస్థితులను ఆత్మావలోకనం చేసుకోక తప్పదు.

**- వేతాంతం సీతారామావధాని**

# స్వీకారం



## విచ్చుకోవాలి వచన కవిత్వం

**వైహెచ్‌కె. మోహన్‌రావు**

**వెల : 100/- పేజీలు: 80**

**ప్రతులకు : 8985296123**

ఏ నియమాలు లేకుండా స్వేచ్ఛగా భావ వ్యక్తీకరణకు అనుకూలమైన పదప్రయోగంతో ఈ కవిత్వం సాగుతుంది. చక్కటి కవితా శీర్షికలు, సామాజిక స్పృహ, దేశభక్తి, మతసామరస్యం ప్రకృతి - వృక్ష పరిరక్షణ, మానవతా వాదం, తెలుగు భాషపై మమకారం... యిలా ఎంతో వైవిధ్యమున్న కవితా వస్తువులు చక్కట ఇవచన కవిత్వంతో "విచ్చుకున్న" కవితా సంపుటాన్ని చదివి తీరాలి.

**- డా॥ వెన్నిసెట్టి సింగారావు**



## వెలుతురు మొలకలు లఘుకవిత్వం

**చిత్తలూరి సత్యనారాయణ**

**వెల : 50/- పేజీలు: 87**

**ప్రతులకు: 8247432521**

చిత్తలూరి కవితలలో - సూటిదనం ఎక్కువ - అలాగని సున్నితత్వం వుండదని కాదు. అంతర్ముఖుడు కావటం వల్ల అంతరాత్మ నుండొచ్చిన ప్రశ్నలే ఎక్కువగా కన్పిస్తాయి. ఈ కవిత్వాన్ని చదివితే తన సామాజిక నేపథ్యం... మనస్తత్వం అర్థమవుతుంది. కొన్ని కవితలు మళ్ళీ మళ్ళీ ఒకే అంశాన్ని చెప్పినట్లుగా అన్పించినా... ఆ భావం కాస్తా భాషా సొగసుతో కొత్తగానే కన్పిస్తాయి.

**- అయినంపూడి శ్రీలక్ష్మి**



గాంధీజీ ప్రాణరక్షకుడు

## బతఖ్ మియా అన్సారి

**సయ్యద్ నశీర్ అహమ్మద్**

**వెల : 25/- పేజీలు: 24**

**ప్రతులకు: 9440241727**

మహాత్ముడు ఆంగ్లేయుడి ఇంటికి వచ్చాక ఆ ఇంటి వంటమనిషి 'బతఖ్ మియా అన్సారి' హత్యాయత్నం కుట్రను గాంధిజికి తెలిపి ఆయన ప్రాణాలను కాపాడతారు. ఈ విషయాన్ని 1950లో డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ బహిరంగ సమావేశంలో వెల్లడించారు. అప్పుడుగాని 'బతఖ్ మియా అన్సారి' సాహసం, తెగువ తెలియరాలేదు. ఆ మహత్తర సంఘటన గురించి ఆయన కుటుంబీకులతో సంప్రదించి మరిన్ని వివరాలతో ఈ పుస్తకాన్ని నాలుగు భాషల్లో ప్రచురించాను.

**- సయ్యద్ నశీర్ అహమ్మద్**



## అక్షర స(వి)న్యాసం కవిత్వం

**మంజు యనమదల**

**వెల :120/- పేజీలు: 141**

**ప్రతులకు: 9490769585**

జీవితం పట్ల విమర్శనాత్మక దృష్టి వుండటమే కాకుండా జీవితాన్ని నూతన ఆలోచనలతో పరిపుష్టం చేయుటం కూడా కవిత్వానికి లక్ష్యంగా వుంటుంది. జీవితంపట్ల సునిశితమైన విమర్శనాత్మక దృష్టితోపాటుగా ప్రగతి కాముక భావపరంపర ఆమె కవితలన్నింటిలోనూ ఒక ప్రవాహిగా వుంది. అలా సామాజిక జీవన వైరుధ్యాలను అత్యంత సజీవంగా తన కవన వాహినిలో ప్రవహింపజేశారు మంజు యనమదల.

**- నెల్లూరు నరసింహారావు**



మూరురాయరగండడు

## శ్రీకృష్ణదేవరాయలు (సమగ్ర విశ్లేషణ)

**యస్.డి.వి. అజీజ్**

**వెల :200/- పేజీలు: 226**

**ప్రతులకు: 9133144138**

శ్రీకృష్ణదేవరాయుల గురించి, విజయనగర సామ్రాజ్య స్థాపన గురించి, ఆయన పాలన గురించి తెలుగు ప్రజలకి ఉన్న ఆసక్తి తెలిసిందే. అంతకుమంచి తెలుగు భాషపై రాయల ఆసక్తి, ఆయన రచనలు, అలాగే సంగీత, సాహిత్యాది కళలపై కృషి గురించి మరింత లోతుగా ఈ పుస్తకంలో తెలుసుకోవచ్చు. ఆనాటి సామాజిక, సాంస్కృతిక విషయాలపై పాఠకుల అవగాహనను పెంపొందిస్తుంది ఈ రచన.



## స్వేచ్ఛ కథల సంపుటి

**యస్.డి.వి. అజీజ్**

**వెల :100/- పేజీలు: 107**

**ప్రతులకు: 9133144138**

చారిత్రక నవలలైన పాలెగాడు, తెరిణెకంటి ముట్టడి, బుడ్డా వెంగళరెడ్డి, గులాం రసూల్‌ఖాన్ తదితర నవలలు, చారిత్రక రచనలతో ప్రత్యేక గుర్తింపు పొందిన రచయిత యస్.డి.వి. అజీజ్. గతంలో 'మనిషి, 'తడి' కథల సంపుటి వెలువరించిన అజీజ్ ఇటీవలి తాజా కథల సంపుటి 'స్వేచ్ఛ'. వర్తమాన సామాజిక పరిస్థితులు, మానవ సంబంధాలను వాస్తవిక దృష్టితో చిత్రించిన పదిహేను కథల సమాహారం ఈ కథల సంపుటి

# మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో విజయవాడలో సత్యాగ్రహం



మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో తెలుగు మాధ్యమాన్ని కొనసాగించాలని డిమాండ్ చేస్తూ డిసెంబర్ 11న విజయవాడ ధర్నాచౌక్‌లో సత్యాగ్రహం జరిగింది. పలువురు మేధావులు, రచయితలు, ప్రజా ప్రతినిధులు జి.ఒ. 85ను తక్షణం రద్దు చేయాలని ఈ నిరసన కార్యక్రమంలో పాల్గొన్నారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన పిడిఎఫ్ శాసనమండలి పక్షనేత విఠపు బాలసుబ్రమణ్యం మాట్లాడుతూ ప్రభుత్వం దుస్సాహసం చేస్తోందన్నారు. మాధ్యమాన్ని రద్దు చేయాలన్న ప్రభుత్వ నిర్ణయంతో తెలుగు కనుమరుగవుతుందని ఆవేదన వ్యక్తం చేశారు. మాతృభాషను ఇలా రద్దు చేయడం ప్రపంచంలో ఎక్కడైనా జరిగిందా? అని ప్రశ్నించారు. తెలుగు కావాలనే వాళ్లను పేదలకు వ్యతిరేకులుగా చిత్రీకరిస్తున్నారని, ఎదురుదాడికి దిగుతున్నారని అన్నారు. ఉపాధ్యాయ ఎమ్మెల్సీ కత్తి నరసింహారెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలో అన్ని గురుకులాల్లో, 165 మోడల్ స్కూళ్లు, కెజిబివిలు, 9656 ప్రాథమిక, 1450 ప్రాథమికోన్నత పాఠశాలల్లో ఇప్పటికే ఆంగ్ల మాధ్యమం ఉందని, ఇప్పుడు తెలుగు మాధ్యమాన్ని పూర్తిగా రద్దు చేస్తున్నారని అన్నారు. ఎమ్మెల్సీ పి రఘువర్మ మాట్లాడుతూ పుట్టిన భాషను, జాతిని మరచిన నేతను సిఎంగా ఎన్నుకున్నామన్నారు. పరిపాలించే తీరు ఆయనకు అర్థమవుతోందా? ప్రజలు ఇంతగా గగ్గోలు పెడుతుంటే ఒక సారి కూడా ఆలోచించకుండా ఎందుకున్నారు? అని ప్రశ్నించారు. ప్రజాశక్తి సంపాదకులు ఎంవిఎస్ శర్మ మాట్లాడుతూ మాతృభాషా మాధ్యమ వేదిక ఉద్యమాన్ని ప్రజాశక్తి తన ఉద్యమంగా భావిస్తుందని, యావత్ శక్తిని ఉపయోగిస్తుందని చెప్పారు. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ ప్రొఫెసర్ గారపాటి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ సమస్యకు ఒక శస్త్ర చికిత్స కావాలని, సమావేశాల ద్వారా సాధించుకునే పరిస్థితి లేదని అన్నారు. చదువు జన భాషలో లేనప్పుడు సమాజం నాశనమవడమే కాక పూర్తిగా అస్తిత్వాన్ని కోల్పోవాల్సి వస్తుందన్నారు. ప్రతి పరిశ్రమా భాషాధారిత పరిశ్రమేనని, అవన్నీ మూతపడతాయని తెలిపారు. స్థూల జాతీయోత్పత్తిలో 87 శాతం మాతృభాషల ద్వారానే సాధ్యమవుతోందన్నారు. తెలుగు సినిమా పరిశ్రమలో 25 లక్షల మంది పనిచేస్తున్నారన్నారు. తెలుగు భాష కోసం పోరాడాల్సిన అవసరముందన్నారు. మాతృభాషా మాధ్యమ వేదిక స్టీరింగ్ కమిటీ సభ్యులు సామల రమేష్‌బాబు, పరిమి, రమేష్ పట్నాయక్ మాట్లాడుతూ తెలుగుజాతి విజయాలకే దెబ్బ తగులుతోందన్నారు. మాతృభాషా మాధ్యమంపై సాహిత్య ప్రస్థానం వెలువరించిన డిసెంబర్ నెల ప్రత్యేక సంచికను పిడిఎఫ్ ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణరావు ఆవిష్కరించారు. కార్యక్రమంలో విద్యావేత్త డా॥ ఎస్.ఆర్.పరిమి, ప్రజాసాహితి సంపాదకులు కొత్తపల్లి రవిబాబు, అరసం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ, రమేష్ పట్నాయక్, విరసం నాయకులు సిఎస్ఆర్ ప్రసాద్, రుక్మిణి, ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకులు ఎస్ వెంకట్రావు, అబ్దుస్ సుభాన్, చలసాని రామారావు, ఉపాధ్యాయ సంఘాల నేతలు షేక్ సాబ్జీ, జోసఫ్ సుధీర్ బాబు, పాండురంగ వరప్రసాద్, పి. కృష్ణయ్య, కె. లక్ష్మయ్య, చలపాక ప్రకాష్, వీరప్రసాద్, మందరపు హైమవతి, కోపూరి పుష్పాదేవి, కోడె యామినీదేవి, తదితరులు పాల్గొన్నారు. ◆

## 'యోధుడు కొండారెడ్డి' పుస్తకావిష్కరణ



కర్నూలు సాహితీస్రవంతి ఆధ్వర్యంలో డిసెంబర్ 15న జరిగిన గౌరెడ్డి హరిశ్చంద్రారెడ్డి రాసిన 'యోధుడు కొండారెడ్డి' పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో జి.. పుల్లయ్య, పత్తి ఓబుల్‌రెడ్డి, చెన్నూరు సంజీవరెడ్డి, డా.రామచంద్రనాయుడు జంధ్యాల రఘుబాబు, ప్రగతి విజ్ఞాన కేంద్రం కన్వీనర్ జెయన్ శేషయ్య, గాడిచర్ల ఫౌండేషన్ అధ్యక్షులు కురాడి చంద్రశేఖర కల్కూర, సాహితీ స్రవంతి నగర నాయకులు పెరికల రంగస్వామి, డి.అయ్యన్న, యస్.మహేశ్వరయ్య, తదితరులు

## అంపశయ్య నవీన్‌కు పురస్కారం



హైదరాబాద్‌లోని ఇందిరాప్రియదర్శిని ఆడిటోరియంలో డిసెంబర్ 11న భూపతిచంద్ర మెమోరియల్ ట్రస్టు ప్రజ్ఞాపూర్ నిర్వహణలో ప్రముఖ రచయిత అంపశయ్య నవీన్ 'కీర్తిశిఖర 2019 జీవన సాఫల్య పురస్కారం' అందుకుంటున్న దృశ్యం. చిత్రంలో సినీ దర్శకులు బి. నరసింగరావు, మృణాళిని, ఘంటా చక్రపాణి, వేదకుమార్, చిత్రకారులు ఏలె లక్ష్మణ్ తదితరులు.

## కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో విద్యార్థులకు కార్యశాల



గురజాడ వర్ధంతి రోజు నవంబర్ 30న సాహితీ స్రవంతి కాకినాడ శాఖ విద్యార్థులకు ఒక రోజు కార్యశాల నిర్వహించింది. పిఠాపురం రాజా డిగ్రీ కళాశాలలో జరిగిన ఈ కార్యక్రమంలో స్థానికంగా ఉన్న మహిళా కళాశాల, ఐడియల్, ఆదిత్య, పిఆర్ జూనియర్ అండ్ పిఆర్ డిగ్రీ కళాశాలల నుంచి సుమారు వంద మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి పిఆర్ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ చప్పిడి కృష్ణ అధ్యక్షత వహించారు. సాహితి స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు గనారా మాట్లాడుతూ.. "ఇప్పుడు వేమన, గురజాడ, కందుకూరి, శ్రీశ్రీ, అద్దేపల్లి వంటి కవులూ రచయితలూ కావాలి. మెరుగైన సమాజం కోసం యువత పెద్దఎత్తున సాహిత్యం వైపు రావాలి. అందుకోసమే మా ఈ ప్రయత్నం." అని అన్నారు. జిల్లా అధ్యక్షులు జోస్యుల కృష్ణబాబు... కవితా ప్రక్రియల గురించి పిల్లలకు వివరించారు. కవి బొల్లోజు బాబా కవిత్వ నిర్మాణ పద్ధతులు, కవిత్వ భాషపై బోధించారు. ఆధునిక కవిత్వంలో అలంకారాలు, వస్తువు గురించి వివరించారు. పిఆర్ కళాశాల తెలుగు శాఖ అధ్యక్షుడు, కవి సుంకర గోపాలయ్య... కవిత్వం అంటే ఏమిటి? కవిత్వం ఎందుకు? అంశాలపై మాట్లాడారు. సాహితి స్రవంతి నగర బాధ్యులు మార్ని జానకిరామ్ విద్యార్థులు రాసిన కవితలను విశ్లేషించారు. మధ్యాహ్నం ఓ గంట పాటు కథపై అద్దేపల్లి ప్రభు పిల్లలకు రచనా మెలకువలు వివరించారు.



ఈ కార్యశాలలో విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఇలాంటి కార్యక్రమాలకు ఎల్లప్పుడూ వస్తామని సంతోషంగా చెప్పారు. ప్రయత్నం చేయాలి గాని నవతరం సాహిత్యం వైపు మళ్లటం పెద్ద పని కాదు అనిపించింది. ఆసక్తి కలిగిన వారిని ఎంచుకుని చేసిన ఈ కార్యక్రమంలో ఒకరోజులోనే కవిత్వం, కథ నేర్పించలేకపోవచ్చు. కానీ ఇదొక ఆరంభం. ప్రేరణకు దోహదపడే ప్రయత్నం. అందులో సాహితీ స్రవంతి బృందం విజయవంతం అయిందనడం అతిశయోక్తి కాదు.

– సుంకర గోపాలయ్య

## రెంటాల గోపాలకృష్ణ శతజయంతి సభ



హైద్రాబాద్ స్టడి సర్కిల్ ఆడిటోరియంలో డిసెంబర్ 15న ఛాయా రిసోర్సెస్ సెంటర్, రెంటాల స్వర్ణోత్సవ సంఘం సంయుక్త ఆధ్వర్యంలో రెంటాల గోపాలకృష్ణ శతజయంతి ప్రారంభ సభ జరిగింది. ఈ సభకు అధ్యక్షత వహించిన సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ రెంటాల శ్రమ శిక్షణ, క్రమ శిక్షణా కల్గిన నిర్మల, నిజాయితీ కల్గిన జర్నలిస్టు, రచయిత అని పేర్కొన్నారు. ఆయన సృజించని అంశమంటూ లేదని, ఆయన రచించిన, అనువదించిన పలు గ్రంథాలను ప్రజాశక్తి ప్రచురించిందని గుర్తు చేశారు. ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్ మాట్లాడుతూ రెంటాల రచనల్లో ఆవేశం, ఆలోచనా, పదునైనా భాష కన్పిస్తాయని, శివధనువు వంటి రచనల్లో అభ్యుదయ భావం ద్యోతకమవు తుందన్నారు. ప్రపంచంలోని ఉత్తమ సాహిత్యాన్ని తెలుగు వారికి అందించాలని ఉత్తమ అనువాదకుడిగా వేగంగా పలు అనువాద రచనలు చేశారని వివరించారు. బిచ్చగాళ్ల పాటలు కూడా రాసి కవితా వస్తువుకు ఏదీ అతీతం కాదని ఆయన నిరూపించారన్నారు. పాలకుల ప్రాధాన్యతలు మారుతున్న క్రమంలో రెంటాల వంటి వారిని మరో సారి గుర్తు చేసుకోవడం వల్ల సమాజ శ్రేయస్సుకు ఆయన సాహిత్యం దోహదం కాగలదన్నారు. సినీ దర్శక, నిర్మాత బి నర్సింగరావు మాట్లాడుతూ రెంటాల రచనలను తాను చదివానని, సంస్కృతంలో ఉన్న పలు గ్రంథాలను ఆయన తెలుగులో అనువదించి సామాన్యులకు చేరువ చేశారని పేర్కొన్నారు. స్వర్ణోత్సవ సంఘం అధ్యక్షుడు కెపి అశోక్‌కుమార్ మాట్లాడుతూ రెంటాల గోపాలకృష్ణ రష్యన్ సాహిత్యాన్ని తెలుగులో అనుసృజన చేశారని వివరించారు. అప్సర్, రెంటాల కల్పన, ఆదిత్య కొర్రపాటి, రెంటాల జయదేవ తదితరులు సభలో పాల్గొన్నారు. ◆

## సిరికి స్వామినాయుడికి నూతలపాటి పురస్కారం



గంగాధర సాహితీ కుటుంబం 'నూతలపాటి సాహితీ సత్కారం' అందిస్తున్నట్లు సంస్థ కార్యదర్శి నాగోలు కృష్ణారెడ్డి ఒక ప్రకటనలో తెలిపారు. 2018 సంవత్సరానికి గాను సిరికి స్వామినాయుడు కవితా సంపుటి 'మట్టిరంగు బొమ్మలు' పుస్తకం ఈ పురస్కారానికి ఎంపికయ్యిందని తెలిపారు.

## శ్రీరామ్ కి రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం



రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం 2019 సంవత్సరానికి గాను శ్రీరామ్ కవితా సంపుటి 'అద్వంద్వం' పుస్తకాన్ని ఎంపిక చేసినట్టు రంగినేని ట్రస్ట్ అధ్యక్షులు రంగినేని మోహన్ రావు, అవార్డు కమిటి కన్వీనర్ మద్దికుంట లక్ష్మణ్ ఒక ప్రకటనలో తెలిపారు.

## ఉమ్మడిశెట్టి సత్యాదేవి సాహితీ అవార్డు - 2019

32వ ఉమ్మడిశెట్టి సత్యాదేవి సాహితీ అవార్డు – 2019 కోసం కవులు తమ కవితా సంపుటాలను పంపవలసిందిగా అవార్డు వ్యవస్థాపకులు డా॥ ఉమ్మడిశెట్టి రాధేయ ఒక ప్రకటనలో కోరారు. ఈ అవార్డు కోసం 2019లో ప్రచురించబడిన కవితా సంపుటాలు మాత్రమే పంపాలి. ఎంపికయిన ఉత్తమ కవితా సంపుటికి ఐదువేల రూపాయల నగదు బహుమతి అందజేయబడుతుందని తెలిపారు. జనవరి 30 వ తేదిలోపు 4 ప్రతులను డా॥ ఉమ్మడిశెట్టి రాధేయ, ఛైర్మన్ ఉమ్మడిశెట్టి లిటరరీ ట్రస్ట్, 31-1-606-1, షిర్డినగర్, రెవిన్యూ కాలనీ, అనంతపురం- 515001. ఇతర వివరాలకు 9985171411 ద్వారా సంప్రదించవచ్చును. ◆

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# త్రిపురనేని రామస్వామి చౌదరి

**15.1.1887 - 16.1.1943**



హేతువాద ఉద్యమానికి ఊపిరి పోశారు. వైదిక ప్రాబల్యాన్ని సవాలు చేసే 'ఖూనీ', 'శంబుక వధ' వంటి నాటకాలు రాశారు. 'సూతపురాణం' తదితర కావ్యాలు వెలువరించి సంచలనం కలిగించారు.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M334 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Madh MADHU |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | K.Daveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |